


అక్కడి పర్వతాలు ఎరుపు
అక్కడి పువ్వులు ఎరుపు
అహో! వాళ్ళ మరణం ఎరుపు
వాళ్ళకు మా జోహార్లు ఎరుపు...

# సృజన

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

మే 1983

**139**

MONUMENT OF THE GIRIJAN PEASANT MARTYRS

గిరిజన రైతుకూలి మృతవీరుల స్మారక స్థూపము

आदिवासी मृतवीरों का श्रद्धांजली स्मारक स्तूप

RED SALUTES TO THE GIRIJAN PEASANT HEROES

WHO ARE BRUTALLY MURDERED BY

THE POLICE AT INDRAVELLY

ON APRIL 20th 1981

సృజన పాఠకులకు, రచయితలకు,

మేడే విప్లవాభినందనలు

100 పేజీలు

ఈ సంచిక 3 రూపాయలు

# 'ఆంధ్రా ఖొమేనీ' పాలనలో
# మళ్ళీ ఆరంభమైన 'ఎదురుకాల్పులు'

'అన్న'కు పోలీసు పాత్రఅంటే చాలఇష్టం. ముప్పై, నలభైఏళ్ళకింద 'నాదేశం' సినిమాలో పోలీసు ఇన్స్పెక్టర్‌పాత్ర వేసినప్పుడయినా, ఎన్నికలకు ముందు తెలుగుదేశంపార్టీ నాయకుడుగా ఖాకీవేషం వేసుకున్నప్పుడయినా, ముఖ్యమంత్రిగా 'సన్యసించి' కాషాయాంబరాలు వేసుకున్నప్పుడయినా ఆయనకు ఆదర్శం పోలీసుపాత్ర. అందుకే టంగుటూరులో పొగాకురైతులపై పోలీసుకాల్పులను ఆయన ఖండించలేదు. హతుల కుటుంబాలను పరామర్శించలేదు. చంపబడ్డవాళ్ళు ఆవేశపడ్డారని మందలించాడు. సినిమాల్లో పోలీసు అధికారిపాత్ర నిర్వహించినప్పుడల్లా విధినిర్వహణలో తండ్రి, సోదరుడువంటి బంధుప్రీతి పాటించని ఆదర్శపురుషుడు అన్నపురెడ్డిపల్లిలో కాంట్రాక్టు ముగిసిన కాంట్రాక్టరు తరఫున చెరువులో చేపలుపట్టుకుని బతికే గిరిజనులమీద కాల్పులుజరపడానికి వెనుకాడలేదు.

ఆయన కోటీశ్వరుడా? త్యాగపురుషుడా? రెండువందలమంది ప్రజా ప్రతినిధుల అధికారాన్ని గుప్పిటలోపట్టుకున్న నియంతా? సర్వసంగ పరిత్యాగిఅయిన సేవాపరుడా? ఈ చర్చంతా పామరులకు మనకుగానీ, అజ్ఞానులకు మనకుగానీ, భౌతికవాదులైన మనకుగానీ గజంమిథ్య పలాయనంమిథ్య అని సర్వంమిథ్యావాదాన్ని ఉపదేశించిన సాక్షాత్ శంకరభగవత్పాదులను ఎదురేగి ఆహ్వానించిన ఆయన పట్టిందే కాపట్యం కాని, వేసుకున్నది కాషాయాంబరాలు. ఆయన రాని నిధులతో లేనినీళ్ళు రప్పించడానికి రాళ్ళువేసే భగీరథుడు. ఆస్తంతా ట్రస్టుగామార్చి నాచారంభూమికి భూఆక్రమణ గ్రహచారంపట్టకుండా ఆశ్రమంనిర్మించుకొని శంభుకుణ్ణి చంపిన భద్రాద్రిరాముణ్ణి సేవించడానికి వచ్చాడుగానీ కనీసం అన్నపురెడ్డిపల్లిలో ఏం జరిగిందో తెలుసుకోవడానికిరాలేదు. న్యాయవిచారణ జరిపించలేదు.

గతం సంగతిపోనీ, అసెంబ్లీ ఎన్నికలనుంచైనా, ఎన్నికలు అయిపోయి తాను ముఖ్యమంత్రి అయ్యాకనయినా వరంగల్ పట్టణంలోనూ, జిల్లాలోనూ భూస్వాములు, సారాకాంట్రాక్టర్లు ప్రజలపై, ప్రజాకార్యకర్తలపై హరిజన గిరిజనులపై చేస్తున్న దౌర్జన్యాలగురించి హింసాకాండగురించి, అన్యాయాలగురించి ఆయన పల్లెత్తుమాట మాట్లాడలేదు. కామ్రేడ్ రమణను భూస్వాములు హత్యచేస్తే, అతని తల్లిని, భార్యను, ఇరుగమ్మను, పొరుగమ్మను పోలీసులుకొట్టి, బూతులుతిట్టి కడుపుశోకానికి అవమాన ఆక్రోశాన్ని తోడుచేస్తే ఈ అనాథస్త్రీ తోబుట్టువుకు పట్టలేదు. కాని హనుమకొండ చౌరస్తా సంఘటన గురించి హైదరాబాదునుంచి ఢిల్లీదాకా గుండెలు బాదుకున్నాడు. నేరశిక్షాస్మృతి మరి బిగించాలన్నాడు. ప్రజాస్వామ్యం వేషంవిప్పేసి ప్రజాప్రతినిధుల సభలోనే 'తుపాకికి జవాబు తుపాకితోనే ఇస్తాన'ని తన నిజస్వభావం బయటపెట్టుకున్నాడు. ఇంక ఎన్టీఆర్ 'ఎన్‌కౌంటర్లు' జవాబుకాక ప్రజా సమస్యల పరిష్కారానికి ఆలోచించగల క్లైమాక్సు ఏమున్నది?

ఆదిలాబాదుజిల్లాకు మహారాష్ట్రకు సరిహద్దు గ్రామం రత్నాపూర్. అది కాకులు దూరని కారడవిలో, చీమలుదూరని చిట్టడవిలో గుట్టమీద వున్నది. అక్కడి గిరిజనులకు తాగడానికి ఒక చేదబావి కూడలేదు. గుట్టదిగి నీళ్ళు తెచ్చుకోవాలి. వాళ్ళ ఆలనాపాలనా పట్టించుకోవడానికి ఎవరొస్తారు? ఇప్పుడక్కడున్న పోలీసు క్యాంపులో ఒక హెడ్‌కానిస్టేబుల్ అన్నట్లు 'వస్తే నక్సలైట్లురావాలి. వాళ్లొస్తే మేంరావాలి' అట్లాగే జరిగింది. ఇక్కడికి పీపుల్స్‌వార్ కార్యకర్తలను ఆత్రం అశోక్ తెచ్చాడు. ఉపసర్పంచ్ తాగి చిట్టి పట్వారికివెళ్ళి ఫిర్యాదు చేసాడు. కనుక మంచెమీద నిద్రపోతున్న ఆత్రం అశోక్‌ను- ఒక గిరిజన యువకుణ్ణి- నక్సలైట్లను ఊళ్ళోకితెచ్చిన నేరానికి అర్ధరాత్రి కాల్చిచంపి పోలీసులు 'ఎన్‌కౌంటర్'లో మరణించాడని ప్రకటించారు. తర్వాత జీపుమీదవచ్చి కాలినడకన గుట్టఎక్కి కలెక్టర్, ఎస్పీలు అతని సహపథువుకు వెయ్యిరూపాయలు బహుమానం ఇచ్చారు. నక్సలైట్లను రాకుండా చేయడానికి 'తుపాకీని తుపాకీతో ఎదుర్కోవడానికి' ఆత్మరక్షణకోసం గ్రామస్తులకు తుపాకీ ఇస్తామన్నారు. తెలుగుదేశంపార్టీ పాలనలో ఇది మొదటి ఎన్‌కౌంటర్ కట్టుకథ అనీ, ఇందులో నక్సలైట్ కూడాకాని ఒక గిరిజన యువకుడు నిద్రలోవుండగా పోలీసులతో నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ్డాడని ప్రజాస్వామ్యవాదుల దృష్టికైనావచ్చినట్లులేదు. ఎందుకంటే పోలీసులు అశోక్‌ను 'చంపిన' కేసులో మరో ఇద్దరు గిరిజన యువకులనే అరెస్టుచేసి జెయిల్లో పెట్టారు! (ఎన్టీరామారావు తెలివితేటలు ఇందిరమ్మకు మించినవికావని ఎవరన గలరు!)

పోలీసులు కూడ ప్రకటించిన 'ఎన్‌కౌంటర్' వరంగల్ జిల్లా వర్ధన్నపేట తాలూకా ఏసుగల్లు దగ్గర చంద్రగిరితండాలో జరిగింది. ఇది కూడ మళ్ళీ గిరిజన ప్రాంతం అన్నది గమనించదగ్గ విషయం. హతుడు స్థానిక భూస్వాములకు, సారా కాంట్రాక్టర్లకు, పోలీసులకు కంటకుడు, పెంపటాపు సత్యం, కైలాసాలను పోలీసులు కాల్చిచంపినప్పుడు ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో జలగం వెంగళరావు వాళ్ళను రాక్షసులతోపోల్చాడు. మళ్ళీ ఇన్నాళ్ళకు అరిభయంకరుడైన కామ్రేడ్ హరిభూషణ్‌ను 'జాతీయవాదులు' (వరంగల్ జిల్లాలో పరమహంసల పరిభాషలో పోలీసులకు ముద్దుపేరు) రాక్షసుడని వర్ణించారు. విప్లవరచయితలను, పౌరహక్కుల బాధ్యులను దొంగలముఠాగా అభివర్ణించారు.

భూస్వాములు హత్యలుచేసినపుడు, మానభంగాలు చేసినపుడు, ప్రభుత్వ భూములు హరిజన, గిరిజన, పేదవర్గాల ప్రజలభూములు ఆక్రమించుకున్నప్పుడు పట్టించుకోని ప్రభుత్వం కామ్రేడ్ హరిభూషణ్ నాయకత్వంలో ప్రజలు ఈ దౌర్జన్యాలను ప్రశ్నించినపుడు, ప్రతిఘటించినపుడు యువతరం హింసావాదానికి లోనవుతున్నదని ఆందోళనపడుతున్నది. గగ్గోలుపెడుతున్నది. తరతరాలుగా ప్రజలను

బూతుమాటలతోతప్ప పిలవనిదొరలు, గడీల్లో, కచేరీల్లో వట్టిగా స్త్రీ పురుషులను అవమాన పరిచే పెత్తందారులు ఇవ్వాళ రాడికల్స్ తమనుతిడుతున్నారని, అవమాన పరుస్తున్నారని, ప్రజల్లోపెట్టి విచారిస్తున్నారని ఫిర్యాదులు చేస్తున్నారు. ఒకరిని చంపినకేసులో, ఒకరిదగ్గర లంచంతీసుకున్నకేసులో బదిలీ, సస్పెన్షన్ అనుభవించిన పోలీసుఅధికారి, సకల దుర్వ్యసనపరుడైన దొరకోసం - హరిభూషణ్ ను పట్టుకొని కాల్చివేయడమే తన 'పవిత్రకార్యం'గా భావించడంలో ఆశ్చర్యమేముంది! అన్యాయాలను, అక్రమాలను ఎదురిస్తూ రెండుసంవత్సరాలుగా తన మృత్యువు ఇట్లాగేవస్తుందని రూఢిగా తెలిసినా పేద లంబాడీ ప్రజలమధ్యన పనిచేస్తున్న అతని హిమాలయోన్నతమరణం ఆ పోలీసుఅధికారికి 'చెత్త'గా కనిపించడంలో వింతేముంది? తనకువున్న దుర్లవాట్లన్నీ అతనికి ఆపాదించి ప్రచారంచేసారు. అతడు అరికట్టడానికి పోరాడిన సాంఘిక, సాంస్కృతిక దురాచారాలన్నీ అతనిపై ఆరోపించి బురద చల్లజూశారు. ఒకవిద్యావంతుడైన, చైతన్యవంతుడైన హరిజనయువకుడు తనగ్రామంలో హరిజన, బలహీనవర్గాలను, పరిసర గిరిజన, గ్రామీణ పేద జనులను చైతన్యవంతుల్ని చేసిన నేరానికి దొరలతరఫున, సారా పెత్తందార్ల తరఫున పోలీసులను పంపించాడు ఎన్టీఆర్. ఈ ప్రాంతాల్లోనే సర్వంపేటలో ఎన్నికలకు ముందు 'నక్సలైట్లకుజోహార్లు' చెప్పాడు. వాళ్ళు దేశభక్తులు త్యాగపురుషులు అన్నాడు. ఇప్పుడు గోవిందరావుపేటకువచ్చి మీకు నక్సలైట్లతో భయమేమయినా వుందా అని గిరిజనేతర మైదానప్రాంతాల భూస్వాములను, కాంట్రాక్టర్లను అడుగుతున్నాడు. ఏలేశ్వరంలోనూ, ఏటూరునాగారంలోనూ గిరిజనేతరులు ఆక్రమించుకున్న గిరిజనభూములు చట్టబద్ధంగాకూడ గిరిజనేతరులకుచెందే అవకాశాలు పరిశీలిస్తానన్నాడు. (ఎవరు ఆక్రమించుకున్న భూముల్లో వాళ్ళు ఆశ్రమాలువేసుకొని గిరిజనుల రక్తంలోతడిసిన కాషాయాంబరాలు వేసుకుంటే ఇంకతిరుగులేదు.) పోచంపాడుకువెళ్ళి ఇక్కడే రామునికి పెట్టడానికే శబరి రేగుపండ్లు ప్రోగుచేసిందిగనుక ఆటవికులు ప్రోగుచేసినసంపదఅంతా తనవర్గానికే ఉమఊపిరితో మట్టి ఊడిపెట్టాలన్నాడు.

పదిరికుప్పం హరిజన గృహ దహనాలతో ప్రారంభమైన 'రాజయోగి' రామరాజ్యం రక్షిస్తున్న విశ్వామిత్రయజ్ఞానికి బలిపశువులంతా హరిజన, గిరిజనులు, రైతులు, వాళ్ళలో ప్రతిఘటననునిర్మించి ప్రజలమధ్యన పనిచేస్తున్న విప్లవకారులు. జనతా అసమర్థత 'ఎమర్జెన్సీ'ని ఇందిరా 'ప్రజాస్వామ్యం'గా మార్చినట్లే ఎన్టీఆర్ 'సమర్థత'కూడ ఇందిరా నియంతృత్వమే ఇంతకన్నామేలనే భ్రమలను బలహీన వర్గాల్లో తిరిగి రేకొలిపితే ఆ బాధ్యత ఎవరిది?

— సంపాదకుడు

12-5-83

# ఆదిలాబాద్ గిరిజన పోరాటాలు

కె. బాలగోపాల్

"గిరిజనుడికి అడవి తన స్వగృహంలాంటిది. అతని పురిటిల్లయినా ఉయ్యాల అయినా అడివే. చెట్లతోబాటు, జంతువులతోబాటు, గిరిజనుడు ఆ అడవి వెచ్చటి ఒడిలో పెరుగుతాడు. ఒకరిహక్కులను ఒకరు భంగపరచుకోకుండ, సామరస్యంగా. ఈ ప్రాణులన్నీ అడవిలో జీవిస్తాయి. చేపకు నీరెలాంటిదో గిరిజనుడికి అడవి అలాంటిది. ప్రతీ అడవిశబ్దాన్ని గుర్తించగలడు, ప్రతీపక్షిపేరు, మొక్కపేరు, జంతువు పేరు, చివరికి కీటకాలపేర్లుగూడ చెప్పగలడు. అతను అడవిని ప్రేమిస్తాడు, ఆ అడవి ప్రేమకు, ఆరాధనకు పాత్రుడవుతాడు. కేవలం షికార్‌కోసం అతనెన్నడూ జంతువులను చంపడు. ఉబుసుపోకకు ఎన్నడూ ఒక్కచెట్టునూ నరకడు. అతను ప్రకృతిబిడ్డ. ప్రేమమయి అయిన తల్లిలాగా ప్రకృతి అతన్నిపోషించి, లాలించి, సంరక్షిస్తుంది".

ఆధునిక విశ్వవిద్యాలయ సామాజిక శాస్త్రవేత్తలకూ వెన్నెలకంటి రాఘవయ్య గారికీ ఒకతేడావుంది. ఆయనలో శాస్త్రీయపరిశోధన ఎక్కడ అంతమవుతుందో, ఆవేశ అభిమాన అతిశయం ఎక్కడ ప్రారంభమవుతుందో చెప్పడంకష్టం. అది గాంధీభక్తిగానీ, లేక హాయిగా స్వేచ్ఛగా అడవులలో జీవిస్తారని పట్టణప్రాంత మేధావుల చేత ఊహించబడే గిరిజనులపట్ల ప్రేమగాని, వాటి వ్యక్తీకరణకు ఇబ్బందికరమయిన వాస్తవాలను అడ్డంరానివ్వడు.

రాజ్యం, లేకప్రభుత్వం నాగరిక సమాజంలో ఒకబలమయిన నిర్బంధక శక్తి. అది గిరిజనుల ఆదిమవ్యవస్థలో వుండదు. ఆ కారణంగా నాగరికులు- అందులో మరీ ముఖ్యంగా విశృంఖలతను ప్రేమించే పెటీబూర్జువా మేధావులు- గిరిజనులు 'స్వేచ్ఛ'గా జీవిస్తారనుకుంటారు. కాని రాజ్యం కేవలం ఒకానొక నిర్బంధకశక్తి మాత్రమే. అది ప్రత్యక్షంకావడంవల్ల, మన విశ్వాసాలలో భాగంకాకుండ బయటి నుండి మనమీద పనిచేయడంవల్ల, అదొక్కటే నిర్బంధకశక్తిగా కనిపించడం సహజం. కాని నిజానికి అంతకంటె బలీయమయిన ఆచారాలు గిరిజనులను కట్టి వేస్తాయి. అజ్ఞానంనుండి, భయంనుండి పుట్టిన ఈ ఆచారాలు అన్ని విషయాల లోనూ ప్రామాణికతను నిర్దేశిస్తాయి. వేటాడినా. వ్యవసాయంచేసినా, వయసొచ్చినా, ఏదీ 'స్వేచ్ఛ'గా జరగదు, ఆచారాలను అనుసరించి జరగాలి. ఆ నియమాలు గిరిజనుడిమీద బయటినుండి చొప్పించబడవు. అతని విశ్వాసాలలో అవి

భాగమయివుంటాయి. కాబట్టి నిర్బంధంగా కనిపించకపోవచ్చు, కాని కనిపించేదే వాస్తవమనుకోవడం చాలా పేలవమయిన దృక్పథం. అంతేకాకుండా, గిరిజనుడు ప్రకృతితో పూర్తిగాసామరస్యంగా జీవించడు. సామరస్యమూవుంటుంది, ప్రకృతితో పోరాటమూ వుంటుంది. పోరాటమే ప్రధానంగా వుంటుంది. ఈ విషయాలన్నీ చెప్పడం కీర్తిశేషులయిన రాఘవయ్యగారి ఆత్మకు విద్యాబోధ చేయడానికికాదు, విప్లవ రచయితలు గిరిజనుల జీవితాన్ని romanticise చేయకూడదని హెచ్చరించడానికి.

కొద్ది అభివృద్ధి చెందిన దశలో ప్రకృతితో గిరిజనుడి పోరాటం ప్రధానంగా భూసారాన్ని ఆధారించుకొని వుంటుంది. భూమి ఎక్కడ సారవంతమయి ఉంటుందో అక్కడే అడవి దట్టంగా వుంటుంది, వ్యవసాయంగూడ అక్కడే ఫలవంతమవుతుంది. ఉబుసుపోకకు గిరిజనుడు చెట్లను నరకడన్నది వాస్తవమే, కాని సారవంతమయిన భూమికోసం అడవితో పోరాటం తప్పదు. భూమి అంతగా సారవంతం కానిచోట అడవిపల్చగా ఉండవచ్చు, కాని ఆనేల మీదగూడ భుక్తిని పొందడం కోసం పోరాటం చేయాలి. ఇది మరీ నికృష్టమయిన వైరుధ్యం. ఫలమివ్వని నేలమీద ఫలంకోరే శ్రమపడే ఆరాటం.

ప్రకృతితోటి పోరాటంలో ఆదిలాబాద్ గిరిజనులు ఒకరకంగా అదృష్టవంతులు. ఆదిలాబాద్ నేల చాలా సారవంతమయినది. లోతుగా దున్నవలసిన అవసరం లేకుండా గిరిజనులకు అలవాటయినపోడు వ్యవసాయంతోనే జీవితం వెళ్ళబోసుకోవచ్చు. కొంత ప్రాంతంలో అడవి నరకడం, మూడో నాలుగో పంటలు తీయడం, తరువాత ఆ ప్రాంతంలో భూసారం క్షీణిస్తుంది కాబట్టి దాన్ని బీడుపెట్టి మరికొంత అడవిని నరకడం, అక్కడి నుండి మళ్ళీ మరొక ప్రాంతానికి పోవడం, ఇట్లానడుస్తుంది పోడువ్యవసాయం. ఇట్లా ఎన్నిశతాబ్దాలపాటు ఆదిలాబాద్ గిరిజనులు జీవించారో గాని, 20వ శతాబ్దం వరకు వాళ్ళను ఎవ్వరూ ఇబ్బందిపెట్టినట్టు కనిపించదు. 20వ శతాబ్దంలోనయినా వాళ్ళను ఇబ్బంది పెట్టడానికి ఆ భూసారమే కారణమయింది. ఆదిలాబాద్ అడవులు టేకుఅడవులు. నేల నల్లరేగడినేల. వాటినిచూసి ఎవరికయినా నోరూరడం సహజం. నిజాం నవాబులనోరు 20వ శతాబ్దం వరకు ఊరలేదంటే, ఫ్యూడల్ ప్రభుతకు సహజమయిన అలసత్వమే దానికి కారణం. చివరికి, చుట్టూవున్న బ్రిటిష్ పాలిత ప్రాంతాలనుచూసి, ఆ నేలలో పత్తిపండిస్తేనూ, ఆ అడవు

లను కలపవ్యాపారానికి వాడుకుంటేచా, తనకెంత రెవెన్యూ వస్తుందోకదా అని నిజాం నవాబు లెక్కవేసుకున్నాడు.

పత్తిని విస్తృతంగా వ్యాపారపంటగా పండించే అలవాటు మనదేశానికి బ్రిటిష్ వాళ్ళ వల్లవచ్చింది. చాలా ప్రాచీనకాలంనుండి మనదేశం నాణ్యమయిన నూలుబట్టల ఉత్పత్తికి ప్రసిద్ధం. అయితే గతంలో రవాణాసౌకర్యాలు అపరిణతంగా వుండడం వల్ల ఏ గ్రామానికి ఆ గ్రామం కాకున్నా ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం తనకు అవసరమయిన పత్తి పండించుకునేవి. ఇవ్వాళ పత్తిపంట సాపేక్షికంగా అరుదయిన బెంగాలు గూడ ఒకప్పుడు ఢాకా నూలువస్త్రాలకు అవసరమయిన పత్తి తానే పండించుకునేది. బ్రిటిష్ వాళ్ళు రైల్వేలైన్లు వేసిన తరువాత ఈ పరిస్థితి మారింది. పత్తి పంటకు లాయకయిన ప్రాంతాలలో పత్తి మాత్రమే విస్తృతంగా పండించడం ప్రారంభమయింది. బెంగాల్ వంటి ప్రాంతాలు తమకు కావలసిన పత్తిని దాదాపు మొత్తం దిగుమతి చేసుకోవడం మొదలుపెట్టాయి. ఈ పరిణామంవల్ల, ఆయా ప్రాంతాలలో భూమిశిస్తుమీద, రవాణాసుంకాలమీద బ్రతికే రాజులకూ నవాబులకూ జాగీర్దార్లకూ ఆదాయం పెరిగింది. కాబట్టి వాళ్ళు తమ సంస్థానాలలో పత్తిపంటను ప్రోత్సహించడం మొదలుపెట్టారు. దేశంలో నూలుమిల్లుల సంఖ్య పెరిగేకొద్దీ ఈ ప్రోత్సాహం కూడ తదనుగుణ్యంగా పెరిగింది. ఆదిలాబాద్ అడవులలోని నల్ల రేగడినేల పత్తికి లాయకయినదన్న ఆలోచన 20వ శతాబ్ది ఆరంభంలో హైదరాబాద్ నిజాంకూ వచ్చింది.

మరి దానికోసం ఏంచేయాలి? గోండ్లనూ కోలాంలనూ నాయక్‌పోడ్‌లనూ కూర్చోబెట్టి పత్తి ఎట్లాపండించాలో నేర్పించి వాళ్ళను పూర్తిగా వ్యవసాయదార్లగా మార్చడం. అది ఒక పోషలిస్టు ప్రభుత్వం చేసేపని. కాని దోపిడీదారయిన నిజాం నవాబుకు అంత ఓపిక ఎక్కడిది? ఆయన గిరిజనుల అడవులను గిరిజనేతర భూస్వాములకు వేలంపాడి పట్టాచేయించాడు. ఈ రకంగా ఆసిఫాబాద్ ప్రాంతంలో (ఆదిలాబాద్ జిల్లాకు ఉత్తరభాగం) కొన్ని వేలఎకరాలను బ్రాహ్మణ, ముస్లిం, వెలమ భూస్వాములు చేజిక్కించుకున్నారు. వీళ్ళు వ్యవసాయదారులు కారు దొరలు. దక్షిణాన కరీంనగర్‌ను ఆనుకొనివున్న లక్సెట్టిపేట దొరలు కొందరు ఇలుకదలకుండ ఈ భూములను కొనుక్కున్నారు. కాబట్టి కొనుక్కున్న భూములను సాగుచేయడం కోసం కాపు, మరాఠా, కున్బి, తదితర కులాలరైతులను (ఆంధ్ర నుండి, మహారాష్ట్ర నుండి) రప్పించి కౌలుదార్లగా నియమించారు. గిరిజనులకు భూమి పోతే

పోయింది. కనీసం ఆ భూమిలో జీతానికో కౌలుకో పనిచేసే 'భాగ్యం'గూడ లేకుండ పోయింది. ఆసిఫాబాద్ వదిలి అడవిలోపలి ప్రాంతానికి వలసపోవలసి వచ్చింది. ఇది ఒక దెబ్బ.

రెండవదెబ్బ దీనిమీద రోకటిపోటులయింది. కలపవ్యాపారంకోసం, దాని నుండి వచ్చే రెవెన్యూకోసం. అడవుల్ని 'సంరక్షించడం' 1920లలో మొదలయింది. గిరిజనగూడాలచుట్టూ సాగులోవున్నభూమిని మినహాయించి మిగిలినఅడవిని 'రక్షిత' అడవులగా ప్రకటించారు. అయితే గిరిజనులుచేసేది పోడువ్యవసాయం కాబట్టి ఇవ్వాళ సాగులోవున్న భూమిని రేపు సాగుచేయరు. లోతుగాదున్నడం, నీళ్లు పెట్టడం, ఎరువులువేయడం ఉండవుకాబట్టి అది భూసారాన్ని కోల్పోతుంది. కాబట్టి మిగిలిన భూమినంతా రక్షితఅడవిగా ప్రకటించి అక్కడ చెట్లునరకడాన్ని వ్యవసాయంచేయడాన్నీ నిషేధిస్తే, గిరిజనులజీవనం అసాధ్యమయిపోతుంది. అడవినరికి ఫారెస్టుడిపార్ట్‌మెంటుతో ఘర్షణకయినా దిగాలి, లేదా గూడెంవదిలి అడవి లోతట్టుప్రాంతానికయినా పోవాలి. అట్లా ఘర్షణకుదిగినవారిలో కొమురం భీము ఒకడు.

భీముది ఆసిఫాబాద్ దగ్గర సంకేపల్లిగ్రామం. అడవిభూములను భూస్వాములకు పట్టాచేసిన కార్యక్రమంలో విస్తృతంగా దెబ్బతిన్నది ఆసిఫాబాద్‌ప్రాంతం. ఈ ఆక్రమణగురించి ఆస్ట్రియాకుచెందిన సామాజిక శాస్త్రవేత్త హెమెండార్ఫ్ చాలావిషయాలు చెప్తాడు. మానిక్‌గడ్ కొండలదగ్గర కేవలం 10 గిరిజనేతర కుటుంబాలు 10 వేల ఎకరాలు పట్టాచేయించుకున్నాయట. మందమర్రి భూస్వామి ఈ శతాబ్ది ఆరంభంలో కరీంనగర్‌నుండి వలసవెళ్ళి 1946 నాటికి 8 వేలఎకరాలు సంపాదించుకున్నాడట. గిరిజనేతర భూస్వాములకు ఇంతటి భారీపరిమాణంలో భూములు దొరికాయి. కాని అదేఅడవిలో గిరిజనులకు పట్టాలుకావాలంటే దొరికేవికాదు. దానికి మూడుకారణాలు కనిపిస్తాయి. ఒకటి, ఈ పట్టాలిచ్చేకార్యక్రమం వెనకవున్నఉద్దేశ్యం పత్తిపంటను విస్తృతంచేయడం. ఆ పనికి ఆనాటికి గిరిజనులా సమర్థులుకారు. రెండవది, పట్టారావాలంటే పట్వారీల సహాయసహకారాలు కావాలి. దానికిపైరవీలు, లంచాలు, అవసరం. గిరిజనులకు ఇవేవీసాధ్యంకావు. మూడవది, పోడువ్యవసాయం చేసుకునేవారికి నిజానికీ పట్టాలుతీసుకోవడంలోగూడ ఇబ్బందివుంది. స్థిరంగా ఒకే కమతంమీద వ్యవసాయంచేసేవారు పట్టాతీసుకోగలరుగాని, అడవి

ఉంటారు ? అందుకే అంతకుపూర్వంగూడ గిరిజనులు నిజాంప్రభుత్వానికి శిస్తు చెల్లించేవారుగాని, భూమికిపట్టాలేదు. ఆ సంవత్సరం ఎంతభూమిలో పంటవేసారో దాన్నిబట్టి శిస్తుకడుతూవుండేవారు. దీనిని సివా-ఇ-జమాబంది అంటారు. (సివా అంటే మినహాయింపు. జమాబందిఅంటే పట్టాఇవ్వడంద్వారా శిస్తు ఖరారుచేసే పద్ధతి. ఇంగ్లీష్‌లో revenue settlement). ఈ సౌకర్యాన్ని మొదట్లో నిజాం ప్రభుత్వమే గిరిజనులకు కల్గించింది. అడవి గిరిజనులదే అయినంతకాలం బాగానే నడిచిందిగాని, అడవిభూమిలో జమాబంది ప్రారంభించినతరువాత ఈ సౌకర్యమే గిరిజనులకు ఉరితాడయింది. కరీంనగర్, లక్సెట్టిపేట. ప్రాంతాలనుండి భూస్వాములువచ్చి వేలకువేలఎకరాలను పట్టాచేసుకుంటే గిరిజనులుచూస్తూ ఊరుకోవాల్సి వచ్చింది. తరతరాలుగా గిరిజనులు ఆ భూమిని సాగుచేస్తున్నారు. శిస్తుగూడ నిజాం ప్రభుత్వానికి చెల్లిస్తున్నారు. కాని పట్టామాత్రంలేదు. ఆ భూస్వాములుగూడ చాలా తెలివిగా ప్రవర్తించేవారని హెమెండార్ఫ్ అంటాడు. వాళ్లు అడవులను పట్టాచేయించుకోకుండ, గిరిజనులు సాఫుచేసిన భూములనుమాత్రమే చేయించుకునేవారు. ఆ భూములనుండి బేదఖల్‌చేయబడ్డ గిరిజనులు మళ్ళీ వేరేఅడవికిపోయి కొంతకాలం సివా జమాబంది ప్రాతిపదికమీద పోడువ్యవసాయంచేసిన తరువాత భూస్వాములు అక్కడికిగూడవచ్చి ఆ భూమినీ పట్టాచేయించుకునేవారు. ఈ రకంగా పులితరిమిన లేడిపిల్లలలాగా గిరిజనులు అడవులన్నీ నిస్సహాయంగా తిరిగారు.

ఇది చాలదన్నట్టు 1920 తరువాత అడవులసంరక్షణ (forest conservancy) మొదలయింది. ఎవరికోసం సంరక్షణ, ఎవరినుండి సంరక్షణ, అంటే కలప వ్యాపారంకోసం సంరక్షణ, గిరిజనులనుండి సంరక్షణ, అనిసమాధానం. భూస్వాముల దాడికి తట్టుకోలేక కొత్తఅడవులను నరకడం మొదలుపెట్టిన గిరిజనులు ఫారెస్టుచట్టాలతోనూ అధికార్లతోనూ తలపడకతప్పలేదు. వాళ్ళనుమెప్పించి లంచాలిచ్చి 'సీదాంచెన్' అంటూ బ్రతకాలి, లేదా మళ్ళీ వలసవెళ్ళాలి. పట్టాలుతీసుకొచ్చే భూస్వాములతోనూ ఫారెస్టు అధికార్లతోనూ నిత్యం పోరాటంచేయడం గిరిజనుల బ్రతుకయింది, ఇరవయ్యవ శతాబ్ద ఆరంభంనుండీ.

అటువంటి ఒకతగువులో భీము చిక్కుకున్నాడనీ, అరెస్టు తప్పించుకోవడానికి పారిపోయి చాలాప్రాంతాలు తిరిగివచ్చాడనీ, అస్సాం తేయాకుతోటలలో కొంతకాలం పనిచేసాడనీ, అక్కడుండగా అల్లూరి సీతారామరాజు నడిపిన మన్య పోరాటాన్నిగురించి విన్నాడనీ చెప్తారు. అదెట్లాగున్నా, 1935 ప్రాంతంలో మళ్ళీ

భీము ఆసిఫాబాద్‌కు తిరిగివచ్చాడు. తిరిగివచ్చి మరికొద్ది గోండు, కొలాం, నాయక్ పోడ్ కుటుంబాలతో బాబేఝురీలో స్థిరపడ్డాడు. బాబేఝురీ ఆసిఫాబాద్‌కు 12 మైళ్లు పశ్చిమానవుంది. అక్కడ 5 సంవత్సరాలున్నాడు. వాళ్ళంతా అడవినరుక్కొని వ్యవసాయంచేయడం మొదలుపెట్టారు. అయితే 1940 నాటికి 'అడవులసంరక్షణ' చట్టాలు వాళ్ళగ్రామానికీవచ్చాయి. పట్టాలులేనివాళ్ళను వెళ్ళిపొమ్మన్నారు. పోనివాళ్ళ ఇళ్లు కాలబెట్టి వాళ్ళను చెల్లాచెదురుచేసారు. అట్లా చెదిరిపోయినవాళ్ళలో కొందరికి బాబేఝురీకి అయిదోఆరోమైళ్ళ దూరానవున్న జోడేఘాట్ (లేక జోడెన్‌ఘాట్)లో స్థిరపడడానికి అనుమతిఇచ్చారు. వాళ్ళలో భీము ఒకడు. ప్రభుత్వం అనుమతి ఇచ్చినాగూడ ఫారెస్ట్‌అధికార్లు గిరిజనులను డబ్బులకోసం హింసించడం మొదలు పెట్టారు. డబ్బులియ్యకపోతే భూమిపట్టా కాయివ్వమనీ, ఇళ్లు కాలబెడతామనీ, బెదిరించారు. భీము హైదరాబాద్‌కువెళ్ళి 57 ఎకరాల ప్రాంతాన్ని సాగుచేసుకోవడానికి అనుమతి తెచ్చుకున్నట్టు చెప్తారని హెమెండార్ఫ్ అంటాడు. అప్పటికీ ఫారెస్ట్ అధికార్లు కనికరించకపోయేసరికి రెవెన్యూడిపార్ట్‌మెంటుకు భీము పిటిషన్ పెట్టుకున్నాడట. (ఇదంతా హెమెండార్ఫ్‌వంటి గిరిజన సానుభూతిపరుల కథనం. ప్రభుత్వ అధికారి అయిన ఆసిఫాబాద్ ప్రధానతాలూక్‌దారు అబ్దుల్ సత్తార్‌సాహెబ్ కథనం వేరేవిధంగావుంది. తాము గిరిజనులకు జోడేఘాట్‌దగ్గర భూమిఇవ్వడానికి సిద్ధమే గాని, తామువ్వగలిగింది భీము ఆశలకు చాలలేదనీ, అతను తనకొక్కడికే 5 గ్రామాల జాగీరుకావాలని కోరాడనీ, సత్తార్‌సాహెబ్ ఆరోపించాడు. ఈ ఆరోపణ విషయం తరువాత చూద్దాం).

ఈ తతంగం ఒకపక్క నడుస్తుండగానే ఒకఫారెస్ట్ రేంజరు వీళ్ళను భూముల నుండి ఖాళీచేయించడానికి వచ్చాడట. గిరిజనులు అతనినీ అతనితోవున్న చౌకీదార్లనూ తన్నిపంపించారట. కేసయింది, అరెస్టువారంట్లు మంజూరయినాయి. 12 రోజుల తరువాత డి.ఎస్.పి స్వయంగావచ్చి, కొంతఘర్షణజరిగాక భీమును, మరోకలఆరుగురు గోండ్లను, అరెస్టుచేసి అక్కడికక్కడే జమానత్‌మీద విడిచిపెట్టాడు. కేసుమొదలయ్యాక మాత్రం భీముగాని అతని తోటివారుగాని కోర్టుకు హాజరుకాకపోయేసరికి, ఆసిఫాబాద్ ఉపతాలూక్‌దారు (second taluqdar) భీమును తదితరులను అరెస్టు చేయడానికి భారీసన్నాహాలతో బయలుదేరాడు. సాయుధులయిన 94 గురు పోలీసులతో వెళ్ళాడు. వెంట ఒకడాక్టరుగూడ ఉన్నాడట. పక్కగ్రామానికిచేరి, లొంగిపొమ్మని భీముకు సందేశం పంపారట. భీము మన్నించాడుకాడు. తరువాతిరోజు

ఉదయం (అది 1940 సెప్టెంబర్‌నెలగాని అక్టోబరు మొదటివారంగాని అయివుండాలి ఉరుసూ లెక్కలప్రకారం 6 అబాన్ 1349 ఫస్లీ) తాలూక్‌దారు జోడేఘాట్‌కువెళ్ళి గోండ్లప్రతినిధులను రప్పించి చర్చలుపెట్టాడు. 500 మందివరకు గోండ్లు దూరంగా నిలబడిచూస్తున్నారు. మూడుగంటలు నిష్ఫలంగా చర్చించారట. కేసుతేదేవరకు శిస్తు వసూళ్ల వాయిదావేస్తామని హామీఇచ్చినట్టు తరువాత తాలూక్‌దారు చెప్పుకున్నాడు. అయినా గోండ్లు సంతృప్తిచెందలేదు. ఆతరువాత ఏంజరిగిందన్న దానిగురించి అభిప్రాయభేదాలున్నాయి. ప్రభుత్వ రిపోర్టు ఒకరకంగాను, తరువాతిసంవత్సరం (1941లో) అక్కడికివెళ్ళి విస్తృతంగా సమాచారంసేకరించిన హేమెండార్ఫ్ మరొకరకంగాను, కాల్పులుజరిగిన కొద్దిరోజులకే హైదరాబాద్‌నుండి నిజనిరూపణ కమిటీగావెళ్ళి రిపోర్టుసమర్పించిన కాంగ్రెస్‌నాయకులు, పత్రికా సంపాదకులు, (రామాచారి, సయ్యద్‌సిరాజుల్ హసన్‌తిర్మిజి, కాశీనాథ్‌వైద్య, నర్సింగరావు) మూడవరకంగాను, చెప్తారు. చర్చలు విఫలమయిన కారణంగా ఈగోండ్లు దాడిచేస్తారని భయపడి చర్చలకు వచ్చిన ప్రతినిధులను కస్టడీలోకి తీసుకోవడం జరిగిందని ప్రభుత్వరిపోర్టు అంటుంది. గోండ్లు పూనకంవచ్చినట్టు ఊగడంమొదలుపెట్టారనీ, అది యుద్ధసంసిద్ధతకు సూచనలనీ, రిపోర్టులో రాసుకున్నారు. కాదు. వాళ్ళను అక్రమంగా కస్టడీలోకి తీసుకోవడంవల్లనే గిరిజనులు కదిలివచ్చారని నిజనిరూపణకమిటీ నివేదిక అంటుంది. గిరిజనులు తమ బర్మార్లతో కాల్పులుజరిపారట. పోలీసులలో ఒక్కరికీ దెబ్బలుతగలలేదు ఈ విషయంలో అధికార్లు, హేమెండార్ఫ్ ఏకీభవిస్తారు. నిజనిరూపణకమిటీ నివేదికమాత్రం గోండ్లు అసలు కాల్పులుజరిపినట్టే చెప్పదు. పైపెచ్చు వాళ్ళ కాల్పులుజరపక పోవడాన్నే పోలీసులు కుట్రగాభావించారట. పోలీసుల బుల్లెట్లనుండి తనమంత్రశక్తిద్వారా రక్షిస్తానని భీము హామీఇచ్చాడు కాబట్టి ముందు పోలీసులు తమమందుగుండుసంతా నిష్ప్రయోజనంగా ఖర్చుపెట్టిన తరువాత వాళ్ళమీదపడి చంపవచ్చుననే పన్నాగంతో గిరిజనులున్నారని పోలీసులు నిర్ణయించుకొని కాల్పులుజరిపారట. మొదటిరౌండు కాల్పులలో ఎవరికీదెబ్బతగలక పోయేసరికి భీము మంత్రశక్తిపట్ల పోలీసులకే భయంపుట్టి మరింతబలమయిన తుపాకులతో కాల్చారట (ఇట్లాంటికథే అల్లూరి సీతారామరాజుగురించికూడా చెప్తారు. ఆయన మంత్రశక్తిపట్ల గిరిజనులకేమోగాని పోలీసులకు మరింత నమ్మకముండిందట. ఆయన పోలీసుస్టేషన్‌మీద రెయిడ్ చేయబోతున్నాడని తెలిస్తే ఆయుధాలన్నిటినీ వదిలిపెట్టి పోలీసులే పారిపోయేవారట!) భీము, మరికొందరు, అక్కడికక్కడే

చనిపోయారు. కొందరు తీవ్రంగా దెబ్బలుతిన్నారు. నిజనిరూపణ కమిటీ రిపోర్టు ప్రకారం మొత్తంమృతులసంఖ్య 14. బాబేఝరీ - జోడేఘాట్ పోరాటం అక్కడితో ఆగిపోయింది. ఈసంఘటనవెనుక గిరిజనులలోని విక్రృతమయిన అసంతృప్తి, అల జడి ఉన్నాయన్నది స్పష్టమే. కాని దీనిని సంథాల్‌పోరాటంతోనో లేక మన్యపోరాటం తోనో సమానమయిన తీవ్రత, విస్తృతి, నిర్మాణం, కలిగిన పోరాటంగా చెప్పవచ్చునా అంటే అనుమానమే. భీము చనిపోకుంటే ఏమయ్యేదోగాని, పోరాటం అపరిణ తంగా వుండగానే జోడేఘాట్ కాల్పులు జరగడంవల్ల అది పూర్తిగా ఎదగకుండానే సమసిపోయింది. చాలా పరిమితమయిన ఈ పోరాటాన్ని గిరిజన తిరుగుబాటు(tribal rebellion) అనడానికి వీలులేదని హెమెండార్ఫ్ గూడ అంటాడు.

ఈ పోరాటాన్ని గురించి, కొమురంభీము గురించి, ప్రభుత్వఅధికార్లు చెప్పిన విషయాలు చాలా ఆసక్తికరమయినవి. వాటికీ, ఇవ్వాళ ప్రజాపోరాటాల గురించి ప్రభుత్వాలుచేసే వక్రీకరణలకూ అణుమాత్రం తేడాలేదు. భీముకు రాజ్యాధికార కాంక్ష వుండిందట. అతను మిగిలిన గోండ్లలాగా అమాయకంగా నిరాక్షరాస్యుడిగా వుండిపోక (దుర్మార్గుడు) ఎక్కడెక్కడికోపోయి ప్రపంచజ్ఞానం సంపాదించుకు వచ్చాడట. అతనికి మహదేవ్ అనే విద్యావంతుడయిన గోండు టీచరు సలహాదారుగా ఉండేవాడట. ఆ ద్రోహి సహాయం లేకపోతే భీము తన దుశ్చర్యలను కొనసాగించ లేకపోయేవాడనీ, జోడేఘాట్ కాల్పుల తరువాత మహదేవ్ ఎక్కడికో పారిపోయా డనీ, అతన్ని గూడ అరెస్టు చేసితీరుతామనీ, జోడేఘాట్ కాల్పుల గురించి రాసిన ప్రభుత్వరిపోర్టు శపథం చేస్తుంది. ఆసిఫాబాద్ ప్రధాన తాలూక్‌దారు అబ్దుల్‌సత్తార్ మాటల్లో చెప్పాలంటే, "భీముకు ఈ ప్రాంతంలో ఒక గోండు రాజ్యాన్ని ఏర్పరచి, ఇక్కడి గోండ్లందరినీ తన పాలనక్రిందికి తెచ్చుకోవాలన్న కాంక్షవుండింది తనకు 5 గ్రామాల జాగీరు ఇమ్మనిగూడ అతను తన్నొకసారికోరాడు." గోండ్లను మోసం చేయడానికి, తనకు మంత్రశక్తివుందనీ, తనతో వుంటే బుల్లెట్లు ఏంచేయవనీ, బుకాయించేవాడట. ఇట్లాగోండ్ల మూర్ఖత్వాన్ని వాడుకొని తానొక జాగీరు పొందా లనో రాజ్యం స్థాపించాలనో పన్నాగం పన్నాడట.

అబ్దుల్‌సత్తార్ సాహెబ్ ఈ ఆరోపణలువేసి ఊరుకోలేదు. ప్రజల నాయకు లకూ ప్రజలకూ మధ్య వైరుధ్యం సృష్టించే దోపిడీవర్గాల సంప్రదాయాన్ని అనుస రించి, భీముచేత మోసపోయిన 'అమాయక గోండ్ల' తరుపున తానేస్వయంగా వకాల్తాపుచ్చుకొని నిజాం ప్రభుత్వానికి అర్జీపెట్టుకున్నాడు. "భీము నక్కజిత్తు

లకు ఈ గోండ్లంతా మోసపోయారు. వీళ్ళకు ప్రభుత్వాన్ని ఇబ్బందిపెట్టే ఉద్దేశ్యం లేదు. కాబట్టి దయవుంచి వీళ్ళను క్షమించి కేసులుకొట్టేయాలి" అని రాసాడు. అంతటితో ఆగక గోండ్ల పేరుమీదగూడ ఒక అర్జీరాసి అంబాదాస్‌రావు, రాంచందర్‌రావు అనే ఇద్దరు గోండ్లచేత సంతకం చేయించాడు. అందులో, "మాకు స్వేచ్ఛగా అడవి నరుక్కునే హక్కు ఇప్పిస్తానని కొమురంభీము చెప్తేవచ్చాము. మీరు జోడేఘాట్‌కు వస్తున్నారనీ, బంజరు భూములకోసం మీకు అర్జీ సమర్పించుకుందామనీ, మాతో చెప్తే అనాడు జోడేఘాట్‌కు వచ్చాము. మీరు మమ్మల్ని అక్కడి నుండి వెళ్ళి పొమ్మన్నప్పుడు వెళ్ళిపోయే వాళ్ళమేగాని, భీము తన చుట్టావున్న మంత్రివలయాన్ని దాటితే ప్రాణాలుపోతాయని బెదిరించాడు కాబట్టి కాల్పులు జరిగేదాకా భయపడుతూ అక్కడే వున్నాము. తూటాలను తాను చేతులతో ఆపేస్తాననీ, మింగేస్తాననీ, భీము హామీ ఇచ్చాడు" అని వాళ్ళచేత అనిపించాడు. అతనికి గోండ్లపట్ల నిజంగా ప్రేమవుందని అనుకునే అవకాశం వుంది కాబట్టి, గోండ్ల భూమిసమస్య గురించి అతనే ఏమంటాడో చెప్పుకోవాలి. ప్రస్తుత ప్రభుత్వ విధానాన్ని మార్చుకోవలసి ఉంటుందా అన్న ప్రశ్నకు సమాధానంగా, "జోడేఘాట్ సంఘటనకూ ప్రభుత్వ విధానాలకూ ఏరకమయిన సంబంధం లేదు. కాబట్టి ప్రభుత్వవిధానాన్ని సవరించే ప్రసక్తిగాని పునరాలోచించే ప్రసక్తిగాని లేదు" అంటాడు.

భీముమీద ఆసిఫాబాద్ తాలూక్‌దార్ వేసిన ఆరోపణలో రెండువిషయాలున్నాయి. ఒకటి, భీముకు మంత్రశక్తివుందనినమ్మి గోండ్లు అతన్ని అనుసరించారు. రెండు, అతనికి రాజ్యాధికారకాంక్ష వుండింది. ఒకజాగిరుకోసమో లేకసంస్థానంకోసమో పోరాటంనడిపాడు. వీటిలో రెండవదానిగురించి హైమెండార్ఫ్ ఏమంటాడోవిందాం. హైమెండార్ఫ్‌కు ఆదిలాబాద్ గిరిజనులతోవున్న పరిచయంగాని, వాళ్ళకు ఆయన పట్లఉన్న ఆదరభావంగాని వేరే ఏ గిరిజనేతరుడికీ ఆనదులేవు. ఆయన సంస్కరణవాదే అయినా, ఇవ్వాళ్టి మార్క్సిస్టు బిరుదాంచితులయిన సామాజిక శాస్త్రవేత్తలలాగా కాక, తానుపరిశోధించే ప్రజలజీవితాన్నీ కష్టనష్టాలనూ పంచుకోవాలనీ, వాళ్ళకోసం చేయగలిగింది చేయాలనీ నమ్మినవ్యక్తి. "భీముకు గోండురాజ్యం ఏర్పరచాలన్న ఆశ ఉండిందన్న వదంతి నిస్సందేహంగా అతిశయోక్తి. అతని ఉద్దేశ్యం, అతని అనుచరుల ఉద్దేశ్యం, చాలాపరిమితమయినది. జోడేఘాట్ పరిసరాల్లో భూమిని నిరాక్షేపణీయంగా సాగుచేసుకోగలగడం, ఫారెస్టుఅధికార్ల అక్రమదోపిడీనుండి విముక్తిపొందడం, ఇవిమాత్రమే వారుకోరింది" అని హైమెండార్ఫ్ అంటాడు.

రైతాంగపోరాటాలకు చిల్లరజమీందార్లు, జమీందార్లు కాగోరేవారు, కొన్నిసందర్భాలలో స్థానికసంస్థానాధీశులు, నాయకత్వంవహించి రైతాంగం రక్తంతో జాగీర్లు కొనుక్కోవడం మనదేశచరిత్రలో అసాధారణ విషయంకాదు. మొగల్ జాగీర్దారీ విధానంపట్ల, రెవెన్యూవిధానంపట్ల, ఆనాటిరైతాంగంలో తీవ్రమయిన అసంతృప్తి ఉండేది. అదిఎన్నో చిన్న, పెద్ద, రైతాంగ పోరాటాలకు దారితీసింది. కొన్ని సందర్భాలలో రైతాంగంలోని ఆ అలజడిని స్థానిక సంస్థానాధీశులు, సామంతులు, తమ నాయకత్వంలోకి తీసుకొని తమఅవసరాలకు అనుగుణ్యంగా మలచుకున్నారు. శివాజీది అటువంటిదే. అంతకంటే చక్కటిఉదాహరణ, యమునానదీ తీరంలోని జాట్ రైతాంగపోరాటానికి నాయకత్వం వహించి మొగల్ బాద్ షాను బెదిరించి జమీందారీలు పొందిన జాట్ నాయకులు. అక్బర్ చనిపోయిన తరువాత ప్రజ్వరిల్లిన ఈ జాట్ రైతాంగం తిరుగుబాటుకు మొట్టమొదటి చెప్పుకోదగ్గ నాయకుడు చౌరామన్. ఇతని తండ్రికి "గ్రామాలజమీందారీ" ఉండేదట. ఇతను, ఇతనివంటి ఇతరజమీందార్ వంశీకులూ, ఒకశతాబ్దంపాటు రాచకురుపులాగా మొగల్ బాద్ షాలను హింసించిన జాట్ రైతాంగ పోరాటానికి నాయకత్వంవహించి విస్తృతప్రాంతాలలో జమీందారీలు సంపాదించుకున్నారు. అక్బర్ కాలానికి యమునానది తీరంలోని జమీందార్లలోని జాట్ కులస్థులసంఖ్యను, 19వ శతాబ్దంలో అదేసంఖ్యతోపోల్చిచూస్తే వీళ్ళు ఈ పని ఎంతసమర్థవంతంగా నిర్వహించారో తెలుస్తుందని ఇర్ఫాన్ హబీబ్ అంటాడు. చివరికి ఈ రైతాంగపోరాటానికి ముగింపుగా ఔరంగజేబు మరణానంతరం సూరజ్ మల్ నాయకత్వాన ఒక విశాలమయిన జాట్ రాజ్యాన్ని ఏర్పరుచుకున్నారు. ఈ చరిత్రను దృష్టిలోవుంచుకొని భీముగూడ అట్లాంటివాడేననుకునే అవకాశంవుంది కాబట్టి హెమెండార్ఫ్ అభిప్రాయానికి విలువఇవ్వవలసి ఉంటుంది.

భీముకు మంత్రశక్తి వుందన్న నమ్మకాన్ని గురించి గూడ హెమెండార్ఫ్ తన అభిప్రాయాన్ని చెప్తాడు. "భీము తనకు మంత్రశక్తివుందనీ, దేవుడిమాటలు వినగలననీ, ప్రకటించుకున్నట్లు చెప్తారు. ఇది అసంభవంకాదు ఎందుకంటే, పూనకం వచ్చినప్పుడు దేవుడితో సంభాషించగల ద్రష్టలను గురించి గోండ్లలో నమ్మకాలు ఉన్నాయి." భీము ఒక సాధారణ గోండు కాబట్టి గోండు సంస్కృతిలో భాగమయిన నమ్మకాలు కలిగివుండడంగాని, ప్రకటించుకోవడంగాని, నమ్మరాని విషయాలుకావు. అయితే భౌతిక వైరుధ్యాలను విస్మరించి, గోండ్లు భీమును అనుసరించడానికి ఈ ప్రగల్భాలేకారణమని తీర్మానించే ముందు కొన్నివిషయాలు గుర్తుంచుకోవాలి అల్లూరి

సీతారామరాజు నుండి నిన్నటి 'పోరకల దొర' వరకు గిరిజనులకు నాయకత్వం వహించిన వారందరి గురించీ ఇట్లాంటి ప్రచారమే సాగింది. సీతారామరాజుగాని భీముగాని నిజంగానే తమకు అద్భుత శక్తులున్నాయని నమ్మిఉండవచ్చు. వాళ్ళు నమ్మినా నమ్మకున్నా గిరిజనులు నమ్మిఉండవచ్చు. ఇది గిరిజనులకూ గిరిజన నాయకులకూ మాత్రమే పరిమితమయిన విషయం కాదు. 1920 లలో ఉత్తరప్రదేశ్ లోని అవధ్ ప్రాంతపు రైతాంగం గాంధీ గురించి గూడ ఇట్లాంటి నమ్మకాలే కలిగి వుండిందట. ఆ నమ్మకాలబలంతోనె వాళ్ళు కాంగ్రెస్ పిలుపును అందుకొని సత్యాగ్రహ ఉద్యమంలోకి దిగారని అంటారు. లక్నోలో ఒక గుడ్డివాడు గాంధీని విశ్వసించడంతో కళ్ళువచ్చాయనీ, సహాయనిరాకరణ చేస్తున్న ఒక సత్యాగ్రహిని అరెస్టుచేసిన పోలీస్ ఇన్స్పెక్టరు తలమీద ఆకాశం నుండి ఒక ఇటుకపడి తలచిట్లి పోయిందని, విదేశీవస్తు బహిష్కరణ చేయ నిరాకరించిన తన భర్తను ఒక గాంధీ అనుచారి శపించగా అతని విస్తరిలోని తిండిమాంసంగా మారిపోయిందనీ, ఇత్యాది వదంతులు గాంధీ గురించి ప్రచారంలో ఉండేవని కపిల్ కుమార్ అంటాడు. వెనుకబాటుతనంవల్ల ప్రజలలో గుడ్డినమ్మకాలు ఉంటాయి. కాని పోరాటానికి భౌతిక వైరుధ్యాలు ప్రధానకారణం. ప్రజలలోని గుడ్డినమ్మకాలను పోగొట్టడానికి కృషి చేయవలసిన అవసరంలేదనికాదు, కాని ప్రజాశత్రువులుచేసే దుష్ప్రచారాన్ని చారిత్రిక దృష్టితో ఎదుర్కోవాలి.

జోడేఘాట్ కాల్పుల తరువాత నిజాం ప్రభుత్వానికి దడపట్టుకుంది. హైమెండార్ఫ్ వంటి సహృదయుల సహకారంతో ఎన్నో సంస్కరణలు ప్రవేశపెట్టింది, గిరిజనులకు స్కూళ్లుపెట్టి, గోండీ, మరాఠీ, ఉరుదూ భాషలలో చదువు చెప్పించింది. అంతకంటే ముఖ్యంగా, భూములకు పట్టాలు ఇప్పించింది. 1946 నాటికి 1 లక్ష 60 వేల ఎకరాలు ఈ రకంగా పట్టాచేయించారనీ, మొత్తం ఆదిలాబాద్ జిల్లాలోని గిరిజనులలో 85 శాతానికి పట్టాలు దొరికాయని, హైమెండార్ఫ్ అంటాడు. కాని హైమెండార్ఫ్ (ఉదారవాది కాబట్టి) చెప్పని విషయమేమిటంటే, ఈ లక్షఅరవై వేల ఎకరాలనూ అడవినుండి ఇచ్చారేగాని, భూస్వాములు గతంలో చేజిక్కించుకున్న భూమిని తిరిగి గిరిజనులకు ఇవ్వలేదు. అంటే, గిరిజనులకు భూములు దొరికాయి గాని, అడవులలోకి బలవంతంగా ప్రవేశపెట్టబడ్డ భూస్వామ్యం చెక్కుచెదరలేదు. ఈ సంస్కరణలవల్ల గిరిజనుల బతుకు చాలా మెరుగయిందని హైమెండార్ఫ్ అంటాడు.

అయితే సంస్కరణలద్వారా గిరిజనులకు పట్టాలు ఇప్పించవచ్చునుగాని, పెట్టుబడిదారీ సుడిగుండంనుండి ఆ పట్టాలను సంస్కరణలు రక్షించలేవు. 1950 తరువాత గిరిజనుల భూములు మళ్ళీపరాయీకరణకు లోనయ్యాయి. గతంలో ఆసిఫాబాద్‌లో జరిగింది, ఇప్పుడు చరిత్రనాటకరంగం ఉట్నూరుకుమారింది. ఉట్నూరు ఆదిలాబాద్‌జిల్లాకు పశ్చిమభాగానవుంది. ఆనాటికి దట్టమయిన అడవిగావుండేది. మైదానప్రాంత వ్యాపారస్తులు అప్పటికింకా ఉట్నూరుకుపోలేదు కారణం, ఉట్నూరుకు సరయిన రోడ్డులేదు. కాని 1950 తరువాత ఉట్నూర్‌కు గుడిహత్నూర్‌ద్వారా ఆదిలాబాద్‌కు, జెరిమెరిద్వారా ఆసిఫాబాద్‌కు, కలిపేరోడ్లువేసారు. తద్వారా వ్యాపారస్తులకు అడవిలోకి ప్రవేశించడానికి మార్గంసుగమంచేసారు. ఈ ప్రమాదాన్ని ఇవ్వాళ వెనకచూపుతో గుర్తించడంకాక, ఆనాడే గుర్తించి ప్రభుత్వాన్ని హెచ్చరించినందుకు హెమెండార్ఫ్‌ను మెచ్చుకోవాలి ఆ వ్యాపారస్తులు ఎక్కువగా మరాఠీవాళ్లు,. వాళ్లగిరిజనులకు సరుకులమ్మి, గిరిజనులదగ్గర పత్తి, జొన్నలు, కొనుక్కుపోతారు. ముఖ్యంగా, పత్తిపంటను అమ్మకలప్పుడు కాబట్టి పత్తికొనుగోలులో వ్యాపారస్తులు చేసేమోసం గిరిజనులకు ప్రాణకంటకంగా తయారయింది. ఇవ్వాళ్టి సంగతి చెప్పుకోవాలంటే, క్వింటాలుపత్తికి 550 రూపాయలు దొరికితేనేగాని గిట్టుబాటుకాదని గిరిజనుల అంచనా. కాని మార్కెటులో వాళ్ళకు 400-450 మించి దొరకదు. ఇది ఒక్కఆదిలాబాద్ సమస్యేకాదు, పత్తిపాడునుండి పాండుగూడెం వరకు పత్తిపండించే రైతులందరి సమస్యాఇదే. అయితే గిరిజనులు అమ్మకంలోనేకాక కొనుగోలులోగూడ విపరీతంగా నష్టపోతారు. ఫలితంగా ఆ వ్యాపారస్తులకే అప్పులపాలవుతారు. అప్పుకువడ్డీఎంతో, ఎంతకాలానికి ఎంత అవుతుందో, ఆ షాహుకార్లకేఎరుక. తనకున్న 5-10 ఎకరాలభూమిని అతను అప్పుకింద ఆక్రమించుకున్ననాడే గిరిజనుడికితెలుస్తుంది. 'నాగేటిచాళ్ళలో రగిలినరైతాంగ పోరాటం'లో ఈ షాహుకార్ల దోపిడీగురించి చాలాఉదాహరణలు ఇచ్చారు. అందులో మరీదారుణంగావున్నవి గుర్తుచేసుకుంటే ఇంద్రవెల్లి పూర్వరంగం అర్థమవుతుంది. విఠల్ అనే షాహుకారు శిత్రు అనేగోండుకు 200 రూపాయలు అప్పిచ్చి కేవలం ఒక్కసంవత్సరంతరువాత 15 ఎకరాలభూమి, 9 ఎడ్లు, స్వాధీనపరచుకున్నాడు.

గిరిజనుల భూములను గిరిజనేతరులు స్వాధీన పరచుకోకూడదనేకాదు, కొనుక్కోగూడదనిగూడ చెప్పేచట్టాలులేకకాదు. 1949 లోనే నిజాంప్రభుత్వం అటువంటి చట్టాన్ని చేసింది (Hyderabad Tribal Areas Regulation Act,

1949). ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డతరువాత వేరేపేరుతోను, కొన్నిమార్పులతోను, అటువంటి చట్టమే (A. P. Scheduled Areas Land Taansfer Regulation. 1959) కొనసాగింది. 1960 వరకు గిరిజనులకు జోడేఘాట్ కాల్పులతరువాత ఇచ్చినపట్టాలు ఫలప్రంగా కొనసాగాయని హెమెండార్ఫ్ అంటాడు. కాని అప్పటికే గుడిహత్నూర్ ఉట్నూర్ - కెరిమెరి - ఆసిఫాబాద్ రోడ్డునిర్మాణమయింది. ఒకచిన్నపాటి ఉప్పెనలాగా గిరిజనేతరులుఉట్నూరుకు రావడంమొదలయింది. 1961లో ఉట్నూరు తాలూకాజనాభా 55 వేలుకాగా 1971 అది 93,800 చేరుకుంది, అంటే 70 శాతంపెరిగింది. ఆ దశాబ్దంలో రాష్ట్రజనాభా పెరుగుదల సగటున 16 శాతం మాత్రమే. ఈ వలస ఫలితంగా 1977లో హెమెండార్ఫ్ మళ్ళీ ఆదిలాబాద్ వెళ్ళేనాటికి గిరిజనులు షాహుకార్లకు తమ భూములను ఎంతవిస్తృతంగా కోల్పోయారంటే: "అప్పటిపరిస్థితి నాకు 1942 నాటి పరిస్థితికి కార్బన్‌కాపీలాగా కనిపించింది" అని హెమెండార్ఫ్ అంటాడు. 25 నుండి 200 శాతంవరకు వడ్డీకిఅప్పులిచ్చి గిరిజనులభూములను గిరిజనేతరులుచేజిక్కించుకున్నారు, మరి చట్టంఏంచేస్తోంది అనిప్రశ్నిస్తే, "1959 చట్టాన్ని అమలుచేయకపోవడమేతప్ప దీనికి వేరేకారణంలేదు"అని అంటాడు. గత సంవత్సరం హైదరాబాద్‌లో మాట్లాడుతూ ఆయనే "ఏదయినా చర్యతీసుకోకపోతే ఆదిలాబాద్‌లో అస్సాంలాంటి పరిస్థితి ఏర్పడే ప్రమాదముంది" అన్నాడు.

వీటన్నిటిఫలితం ఇంద్రవెల్లి. 1981 ఏప్రిల్ 20న ఇంద్రవెల్లిగ్రామంలో గిరిజన రైతుకూలీసంఘం సభ జరపాలనుకున్నారు. ఇప్పుడు గిరిజనులకు కొమురం భీము వంటి గిరిజనవీరుల నాయకత్వంకాక ఒక శాస్త్రీయసాంప్రదాయిక దృక్పథంగల మార్క్సిస్ట్ - లెనినిస్ట్‌పార్టీ నాయకత్వముంది. ఆ నాయకత్వాన ఉద్యమించేక్రమంలో పెట్టుకున్న సభఅది. మొదట అనుమతిఇచ్చిన పోలీసులు ఆనాడు సెక్షన్ 144 ప్రకటించారు. ఇంద్రవెల్లికి అటూ ఇటూ గుడిహత్నూర్ - ఉట్నూర్ రోడ్డుమీద పోలీసు వ్యాన్లు తిరిగాయి. సభకువస్తున్న గిరిజనులను చెల్లాచెదరు చేసారు. చెప్పగానే వెళ్ళిపోయినవాళ్ళు అదృష్టవంతులు. అందరూ అంతవినయంగా ప్రవర్తించలేదు. మా సభకు మమ్మల్ని పోవద్దనేహక్కు మీకెవరిచ్చారని ఎదురడిగారు. కొందరు చేతిలోకి తంకరరాళ్లు తీసుకున్నారు. అంతమాత్రానికే ప్రాణభయంవేసి పోలీసులు వ్యాన్లలో నుండి, జీపులలోనుండి, కాల్పులుజరిపారు. బెదిరించడానికికాదు జరిపింది, గురిచూసి యువకులయినవాళ్ళనూ చురుగ్గాకనిపించినవాళ్ళనూ కాల్చారు. దెబ్బతగిలి ప్రాణాలతో బయటపడ్డవాళ్ళంతాగూడ పోలీసులుతమను గురిచూసికాల్చినట్టు చెప్త

న్నారు. ఇది రోడ్డుమీది విషయం. అడవులలో నుండి ఇంద్రవెల్లికి వస్తున్న వాళ్ళను ఆపడానికి చెట్లమీదినుంచి కాల్చారు. 13 మంది చనిపోయినట్టు ప్రకటించారు. ఇప్పటికీ పేర్లు తెలిసింది 12 మందివే. అందరూ గూడ రోడ్డుకు మరీ దూరంలేని గ్రామాలవాళ్ళే. అడవిలోపలి గూడాల వాళ్ళు ఎంతమంది చనిపోయారో తెలియదు. చనిపోయినవాళ్ళుకాక మరింతమంది శాశ్వతంగా వికలాంగులయ్యారు.

ఇవాళ్టిగోండ్లు హెమెండార్ఫ్ గోండ్లుకారు. ఒకప్పుడు తెల్లబట్టలవాళ్ళను చూస్తేనే పారిపోయినగోండ్లు ఇవ్వాళ అసలు మన ఊహల్లోని గిరిజనులలాగలేరు. మైదానప్రాంతపు మరాఠీరైతుల వేషభాషలు వాళ్ళకుఅలవడ్డాయి. ఇవ్వాళ వాళ్ళు గిట్టుబాటుధరలగురించి, షాహుకార్ల దోపిడీగురించి చర్చించగలరు. ఉట్నూరుకు రోడ్డురావడంతో షాహుకార్ల దోపిడీవచ్చింది, భూమిపరాయీకరణ ఇనుమడించింది, కాని ఆరోడ్డువెంబడే, కొత్తగావచ్చిన దోపిడీనుండేకాదు, గిరిజనుడి ఆదిమమౌఢ్యం నుండి, సంకుచిత జీవితదారిద్ర్యంనుండి, విముక్తినివ్వగల రాజకీయంగూడ వచ్చింది. ఆదిలాబాద్ గిరిజనులు ఇవ్వాళ మంత్రిశక్తితోబుల్లెట్లను ఖోంచేయగల కొమురంభీమునుదాటి చాలాదూరం వచ్చారు.

---

1983 జులై సంచిక

## చెరబండరాజు సంస్మరణ

### సృజనగా వెలువడుతుంది

చెరబండరాజు ప్రథమ వర్ధంతిని పురస్కరించుకొని జులై సృజన ఆయన వ్యక్తిత్వ, జీవిత, సాహిత్య, సాంస్కృతిక సమాలోచనగా, జ్ఞాపకంగా, సంస్మరణగా వెలువడుతుంది. నక్సల్బరీ సాంస్కృతికోద్యమానికి, విరసం సాహిత్యోద్యమానికి ప్రతినిధిగా పదిహేనుసంవత్సరాలు పోరాడినయోధుడు కామ్రేడ్ చెరబండరాజు. ఆయనతోగానీ, ఆయన సాహిత్య, సాంస్కృతికోద్యమాలతోగానీ పరిచయమున్న ఎవరైనా తామెంచుకున్న అంశంపై రాసి మే 31 లోగా పంపవలసిందిగా కోరుతున్నాం.

— 'సాహితీ మిత్రులు'

# "బొగ్గుపొరల్లో……"

**తుమ్మేటి రఘోత్తమరెడ్డి**

అలవాటు ప్రకారం.... ఒకటోనంబర్ బొగ్గుబాయిమీద రాక్షసి గొంతుతో సైరన్ కూసింది. "ఓ కార్మికులారా! తొందరగా రండి.... తొందర తొందరగా రండి.... మీ శరీరాలనుంచి కొంచెం మాంసం, మరి కొంచెం నెత్తురు ఈ రోజుకు సరిపడా నేను చప్పరించాలి" అన్నట్టు భయంకరంగ కూసింది.

మోటుకష్టం మొద్దుకష్టంచేసి నిద్రపోతున్న కార్మికులు ఆ భయంకర కేకలాంటి సైరన్ మోతకు మేలుకుంటున్నరు. కాలిస్తె పచ్చిపుండ్లతీరుగ అన్పిస్తున్నాయి వాళ్ళ శరీరాలు. ఎవరో శరీరంలోపల నరాల్ని, నాడుల్ని పిడికిట్లో పట్టుకుని ఒక్కసారిగా లాగుతున్నట్టు, పంచప్రాణాలు పోతున్నట్టు అన్పిస్తోంది లేద్దామంటె. ఆ 'సైరన్' కూత కార్మికుల గుండెల్లో గుబులుపుట్టించింది. గుదిగుచ్చినట్టున్న కార్మికవాడల్లో చలనం పుట్టించింది.

ఆలస్యం అయితే తమ తమ భర్తలకు అన్నంకూడ అందక 'పరకడుపు'లతో బదిలీలకు పోవాల్సివస్తాందో ఏమో అని, ఆందోళనపడ్తూ, కుక్కిమంచాల్లోంచి కార్మికస్త్రీలు గబగబలేస్తున్నారు. వారితోపాటు 'బల్లికి దారంలా' అంటుకునిలేస్తూ 'ముఖారిరాగం' అందుకుంటున్నరు పసిపిల్లలు. అంతపొద్దున లేవడమే బద్ధకం అంటె మీదికెల్లి ఈ పిల్లల ఏడ్పుకు ఆడవాళ్ల చిరాకుపడ్తూ, మగవారి పక్కల్లో పిల్లలనుపడేస్తూ, 'బొగ్గుపొయ్యిలు' అంటించడానికి బయటకువెల్తున్నారు. ఆ విధంగ సైరన్‌కూత రోజు పుదయం అయిదుగంటలకే, తెలతెలవారకముందే కూస్తుంది. కార్మికవాడలేస్తుంది. పొద్దుటి 'బదిలీ'కి పోవాల్సిన వారికి వంటచేయడంకోసం కొందరు తొందరపడితె, రాత్రి బదిలీచేసి యింటికివచ్చేసరికి వంటచేసి వుంచాలని మరికొందరు స్త్రీలు పొయ్యి అంటించడానికి వేగిరపడతారు.

మగవారిని లట్టిలేపుతూ, సణుగుతూ, గొణుగుతూ, ఆడవారుపనులు చేసు కుంటుంటె, అటుగుణుస్తూ.... యిటుగుణుస్తూ కార్మికులు అయిష్టంగా లేస్తుంటరు. పిల్లలఏడ్పులు, 'టప్కుటప్పు'న బొగ్గుపొయ్యిలు అంటించడానికి బొగ్గుకొట్టేటప్పుడు కోళ్ళఅరుపులు, ముడుగుకాల్వల్లో పందుల అరుపులు, బొగ్గుపొయిలలోంచి వచ్చే పొగవల్ల పీడనిపొగ చీకట్లతో, ఆ పుదయం పల్లెల్లో కనిపించే పుదయం తీరుగ పసందుగ, ప్రశాంతంగ కనిపించదు. అంతమావురుకప్పినట్టుగుంటది....

సైరన్‌కూతకు దొరల బంగళాల్లోకూడ పనిమనుషులులేచి వంటిండ్లలో లైట్లు వెలిగిస్తారు. సైరన్‌కూతవిని, కంపెనీవారు పుదారంగాకట్టించి నియమించిన రామాలయం పూజారి ఆదరాబాదరాగలేచి రామచంద్రమూర్తిని లేపడానికి అరిగిపోయిన సుప్రభాతపు రికార్డులు వేస్తాడు. ముసుగుతన్ని పడుకున్న కార్మికులు ఆ రికార్డుల రొదకు ఆగలేక, గుడిసెవాసాలు తగుల్తుంటె పుణుక్కుంటూ.... విసుక్కుంటూ లేచి దినచర్యలో పడతారు.

సైరన్ కూతకంటె, రాములోరి సుప్రభాతం కంటె ముందుగనే ఎల్లారెడ్డికి తెలివైంది. వెంటనే భార్యను లేపిండు. ఆమె బొగ్గులేక కట్టెలపొయ్యి అంటుబెట్టి వంటచేస్తుంది. ఎల్లారెడ్డి మంచంలో వెల్లకిలాపడుకుని గుడిసె పైకప్పుకేసి చూస్తూ ఆలోచిస్తున్నడు, ఆరునెల్లకిత్రందాక తన పల్లెటూళ్లోగడిపిన స్వేచ్ఛామయమైన రైతుజీవితం యాదొచ్చింది. యిక్కడ అధికార్ల అణచివేత, దుర్భరమైన పని పరిస్థితులు, వుండడానికి సరియైన వసతిలేని మురికిగుడిసెలు యాదొచ్చి 'పెనంమీదినుంచి పొయిలపడ్డట్టేఅయింది', అనుకుంట లేవబోయిండు.

భార్య రాధమ్మ చాలాసేపట్నుంచి ఏదోచెప్పాలని మంచంవరకువచ్చి సిగ్గుతో చెప్పలేకపోతోంది అదిగమనించిన ఎల్లారెడ్డి,

"ఏంది ? ఏందోసెప్పాల్నని అచ్చి సెప్తలేవు" అని అడిగిండు. రాధమ్మ సిగ్గుపడి చీకట్లోకి మొహంతిప్పి "ఏంలేదు" అంది. లేచికూర్చుంటూ ఎల్లారెడ్డి మళ్ళీ అడిగిండు.

"సెప్పకుంటె సెప్పకపోతివి దాసుకో"

"దాసుకునేదేంవున్నది" నేలవంకచూస్తూఅన్నది.

"మరి ?"

"ఏంలేదు యియ్యాలకొంచెం పొద్దుగాలరా...."

"అత్తె ?" సుదురుచిట్లించి ఎల్లరెడ్డి అడిగిండు.

"అబ్బ ! అన్నిసెప్పాలె"

"సెప్పకుంటె నాకెట్లతెల్తయి ?"

"సాయంత్రం డాక్టరమ్మదగ్గెరికిపోవాలె"

"డాక్టరమ్మ దగ్గెరకా ? ఎందుకు ?" కనుబొమలు ముడివేసి ఎల్లారెడ్డి.

"ఎందుకంటె.... నువ్వు బాపువు అయితానవు" అనుకుంట రివ్వునబయటకు వెళ్ళి రెండుచేతుల్లో రెండుకుండలు తీసుకుని యింట్లోకిచూస్తూ,

"పొయ్యిమీద అన్నం 'వుమ్మగీలుతాంది' పెట్టుకోనితిను. ఆల్చ్యఁవైతె పంపులుబంద్తైతయి" అని జెపజెప వెళ్ళిపోయింది. రాధమ్మని అందుకోబోయిన ఎల్లారెడ్డికి గుడిశెవాసాలు 'ఫటుక్కున' తగిలినయి. 'అన్నన్నాయి..' అని పుణుక్కుంటూ చేతిలో పళ్ళపొడివేసుకుని బయటకువచ్చాడు. దూరంగవున్న నీళ్ళపంపుదగ్గెరనుంచి కోప్పడుకోవడాలు, తిట్లు ఎప్పట్లాగె లొల్లిమొదలైంది. "యింత బాయిపన్జేసినా తాగుటానికి నీళ్ళకరువు. నీతల్లి ఎంకటాద్రివు వల్లెన రోడుకడ్డం కుండలు వెట్టుకోని పంపు వేయించుకున్నట్టు యిక్కడేదన్నసేత్తె బాగుండు" అని అనుకుంటూ మొఖంకడుక్కుని యింట్లోకివెళ్ళి అన్నంపెట్టుకుని నిన్నటికూరపెట్టుకుని తిని డ్యూటీబట్టలు వేసుకుంటుంటె పక్కగుడిశెలోంచి టింబరింగు కార్మికుడు నర్సయ్య "ఏఁవైందిరెడ్డీ? తయారైనవా?" అని కేకేసిండు.

"ఆయిపాయె....అత్తాన" అనుకుంట పండిరికి తగిలించిన టోపీని తలకుపెట్టుకొని బయలుదేరిండు. నీళ్ళకుండపెట్టుకొని ఎదురైన రాధమ్మనుచూస్తూ "పోతాన" అని కనుబొమలెగరేసి చెప్పిండు. రాధమ్మ మొగ్గతీరుగ మొఖం ముడుచుకోని "జెప్పనరా...." అంది. తలనిలువుగా వూపుతూ "నర్సయ్యా....పా" అన్నడు ఎల్లిరెడ్డి. యిద్దరు యిరుకు సందులోంచి నడుస్తుంటె నర్సయ్య అడిగిండు "జెప్పన రమ్మంటాంది ఎందుకు?" అని.

"డాక్టరమ్మ దగ్గెరికి పోవాల్నట" అని కొంచెంసిగ్గుపడ్తూ "నెలతప్పిందట" అన్నడు.

"అట్లనా" అని ముఖావంగ వూరుకున్నడు నర్సయ్య. దొడ్డింకమీసాల్ని దువ్వుకుంట, తనకు మొదటిసారిగ పుట్టినకొడుకువల్ల తనెంతసంబరపడ్డది తలుచుకొని, రేపోమాపో తనలాగె బాయిపనిచెయ్యడానికి సిద్ధపడ్డకొడుకును యాదికితెచ్చుకుని విచారిస్తూ నడుస్తున్నడు.

"నిదర్లేదారెడ్డీ? కండ్లుఎర్రబడ్డట్టున్నయి" అని మురుగుకాల్వ మీదినుంచి దునుకుతూ అడిగిండు నర్సయ్య.

"నిదర్వెవ్వను కుక్కల్దెం.... గుడిశెల ఒకటేవుడుకపోసుడు దోఁవలుకుట్టుడు అటిసురుకోని యిటిసురుకోని ఏరాత్రో పంటె కోడికురుకోలిగె ఓ నిదర్పట్టింది. మళ్ళ

అయిదుగంటల సీటికంటెముందే తెలిపైంది." కుండఎత్తుకునివస్తున్న ఒకామెకు దారియివ్వడంకోసం మరోగుడిశె గుమ్మంలోకివెళ్ళి, తిరిగి దారిలోకివస్తూ ఎల్లరెడ్డి అన్నడు.

"పెద్దపూరుపెట్టు నడుసుడాయె తిన్నదిఅరిగెటట్టు. నాకంటె శాతకాక సైకిల్ కొనుక్కోకపోతి, నువ్వన్నకొనుక్కోరాదు" అనిఅడిగిండు నర్సయ్య.

"సైకిలా ? సూతాలె.... బాయిపనికి తెచ్చినపైసలే తేరకపాయె" అన్నడు ఎల్లరెడ్డి. అని ఓగుడిశెముందాగి "లింగయ్యా.... ఓలింగయ్యా" అని పిలిచిండు నర్సయ్య రెండుఅడుగులేసి ఆగిండు. "అత్తి" సమాధానంతోపాటు మనిషికూడ వచ్చిండు.

"ఈనెవలు ?" తాటిమాకుతీరుగ నల్లగబలంగవున్న యువకుని దిక్కుచూస్తూ నర్సయ్య అడిగిండు. సమాధానంగ ఎల్లరెడ్డి....

"లింగయ్య అని మనబాయికే నిన్నటిదాక బదిలీఫిల్లరుగ పన్జేసిండు యియ్యాల్లట్నుంచి టెంపరరీ మజ్దూరుగ అత్తాండు" అని చెప్పిండు.

లింగయ్య తనగుడిశెముందు పనిచేసుకుంటున్న తండ్రిదిక్కు, తలుపువెనక నిలబడిచూస్తున్న భార్యదిక్కుచూసి "పోతాన్నేఅయ్యా" అన్నడు. తట్టకు తీగెలు కట్టుకుంటున్న లింగయ్యతండ్రి కట్టడం ఆపి

"పోగని బిడ్డా! పదిలం. మీ బాయిల "డిప్లరింగు"[1] నడుత్తాందట జెర పదిలంగమెదులు" తనఅనుభవాన్ని చెప్పిండు. ముగ్గురుకలిసి కొంతదూరంనడిచిన తరువాత నర్సయ్య అడిగిండు.

"పిలగా.... లింగయ్యా.... మీనాయిన ఏంపన్జేస్తడు" అని.

"ఫైవింక్లైన్ల కోల్‌ఫిల్లరుగ" సమాధానంచెప్పిండు లింగయ్య. నర్సయ్య పెద్దగానవ్వుతూ "సీతల్లి బాయిపనోనికడుపున బాయిపనోడుపుడుతడు" అన్నడు మళ్ళీ అతనే.

"మరైతేఁవానెగని పెండ్లిఅయిందా ?" అని అడిగిండు వెనకకుతలతిప్పి. ఎల్లారెడ్డి అందుకుని, "నెలరోజులకిందనే అయింది" అనిచెప్పిండు. ఎందుకోగాని నర్సయ్య "చ్చు....చ్చు" అని చప్పరించిండు, తారురోడ్డెక్కుతూ.

---

1. డిపిల్లరింగ్ : గుహలతీరుగ తొలుచుకుంటూపోయి, తిరిగి వెనక్కివస్తున్నప్పుడు మొదట వదిలిపెడుతూపోయిన బొగ్గును తీసేపద్ధతుల్లో డిపిల్లరింగ్ ఒకటి.

తారురోడ్డుమీద బొగ్గుట్రాన్స్‌పోర్ట్‌చేసే లారీలు 'చిరచిర' శబ్దంచేస్తూ అటూ యిటూ పరుగెత్తుతున్నాయి. నైటుషిఫ్ట్ కార్మికులు తిరిగివస్తున్నరు. పొద్దటిడ్యూటికి వెల్లాల్సిన కార్మికులు వెల్తున్నారు. సైకిళ్లున్నవారు సైకిళ్లపైనా లేనివారుమాత్రం కాలి నడకన ముందే బయలుదేరి అడ్డదోవలగుండా నడుస్తున్నారు.

నర్సయ్య, ఎల్లరెడ్డి, లింగయ్య రోడ్డుదిగి అడ్డుదోవగుండా తంగేడుచెట్ల లోంచి నడువసాగిండ్రు. ఎల్లారెడ్డి కాలు పట్టిపట్టివేస్తూ నడవడానికి అవస్తపడుతూ

"నర్సయ్యా.... యీ్లు బాగమండుతానయి" అన్నడు.

సైకిలుంటెనేమొ జెర జెప్పనతగ్గు, కొన్నిరోజులు గిట్లనేమండి కాయలు గాత్తయి. ఆయంక తక్కువైతయి" అని వెనక్కుతిరిగి

"ఎల్లరెడ్డీ! అసలు బాయిపనిఅంటెనే బొంచెపని, నీతల్లి దీనంతలుచ్చపని దునియలగూడలేదు. యింత అరుపమోసుకట్టం యిన్నియిబ్బందులుపడుకుంట చేసే గాడ్దికొడుకు యింకెవడులేడు, వాడెవడో ఎంకట్రావడు పాడినట్టు తెల్లారిలేస్తె అన్నిబాధలే" అన్నడు. అంతావిన్న ఎల్లరెడ్డి

"ఔ.. నర్సయ్యా దీనికంటె ఎగుసంజేసుకు సుఖంగుండె" అని వాపోయిండు.

ఎక్కడెవడులేక అక్కమొగుడు దిక్కైనట్టు - మాఅసొంటోనికంటె గతిలేక అచ్చుడుకావట్టె, మరి నీకేంవైందయా? బంగారంవోలిగె "ఎగుసం" జేసుకబతుకక అని నర్సయ్య అంటె.

"ఎందుకులేదు. నాఅసోంటోళ్లు యిద్దరుచేసినా దంగది. కనిఏంలాభం? గడియరికామిలేదు గవ్వరాకడలేదు. అయ్యగారిసంపాదన అమ్మగారి పసుపుకుంకుమకు సరిపెయినట్టు. అండ్ల పండిందిలేదు పెయిందిలేదు. పొట్టకెల్లుడే బ్రిహ్మ కష్టంఅయితాంది" వ్యవసాయంలో తనఅనుభవం చెప్పిండు ఎల్లరెడ్డి.

"ఔనయ్యో రెడ్డి.... పురుగుపుట్టదిని పుట్టలుండబుద్దికాక నేనోఎకురం పొలం గొన్న. నీతల్లి అండ్లపండిందిలేదు పెయిందిలేదు. ఏటికేడు 'లుక్సానే' అమ్మ కత్తనని సూత్తాన" అని తాను ఈమధ్య ప్రారంభంచేసిన - వ్యవసాయం గురించి చెప్పిండు నర్సయ్య. లింగయ్య మవునంగ వారివెంట నడుస్తున్నడు. ముగ్గురూ తంగెళ్ళనుంచి బొగ్గుకుప్పల్లోంచి నడుస్తున్నరు.

"ఈ నెల జీతం ఎంత?" యథాలాపంగ నర్సయ్య అడిగిండు

"నాలుగు వందలు" ఠక్కున చెప్పిండు లింగయ్య.

"నిన్నగాదు రెడ్డిని అడిగిన" వెనకకుతిరిగి చెప్పిండు నర్సయ్య.

"నాదా ఆరువందలు" అన్నడు ఎల్లరెడ్డి. నర్సయ్య విచారిస్తున్నట్లు.... "మజ్దూర్ వనాయె.... ఫిలింగులుంటె ఏడెనిమిదివందలు దొరుకు" అన్నడు.

"మాదొరుకు.... బాతనైనన్ని రోజులు ఫిల్లింగ్ సేత్తననుకున్నగని.... రోజు రిటనేనాయె గాబాధవల్లెక ఈ మస్టర్ పనికి వొప్పుకున్నగాదు" సంజాయిషిగ చెప్పుకున్నడు ఎల్లరెడ్డి.

"బొ గాని రెడ్డి.... రోజు 'డిప్లరింగు'లకు ఎందుకత్తవు? ఎటన్న 'ఎడ్డింగ్' 2 కమాన్లకుపోరాదు" అన్నడు నర్సయ్య సలహాతీరుగ.

"రొన్నెల్లకోసారి టర్మీషనిచ్చుకుంట అండర్ మేనేజరుసారు డిప్లరింగే తోల్తాండు" అన్నడు ఎల్లరెడ్డి.

"యింటికాడ ఎగుసంజేసినట్లు మొద్దుతీరుగసేత్తె ఎందుకు తోలడు? అయితె వానెగని, యాక్టింగు కడ్తాండా?" అని అడిగిండు నర్సయ్య.

"యాక్టింగులేదూ మన్నూలేదు. గదేమజ్దూర్ జీతం" నిరాశగ అన్నడు ఎల్లారెడ్డి.

యాక్టింగుకడితె ఎంతలేదన్న యింకో నూరూరిపాయలు దొరుకు" నిట్టూర్చి అన్నడు నర్సయ్య. దానికి జవాబుగ ఎల్లరెడ్డి "పర్మనెంటు మజ్దూర్లలే యాక్టింగు కడ్తరటకద" అన్నడు. ఎల్లరెడ్డి చెప్పిందివిని ఖల్లునవ్వి "సీతల్లి ఖలేగున్నది. అటు టర్మీషనిచ్చుకుంట పర్మెంటుకానియ్యరు. యిటు ఏపనిచెస్తె ఆపని జీతం యాక్టింగు కట్టియ్యరు. సీతల్లి.... ఖలేదోప్కం" అన్నడు నర్సయ్య.

"మాటదొంబై మస్టర్లువోళ్ళను పర్మెంటు చెయ్యన్నని రూలున్నదని యూనియనోళ్ల పోష్టర్లేసిండ్రుకద" యూనియన్ రాజకీయాలు తెలియని ఎల్లరెడ్డి అమాయకంగ అడిగిండు. నర్సయ్య మల్లనవ్వి....

"సీతల్లి ముందమెయ్య కంపినే అంటె దానిజుట్లకెల్లి ఎల్లినోల్లు యూనియనోల్లు. ఈమధ్య గసొంటిపనులుకూడ సేయించుడులేదు. ఎవడన్న గట్టిగ మాట్లాడితె నౌకరి వూడబీకిచ్చుడు పోలీసులకు పట్టిచ్చుడు. నౌకర్లుపెట్టిత్తమని వెయిలకు వెయిలు మింగికూకుండుడు. అంతకుదప్ప యిప్పుడు వాల్లేంజెయ్యలేదు" అన్నడు. ముగ్గురు

---

2. హెడ్డింగ్ కమాన్ డెవలపింగ్ వర్కింగుప్లేసు.

మరికొంతదూరంనడిచి ఒక గుడిశెపుందాగిండ్రు. అప్పటికే పుదయం ఏడుగంటల సైరన్ కూస్తుంది. ఎత్తులు వంపులుకలిగి చిన్న చిన్న తంగేడుచెట్లు ఆడివిదంతెలు కలిగిన విశాలమైన ప్రదేశంలో, బాయికి ఫర్లాంగుదూరంలో వెలసిన సారాయి గుడిశె అది. ఒంటినిటాృిడు గుడిశెలో.... ఓ సారాయి క్యాను కొన్ని గాజుగ్లాసులు ముందు పెట్టుకుని, ఖాతాపుస్తకం కాళ్ళపైపెట్టుకుని, యింకా యివ్వని పద్దులగురించి లెక్కలు చూసుకుంటూ, వచ్చేపోయే కార్మికులను కనిపెడుతున్నడు కొట్టువాడు. కొట్టుముందు ఆగాడు నర్సయ్య. జేబులోంచి వందరూపాయలు కొట్టువాడికిస్తూ....

"మొన్న అటునుంచి అటేపోయిన లెక్కచూసుకోని కొట్టెయ్" అని హెచ్చరించి "రాండ్రి" అని మళ్ళీ నడక సాగించిండు,

అడ్డదోవదాటి తారురోడ్డెక్కారు. వంపుగావున్న తారురోడ్డుపై సైకిల్ గంటలు గణగణలాడిస్తూ, కార్మికులు రివ్వున దూసుకుపోతున్నారు. కొద్దిసేపు మవునంగ వూరుకుని "నర్సయ్యా.... నెలనెలా వందరూపాయలు సారాకోసం ఖర్చుబెడతవా?" అని ఆశ్చర్యంగ అడిగిండు ఎల్లరెడ్డి. నర్సయ్య చిన్నగానవ్వి....

"ఏందనుకున్నవ్ బాయిపనంటే నాలొ్రిజులుగడిత్తె నీకుతెలుత్తది. నీతల్లి.... తెల్లారకముందేలేసి పుడికీపుడకని కూడు బుక్కెడుతిని పొద్దువోయిందని 'పిరోపిరో' అంట ఈడ్సుకుంటీడ్సుకుంట ఎగపోసుకుంట ఎండనక వానవక మైళ్ళకు మైళ్లురికి ఎక్కడికో పాతాళంబెయినట్టు అరువైడెబ్బైపాయలు జారుట్లబూరుట్ల దిగెటాళ్ళకే కాళ్ళన్ని రిళ్ళలువారె, యిగ పనికాడికి పొయెవారకె గు....బట్టలుతడిసె యిగ ఏ పొద్దుకో ఖాలీటబ్బులిత్తె పొట్టనరాలు తెగంగ పేసిలకు[3] దొబ్బుకపోయి, వశంగాని పొగల, కుమ్ములపెట్టి వుడుకపెట్టినట్టు వుండె.

గరిమిపేసిలనుంచి రేసులెక్కి, డీబులుదిగి, పొగకు వస్కువస్కున దగ్గుకుంట, ఆ గరిమికి మాంసమంతవుడుకంగ, పుట్టెడుబండకింద నచ్చినసాపెరుగక బతికిన బతుకెరుగక రెడ్డీ! నెత్తురునెంవుటజేసి, బొగ్గుదిని బొగ్గేరిగి, యిచ్చినటబ్బులు నింపి, కడుపులపేగులు తెగంగ మళ్ళఖర్తి దొబ్బి ఆడుకు అందిచ్చి వంపుకాడ తానంజేసి, మళ్ళ మోకాళ్లమోచేతులు పట్టుకుంట అరువైడెబ్బైపాయలు ఎక్కెటాళ్ళకు అయ్యా! యిద్దరీడ్సి ముగ్గురుతన్నినట్టు పెయ్యంత పచ్చిపుండోలిగె ఆయె. మల్ల ఎక్కన్నో కాలిపెయిన గుడిశెకు నడిసిపోవన్నన్న సైకిల్ తొక్కన్నన్న యాష్టచ్చె.

3. పేసి : పర్కింగుప్లేసు

అదేపాయె సచ్చిబతికి యింటికిపోతె ఆడేఁవన్న 'సౌలత్' వుంటదామన్నా, గుడిశెల్ల పుడుకపోత, బడిబంధం సక్కగలేక పోరగాండ్లలొల్లి, మురుగువాసన, సీతల్లి గాసీదర భరించలేక "సవ్వో దో సవ్వో" సార తాగిపంటె కసేపు అలిట్టమర్సిపొయి మొద్దునిద్రపడుతది. లేకుంటె గీ బాడుకావు బాయిపనిసేసి వట్టిగపంటె నిదెర్లొట్ల వడుతది?" అని బాయిపనోని బాధలు నర్సయ్య చెప్పుకొస్తుంటె ఎల్లరెడ్డి సబబే అన్పించింది.

మేనేజరు కారుహారన్ చప్పుడువిని పక్కకుజరిగి నడుస్తున్నరు. కాలినడకన సైకిళ్ళపైన పోతున్నవారికండ్లలో బొగ్గుదుమ్ము లేపిపోసి మేనేజరుకారు షెడ్లోకివెళ్ళి ఆగింది. ఆయన ఆదరబాదర మ్యాన్-వే వైపువెల్తుంటె చూసేవాళ్ళకు వేషంవిప్పిన యముడు యాదొచ్చిండు. మ్యాన్-వేలో హాజరు చెప్పేవాళ్లు చెప్పుతున్నరు. ల్యాంప్ల కోసం పోయేవారు మేడమెట్లెక్కిపోతున్నరు. పనిముట్లుతీసుకుని డిస్ట్రిబ్యూషన్కు ఎదురుచూసేవాళ్లు కొందరు, యింకా సైకిళ్ళపై దూసుకువచ్చేవారు మరికొందరు లైమెన్ కార్మికులు టాయిమర్సి, టింబరింగు కార్మికులు ఎక్కడివారక్కడ గుంపుల మాదిరిగ నిలబడివుండి పిచ్చాపాటి చర్చించుకుంటున్నరు. కోల్ఫిల్లర్సు తట్టలు చెమ్మాసులు తెచ్చుకుని ఆ వర్కింగ్ ప్లేసుల గాలిలేదని, ఈ వర్కింగుప్లేసుల మెట్లులేవని మరోచోట 'దేబు'నడుపొద్దని గ్యాంగులవారిగకూర్చుని తీవ్రింగ చర్చించుకుంటున్నరు.

ఉదయం ఎండతీరుగనే, అధికార్లు కార్మికులమీద చిటపట లాడుతున్నరు. జనరల్షిఫ్ట్ మజ్దూర్స్ అందరూ నెత్తిమీద బండలుమోస్తూ టబ్బులు నింపుతున్నరు. బాయిలోపల కట్టడాలకోసం 'మేషన్స్' పెద్దపెద్ద బండలు సుత్తిలతో పగులగొడుతున్నరు డిస్ట్రిబ్యూషన్ బుక్ ఒకచేత్తో పట్టుకుని పెన్ను గల మరోచేతిని పొద్దుపొడుపుకు అడ్డంగపెట్టుకుని హెడ్వోవర్మన్ రాజయ్య మజ్దూర దగ్గరికివస్తూ....

"ఏడవోయిండ్రిరో ఈ మందంత? నిన్న శనివారం రొండు మస్టర్లని నా పెండ్లికచ్చినట్టు అచ్చిండ్రి. ఈరోజు ఎవడు గతిలేనట్టేవున్నది, ఆఁ.... నీయవ్వ కర్మంపెండ్లాం ముండమొయ్యగదరో. టింబరింగ్ మొఖద్దమ్కు ఎవల్నిత్తు లైన్మెన్ మొఖద్దంకు ఎవల్నిత్తు, మెషినోళ్ళకు ఎవల్నిత్తు?" అని దీర్ఘాలుతీస్తుంటె.... బండ మోసే మజ్దూరలోనుంచి ఒక కంఠం రాజయ్య మాట్లాడే ధోరణిలోనే.... "దొరల యిండ్లల్లకు ఎవల్నిత్తు" అని పూర్తిచేసిండు. రాజయ్య ముసలిమొఖం ముడుచుకోని ఏమూతిలోంచి ఆమాట వచ్చిందో అని చూడపోయాడు కాని వీలుకాలేదు.

దూరంగ ఆఫీసురూంలోంచి సేఫ్టీఆఫీసరు రాగిచెంబుగుండు పుణుక్కుంటూ బయటకువచ్చిండు. యిందాకకూర్చుని వాదించుకుంటున్న కోల్‌ఫిల్లర్సు కొందరు ఒకర్నిపట్టుక ఒకరులేస్తూ.... "ఎహె.... పారాండ్రి.... పాండ్రి పొయ్యి సేఫ్టీఆఫీసర్ని అడుగుదాం, నిన్నటిసంగతి మర్సిపోయిండా ?" అని గుంపుగానెళ్ళి చుట్టుమూగిండ్రు వుత్తరదేశపు గుప్తగారిని, అంతమందినిచూసి జడుసుకున్నడు. నిన్నతనను బాయిల, వేడివర్కింగుప్లేసుల గంటసేపునిలబెట్టి చెమటతో బట్టలన్ని తడిసేదాక, తిట్టినతిట్టు తిట్టకుంట గాలిలేదని తిట్టినసంగతి జ్ఞాపకంవచ్చి బయపడిపోయిండు. అండ్ల మళ్ళ తెలుగురాదు. ఎర్రని బోడిగుండుమీద చిరుచెమటలుపట్టినయి. అయినా కోల్‌ఫిల్లర్సు దిక్కుచూసి ఏంకావాలి ? అన్నట్టు కనుబొమలెగరేసిండు. మందిలోంచి ఓ గడ్డం సాహెబు ముందుకొచ్చి "ఈడికి మూడ్రోజులున్నించి చెప్తానం, ఎవలుపట్టించుకుంట లేరు. టూసీము[4] ఫిఫ్టీన్‌డీపుల గాలిగురించి లోపల్నేమె పుచ్చదీసైమండుతంది గర్మికి." అని అనంగనే సాహెబును, సాహెబుగెడ్డాన్నిచూసి హిందీవచ్చుకావోలు ననుకొని "హాఁ భై ముఝే...." అంటూ యింకేదో చెప్పబోతే ఒక కార్మికుడు కిసుక్కుననవ్వి "సారూ ఆను సగంతురుకోడు. నాకన్నయింత బాసఅత్తదిగని వానికి అసలేరాదు" అన్నడు. సాహెబుకోపంగ

"బలిసినావుర లచ్చిగా" అని మూతిపోట్లు పొడువబోయాడు. మిగతావాళ్ల భళ్లుననవ్విండ్రు.

సర్దార్లు ఓవర్‌మన్లదగ్గరికి, ఓవర్‌మ్యాన్లు అండర్‌మేనేజర్లదగ్గరికి, అండర్ మేనేజర్లు మేనేజర్‌దగ్గరికి 'ఆసు'కొయ్యలతీరుగ తిరుగుతున్నరు.

మైసమ్మగుడిని మజ్దూరొకడు నీళ్ళతో కడుగుతున్నడు. మ్యాన్-వేముందు మైసమ్మ గుడిపక్కన టింబరింగుకార్మికులు నిలబడి ఎంతకూఎక్కని నైట్‌షిఫ్ట్ టింబరింగ్ కార్మికులకోసం ఎదురుచూస్తున్నరు. పోయి పనిచేయాల్సిన డీపిల్లరింగ్ డిస్ట్రిక్టు ఎలావుందోనని గాభరాపడిపోతున్నరు.

వాలినమీసాలుగల టింబరింగుకార్మికుడు చంద్రియ్య, నర్సయ్యతో "యియ్యాల మనకు కొత్తబెంపటీ మజ్దూర్ లింగయ్యఅత్తాండు" అనిచెప్పిండు. నర్సయ్య లింగయ్య దిక్కుచూసినవ్వి "వానికేంది నీతల్లి.... కుర్రిక్కుర్సిన్నడు, మొన్ననే పెండ్లి అయిందట పోరి సిలుకున్నట్టుగున్నది" అని మళ్ళ నవ్విండు.

4. టూసీమ్ భూమిలోని రెండో బొగ్గుపొర

"ఎల్లరెడ్డి జెరపొద్దుగాల వోతడట, భార్యను తీసుకోని దావఖానకు పోతడట" పొగాకుతుంచి నోట్లోవేసుకుంటూ టింబర్ మెన్ మల్లయ్య చెప్పిండు.

"ఎందుకట ?" వాలినమీసాల్ని మీదికి తిప్పుతూ చంద్రియ్య అడిగిండు.

"ఎందుకంటె రేపోమాపో రెడ్డికి కొడుకోబిడ్డో పుట్టవోతాండు్రి" పక్కకు తిరిగి ఎల్లరెడ్డి దిక్కుచూస్తూ అన్నడు నర్సయ్య. ఎల్లరెడ్డి కళ్ళల్లో ఒక్కక్షణం వెలుగు. తిరిగి నర్సయ్య అన్నడు.

"ఏమోమ్మపా.... పొద్దుగాలవోతమని మీద అనుకోవద్దు, నైటుషిప్టోడు యిదు వఱదాక ఎక్కలేదంటె డిప్లరింగుల ఎట్లున్నదో ఏందో?" విరక్తిగ పెదిమలువిరిచిండు.

"ఆ కూలుడు, ఆ టాపుసప్పుడు రాత్రి కలలగూడ కనిపియ్యవట్టింది. నీయక్క బయానికి నిద్రిపట్లేదు నర్సన్నా" అని చెప్పిండు మల్లయ్య. అంతవరదాక పళ్ళల్ల పుల్లలు దూర్చుకుంటున్న పొట్టి ఓదెలు నవ్వి "గంతపిరికి" అన్నడు. మల్లయ్య రోషంగ "నీయక్క మొండిమొదలారివున్నవు నత్తెఏశ్సటానికి నీకు పెండ్లమా పోరగాండ్లా ? నీకేందెలుత్తదిరా సంసారిబాధ" అన్నడు. టింబర్ మ్యాన్స్ టెంపరరీ మజ్దూర్స్ అందరూ మూడురోజులుగా ప్రమాదంగ తయారైన డీపిల్లరింగ్ డిస్ట్రిక్టు గురించి తలుచుకుంటు బయపడిపోతున్నరు.

కొండచిలువ చప్పరించి, బయటకు నాలుకతో తోసినట్టు నైటుషిఫ్ట్ టింబర్ మ్యాన్స్ టెంపరరీ మజ్దూర్సు వెనకాలె డీపిల్లరింగ్ సర్దార్ (సూపర్ వైజరు) పైకి వచ్చిండు. సర్దార్ చార్జ్ యివ్వడం కోసం రూంలోకిపోయిండు. ఎక్కిన టింబరింగు కార్మికులు చేతుల్లోని గొడ్డళ్ళను రంపాలను, పికాక్స్‌లను కిందపెడుతుంటె్రి అందాక నిలబడిఎదురుచూసిన మల్లయ్య చంద్రియ్య, ఎల్లరెడ్డి ముగ్గురూ ఆత్రింగ అడిగింద్రు

"డిప్లరింగు ఎట్లున్నది ?" అని ఒకరంటె "గోఫ్‌కూలిందా లేదా ?" అని మరొకరు. "మాషిష్ట్ మంచిగ నడుత్తదా ?" అని వేరొకరు ప్రశ్న మీద ప్రశ్న వేస్తుంటె నర్సయ్య కసురుకుంటూ,

"నసరాదుర్రి.... మీదపడ్డట్టు ఏందాఅడుగుడు ?" అని నైటుషిఫ్టు కార్మికుల దగ్గరికివస్తూ....

"ఏమాయెనే బాలన్నా ! లోపల గోఫుఎట్లున్నది ?" అని అడిగిండు. బాలన్న నడుముకు చేతులానించుకుంటూ

"మూడ్రోజులున్నంచి ఎట్లున్నదో గట్లనేవున్నది. ఒకటే సిటపట పైనమీద ఎక్కన్నోటాపు పట్టువదిల్నట్టు 'గుప్కు.... గుప్కు' మని ఒకటే సప్పుడు. పెద్దపులి నోట్లెకుపోయి అచ్చినట్టు బయం బయంగ లోపలికిపోయి ఓ తట్టెత్తుతరో లేదో, యాన్నో 'పటపటానెటా'ల్లకు, పన్జేసెటోళ్ల 'గెబగెబాని' ఒకటె వురికచ్చుడు. నర్సన్నా నాకైతె బొంబెస్ పి....లువొయి కపాలం బట్టినయి తాపకోసారి" అని చెప్పంగనే మరో కార్మికుడు

"జెర్రయితె మేం అందరం వొడిసెటోళ్ళమె లోపలకొంచెం కూలినప్పుడు మా కొంకులు తొక్కినట్టే అచ్చింది." కళ్లపెద్దగ అటూయిటూతిప్పుతూ అన్నడు.

"ఒగన్నొగడు దొబ్బుకుంట వురికత్తె అగోసూడు దెబ్బలెట్ల తాకిచ్చుకున్నరో" అని బాలయ్య నర్సయ్య నుద్దేశించి చెప్తూ....

"నర్సన్నా....సైడో, బాటమో పెట్టుకోని మావబ్బం గడుపుకోని బురుదల బండేసుకోని దాటి అచ్చినట్టు అచ్చినం. లోపలొక్కదాటులేదు పెడ్తాంఅంటె కడుదాం అంటె తుంటలులెవ్వు. ఒక పేసీల సపోర్టులు లెవ్వు మీరుమాత్రిం పదిలం" కాళ్లకాళ్ల తాకులాడుతుండగ వెళ్ళిపోయిండు.

డీపిల్లరింగ్ పనిస్థలం ప్రమాదంగ వుందని తెలుసుకోని టింబర్ మ్యాన్స్‌కి గుబులుపుట్టింది. బతుకుపట్ల తీపికలిగింది. పీలైనంతవరకు డెవలపింగ్ వర్కింగ్ ప్లేసుల్లోకి పోవాలని ఎవరికివారే ఎత్తులువేస్తున్నరు. డీపిల్లరింగ్ డిస్ట్రిక్ట్ సర్దార్ రంగయ్య చార్జ్‌తీసుకుని టింబర్‌మ్యాన్స్ దగ్గరికివస్తూ "పొరాదుండ్రి నర్సయ్యా" పాండ్రి" ఫస్టెయిడ్ కిట్‌లోదూది బ్యాండేజీ వుందోలేదో చూసుకుంటూ అన్నడు

"లోపల తుంటలేదట, దాట్లులెవ్వట, గడికోసారిగోఫ్ బెదిరిత్తాందట! గవ్వే పనులు పాండ్రింటె ఎట్లమొఖద్దమ్?" అని చంద్రియ్య అంటె "యిన్యాటికి ఒక రోజు ఫిల్లర్నోల్లను ఎటన్నతోలి డీప్లరింగు బందువెడ్తేంది" అని మల్లయ్య అన్నడు.

"నేనుగట్లనే అడిగిన మేనేజర్ను" తల గమ్మత్తుగ వూపుతూఅన్నడుమొఖద్దం.

"అంటె ఏఁవన్నడు?" మల్లయ్య, చెంద్రియ్య యిద్దరు ఒకేసారి అడిగిండ్రి

"అవునండీ నేను కూడ ఈబాయినుంచి వేరేబాయికి పెల్తానంటె ఎవరూ వెళ్ళనివ్వడం లేదండీ పైదొరలు అన్నడు"

"ఆ వాళ్ళకేంది? గట్లనే అంటరు అట్లచ్చిట్లవోతరు వాళ్ళకేం తెలుసు? రేపే

దన్నయితె ఎవనిసేతులు వానినెత్తిమీదపెడ్తరు" అంటూ "రాండ్రోమురా" అని మిగతావారిని పిలిచిండు నర్సయ్య.

"నాకు రాంగనే కడుపునొప్పి మొదలైందే నర్సన్నా నేను పోర్త్వం[5] డిస్ప్రిక్టు బోయి అటోళ్ళను ఇటుతోల్త" అన్నడు చంద్రియ్య ముక్కువిరుస్తూ.

"ఎందుకత్తరా ఇసొంటి పండవాట్లగాడ్డులు. పోర్త్వంబోయిమాత్రం పంటావుర పరుపేసుకోని," గొడ్డలి బుజానపెట్టుకుంటూ కోప్పడ్డడు నర్సయ్య. చంద్రయ్య తేలుకుట్టిన దొంగతీరుగ పూరుకుంటె, మల్లయ్యమాత్రం కిటుకు కనిపెట్టినవాడి తీరుగ.

"ఆఁ డిప్లరింగు బాగలేదంటె కడుపునొప్పిలేసింది. లేకుంటె ఎందుకునేసు ?" అన్నడు. అందాక చప్పుడుచెయ్యని ఓదెలు లేచినిలబడుతూ "ఏహే గదేంజేత్తది పీకుద్దా ? పోదాంపాండి" అన్నడు నర్సయ్యకోపంగ "ఓహో బయిలెల్లిండే పదే టాపును ఏలుపెట్టి ఆపెట్టుగున్నడు. నీతల్లి మాటలుమాట్లాడుమంటె పాట్లాడుతరు". అని కోప్పడుతూ మ్యాన్-వేలోకి దిగగానే మిగతాముగ్గురు టింబర్‌మ్యాన్స్, నలుగురు సెంపటరీ మజ్దూర్స్ అనుసరించిండ్రు. ఫిల్లర్సుకార్మికులుఇతరులుకొందరు దిగుతున్నరు. మరికొందరు వారి వారి పనుల్లో ఇబ్బందులగూర్చి అధికార్లతో తగువులాడుతున్నరు.

రోజుతీరుగకాకుండ ఈరోజు మరింత బయపడుతూ దిగుతున్నరు టింబర్ మ్యాన్స్. నర్సయ్యమాత్రం 'బొనుగ' గొడ్డుతీరుగ గొడ్డలికాపు కిందానించుకుంట దబదబ నడుస్తున్నరు. మిగతావాళ్ళ మనసు మనసులలేదు.

"అంత అగులుబుగులు అయితాందేమల్లన్నా" అన్నడు చెంద్రియ్య. "నాకు జెప్పు" అనివత్తిపలుకుతూ బురదగావుండటంవలన జారికూలబడి పోయిండు మల్లయ్య. "అయ్యో....అయ్యో" అనుకుంట లేవదీసిండ్రు మిగతావారు.

"ఓరోజు నలుగుర్నిపెట్టి మెట్లుకొట్టిత్తెందో" అన్నడు చంద్రియ్య.

"నలుగుర్నిపెట్టి తవ్వితె వానికి నాలుగుబుబ్బలు బొగ్గునిండుద్దా ?" వెటకారంగ అన్నడు నర్సయ్య.

"నీతల్లి సేఫ్టికమిటి మీటింగటబెడుతరు. అండ్లున్న గాడ్దికొడుకులంత లడ్డు,

---

5. [illegible]

చాయకోసమే కసేపుండిఅత్తరుగని. గాడగట్టున్నది గీడగిట్లున్నది అని ఎవడు చెప్పడు" అన్నడు నర్సయ్యనడుస్తూనె.

"డిప్లరింగంటె ఏంది?" కుతూహలంగ అడిగిండు లింగయ్య ఎల్లెశెట్టిని.

ఫాల్టుఅచ్చేదాక పిల్లర్లు యిడిసిపెట్టుకుంటపోయి ఫాల్టురాంగనే ఎనుకకుమర్రి యిడిసిపెట్టిన పిల్లర్లను లేకుంట తీసేపద్దతిని డిప్లరింగంటరు అన్నడు ఎల్లశెట్టి. "మరి గోఫ్ అంటె?" మరోమాట అడిగిండు లింగయ్య. "గోఫ్ అంటె బొగ్గుపిల్లర్లు లేకుంట తీస్తాంటె ఖాలీజాగ ఏర్పడుతదిసూడు దాన్నే గోఫ్ అంటరు. దానిమీద బండకప్పు ఆగి సూసుటానికి బయంగుంటది." అన్నడు కళ్ళు పెద్దవి చేసిచెప్తా. "తొలుసుకుంటపోవుడే డేంజరంటె మళ్ళలేకుంట తీసుకచ్చుడు యింక డేంజరన్న మాట" తనకుతానే అనుకున్నట్టు అనుకున్నడు లింగయ్య. అట్లాఅనుకుంటుంటె "ఓ మనుమడా! సూత్తుపుగని రారాదు ఎన్నడుగాలేదా డిప్లరింగు" అని అంటున్న నర్సయ్య నుదుటికి పైనటాప్‌కు సపోర్టుగ ఎక్కించిన 'గాడర్' తలకు తతకొసుని తగిలింది. నర్సయ్యకు కండ్లనీళ్ళుతిరిగినయి. కొంతమంది కోల్‌ఫిల్లర్లు డిప్లరింగ్‌లోకి వస్తూ అధికార్లను తిడుతున్నరు.

"ఒకరోజు డిస్ట్రిక్టు బందుపెట్టి వేరేమిషిన్లకు పంచుమంటె పంచరట. వానప్పు లంగనోళ్ళల్లనా...." అని తిట్టుకుంటూ దబదబనడుస్తూ పోతున్నరు. చాలాదూరం పడుతూలేస్తూ, బురదలో చీకట్లోనడిచి డీప్లరింగ్ డిస్ట్రిక్టు చేరుకునేసరికి సర్దార్ రంగయ్య 'ఎండ్‌లెస్' [6] రోప్ తోవగుండా ముందేవచ్చి జంగ్షన్లో కూర్చున్నడు.

"పోదాంవా? లోపలికి" అని అడిగిండు నర్సయ్య.

"మెదకువద్దపాము కరుపకమానుద్దా?" అంటులేచి ఓమజ్దూర్ పంక తిరిగి "సాయిలూ! నువ్విక్కన్నేవుండి ఎవల్ని లోపలికిరానియ్యకు మళ్ళ నేను మనిషిని తోలేదాక" అని చెప్పి టింబర్‌మ్యాన్‌ని మజ్దూర్‌ని వెంటబెట్టుకుని పర్కింగు ప్లేసులు చూసుకోడానికి పోయిండు సర్దార్.

పైన బండటాప్పుకు లైట్లుపోకసచేస్తూ ఏసైడువారిగిందో ఎక్కట టాప్ పట్టు వొదిలిందోఅని మెల్లగా అడుగులో అడుగేసుకుంటు నిద్రపోతున్న పెద్దపులి గుహ

6 ఎండ్‌లెస్‌రోప్ : బావిలో సమాంతరప్రదేశాలైన లెవల్లలో భర్తీ, ఖాళీటబ్బులు ఒకచోటినుండి మరోచోటికి తీసుకుపోవుటానికి రెండు ట్రాక్‌లైన్లు ఒకేలెవల్లో వేసి, రెండుచివరలు కలిపిన ఒక యినపతాడును హాలర్‌తోనడుపుతారు.

లకు పోయినట్టు పోతున్నరు లెవెల్‌లోంచి. కొద్దిదూరంలవున్న గోఫ్ ఏరియాలోంచి ఏమైన చప్పుడువస్తుందో ఏమోఅని చెవులు నిక్కబెట్టుకోని నడిచి "గోఫ్" దిమ్మల దగ్గరికివెళ్ళి గోఫ్‌లోకి లైట్లుఫోకస్ చేసి చూస్తున్నరు.

"అబ్బో! ఎంతఘోరంగున్నది? ఎకురంఎల్పుతోటి టాపు ఎట్లాగిందో సూడు" కండ్లు పెద్దవిచేసిచూస్తూ ఆశ్చర్యపోయిండు లింగయ్య.

"దానిఆవలసూడు తెల్లగ గుట్టలుగుట్టలుగ కూలిందిసూడు అదంత టాపు కూలినబాపతు 'వుసికబండ' " చెప్పిండు ఎల్లరెడ్డి.

"ఆ బండకూలంగ దానికిందుంటె.... వామ్మో" గుండెమీద చేతులేసుకుంటు అన్నడు లింగయ్య.

ఎక్కడో సైడునుంచి బొగ్గుపెళ్ల జారిపడ్డట్టు అయింది ఒకర్నొకరు తోసుకుంట పరుగెత్తుకచ్చిండ్రు.

అది గోఫ్ కూలేచప్పుడు కాదని గ్రహించిన రంగయ్య సర్దార్ "ఆగుండ్రి. ఆగుండ్రి వట్టిసప్పుడే" అని అరిచిండు.

నర్సయ్య తల అడ్డంగవూపుతూ.... "మారె మొఖద్దం యియ్యాల ఆ వర్కింగు ప్లేసులు బందుపెట్టుండ్రి. సైడో, బాటమో యిబెంకల సూసిపెట్టించుండ్రి" అన్నడు ఎగపోస్తు. మిగతావాళ్లు ఒక్కపరుగుతోపోయి జంక్షన్ల చేరిండ్రు "పొద్దుటిబదిలి దొరలబదిలి మనిట్టం నడుత్తదా? ఓ అరగంట గోఫ్ సంగతి సూసిసూద్దాం" అని తిరిగి గోఫ్ దిమ్మల దగ్గరికి పోయిండ్రు నర్సయ్య, మొఖద్దమ్. మొఖద్దమ్ తన లైటును గోఫ్‌లోకి ఫోకస్‌చేస్తూ...." నర్సయ్యా నడుమవున్న 'యిషార'దాటు[7] మంచిగనే వున్నది గోఫ్ అత్తదంటవా?" అని అనుమానపడ్డడు.

"గుపుక్, గుపుక్‌మని టాపు పట్లొదిలిన చప్పుడు యినుకుంటనే గట్లంటవేంది మొఖద్దం! గోఫ్‌కూలితె గా దాటోలెక్క?" అన్నడు నర్సయ్య "ఒక్క వర్కింగు ప్లేసులో కూడ ఒక్క సపోర్టులేదాయె ఎట్లదగాయించి ఫిల్లింగు చేయింతుడో ఏందో?" అనుకున్నడు రంగయ్య మొఖద్దం.

"అద్వాన్స దిమ్మెలు[8] పూడటీకిఏదాంవన్న అవెక్కవలేకపాయె, సీతల్లి ఎప్పుడు తుంటలదరిద్రిం" విసుక్కున్నడు నర్సయ్య.

---

7. దాటు : కర్రిసపోర్ట్
8. దిమ్మె : నాలుగుఫీట్ల తుంటలతో చతురస్రాకారంగ కట్టె సపోర్టులు

"ఒక్కొక్కడు వెయిలకు వెయిలు జీతాలు దొబ్బుతడుగని, లోపల తుంటున్నదా? దాట్లున్నయా? మరిలోపల సేఫ్టిఎట్లున్నది అన్నసంగతి ఒక్కడుపట్టిచ్చుకోడు" మళ్ళ వచ్చిన చంద్రియ్య అన్నడు.

"ఎందుకు వట్టిచ్చుకుంటరు యిరువైనాలుగ్గంటలు బండకిందసచ్చేడు మన మాయె" మల్లయ్య కోపంగఅన్నడు.

"సేసెటోళ్లు యిద్దరాయె, సూసెటోళ్ళు ముగ్గురాయె" రాగంతీసిండు మజ్దూర్ కొమురయ్య.

"ఎయ్ ఏందాపాట? ఎవడన్నింటె రాడికలోనివనో యిష్టోనివనో నౌకరి పీకేస్తరు. నువ్వసలే టెంపరరీమజ్దూరివి" హెచ్చరించాడుమొఖద్దం. అంతలోనే డిస్ట్రిక్టు ఓవర్‌మ్యాన్ శంకరయ్య టార్చిలైనుమీద కర్రి టకటకలాడించుకుంట వస్తూ.... "ఎట్లుంది మొఖద్దం గోఫ్?" అని అడిగిండు.

"పొద్దులునిండినట్టు యిప్పుడో అప్పుడన్నట్టున్నది" మొఖద్దం.

"మీద రిలే సి సర్దార్ను వోవర్‌మ్యాన్ను, మేనేజరు తిడుతాండు". అన్నడు వోవర్‌మ్యాన్ శంకరయ్య.

"ఎందుకు మొన్న లాడీసోళ్ళకు మస్టర్లుచేయించినందుకా" మొఖద్దంఅడిగిండు

"మొన్నటిమస్టర్లెక్కడియి?" కనుబొమలు కుదించిఅడిగిండు నర్సయ్య.

"మొన్న 'రిలే సి షిఫ్టుల' గిట్ల గోపునప్పుడచ్చి ఫిల్లింగుకాకపోతె పదిమంది లాడీసోళ్ళకు మస్టలిచ్చిడైందట" సర్దార్ చెప్పిండు.

"మా అసోంటోళ్ళకు ఒక్కనాడు పదిమందికి మస్టర్లిత్తెనే లాడీసోళ్లు బతికి పోయి, కంపిని లాసైతదా? పెద్దపెద్దోళ్ళు వాగిన్లకు వాగిన్లు బొగ్గుఅమ్ముకుంటాంటె ఏఁవిలేదుగని" వర్కింగుప్లేసులు స్వయంగ, తృప్తికోసం ఎలావున్నయో చూడ్డానికి అప్పుడేవచ్చిన కోల్‌ఫిల్లర్ దురుగయ్య అన్నడు.

"నువ్వెందుకచ్చినవు? అవుతల గోపుమంచిగలేదు" విసుక్కున్నడు సర్దార్. "ఎవడు? అమ్మోరుమొఖపోడా? నువ్వెందుకచ్చినవురా అడివిలకుపోంగనే ఆగ కుంటవురికే మ్యాకపిల్లతీరుగ నువ్వు డిప్లరింగుఅచ్చినవంటెనే గోపులకు వురికి అత్తవేందిర?" టింబరింగు నర్సయ్య కొద్దిగ పరాశికమాడిండు.

"ఎందుకచ్చినోన్నె ఎట్లతెలుస్తదిరా? ఎన్నడన్న నాలుగుటబ్బులు ఫిల్లింగుచేస్తె గద బామ్మర్దీ! తెలిసేది" అన్నడు అమ్మవారుపోసి మొఖంఅంతా గుంటలు గుంటలు,

చెదలుపట్టిన తుమ్మమొద్దుతీరుగవున్న దురుగయ్య. తిరిగి దురుగయ్య "గోపు గట్ల బెదిరియ్యవట్టె ముప్పయిమందిని పెడితిరి ఎట్లసారూ ?" ఓవర్‌మ్యాన్ శంకరయ్య దిక్కు తిరిగి అన్నడు.

"బాబూ రిలే (బి) షిఫ్టుల గిదే ముప్పయిమందినివెట్టి టొంబయిటబ్బుల రేజింగు ఎక్కిచ్చిండ్రని మేనేజరు మమ్ముల కోప్పడవట్టె" అని శంకరయ్య చేతి లోని కర్రి పిర్రికానిచ్చుకుంటూ సర్దార్‌వంక తిరిగి,

"రిలే బి సర్దారుకు, వోవర్‌మ్యాన్‌కు పోయిననెలల మూడు మూడు 'ఓటీ'లు[10] యిచ్చిండట మేనేజరు" అని గుసగుసచెప్పిండు. వారట్ల మాట్లాడుకుంట వుండంగనే గోపులో ఫటఫటమని టాపు అదిరిపోయిన శబ్దంవచ్చేసరికి ఒకర్నిపట్టక ఒకరు తోసు కుంట ప్రాణాలుఅరచేత్తోపట్టుకుని గెబగెబ పరుగెత్తుకొని జంక్షన్లకుపోయిండ్రు పరు గెత్తడంలో ఓవర్‌మ్యాన్ శంకరయ్యకు దారిలోదాటు (సపోర్టు) తగిలి మోకాలుకు దెబ్బతగిలింది. వీరిట్ల పరుగెత్తుకు రావడంచూసిన కోల్‌ఫిల్లర్సు జంక్షన్లోంచి తట్టలు చమ్మసులువదిలి వురుకుడు మొదలువెట్టిండ్రు.

"ఆగుండ్రి, ఆగుండ్రి గోఫ్అత్తలేదు" అరిచిండు సర్దార్. "గంత బయ పడుకుంట వురికత్తె ఎట్లనయ్యా ఒగలకొగలు దెబ్బలు తాకిచ్చుకుసుడే ఎక్కువ" తనకు దెబ్బతగిలినచోట పుసుకుంటు ఓవర్‌మ్యాన్ అన్నడు.

"గోఫ్ ఎట్లున్నదే దురుగన్నా!" నమ్మకమైన సమాచారంకోసం తమతోటి కార్మికున్నే అడిగిండ్రు కోల్‌ఫిల్లర్సు.

"లోపలికివోతెనైతె బయిటికిరారు" ఒకటేమాట చెప్పిండు దురుగయ్య వాళ్ళ గుండెల్లో 'గోఫ్' కూలినట్టు అయింది.

"నీదంత అబ్బరపులి: అంటె తోకబారెడు, సప్పుడుజేయకవూకో" కసురు కున్నడు వోవర్‌మ్యాన్. బయం బయంగ గుసగుసలాడుతున్నరు కోల్‌ఫిల్లర్సు. కోల్ కట్టర్సు, షాట్‌ఫైరర్ నిమ్మలంగ నిరింధిగ కూర్చున్నరు.

గోఫ్ అచ్చేటట్టున్నది" వోవర్‌మ్యాన్‌వంక సర్దార్‌చూసి మెల్లగ చెప్పిండు.

"గోపుల యిషారదాటు యిరిగిపోకుంట మంచిగనే వున్నదికదా దాటుమీద 'వెయిట్'పడితె 'కిటకిట' సప్పుడు చేస్తదికద" వోవర్‌మ్యాన్ సర్దార్ను అడిగిండు.

---

10. ఓ. టీ : ఓవర్ టైం

"ఏమో చెప్పలేం...." అంటూ "రాండ్రి" అని ఓవర్‌మ్యాన్నుపిలిచి "నర్సయ్యా ఏడీ మళ్లోసారిపొయ్యి సూసిఅద్దాంరా" అని లోపలికి దారితీసిండు. గుంపుగకూర్చుని కోల్‌ఫిల్లర్సు తలలకు చుట్టబట్టలుకూడ చుట్టుకోవడం దండుగ అని ఏదో ఏదో మాట్లాడుకుంటున్నరు. గుంపులోంచి ఒకడు "పాపం ఈరన్నకు ఎక్కడి గతిఅచ్చె" సానుభూతిగ అన్నడు "ఏమైంది?" అని మరోయిద్దరు అడిగిండ్రు

"నిన్న ఫోర్సింకుపోతె పొగకు 'వస్కవస్కన' దగ్గి రెండు టబ్బులను ఎత్తె టాళ్ళకు గర్మికి వశపడక పేసిలేన్నెపడ్డడట యిగ ఈరన్నఫైలు[11] తట్టెత్తుకోని దీబుల జారిపడి హాస్పిటల్ల బెడ్డెక్కి వన్నడు. దిస్లరింగుల జరసల్లగుంటదని యియ్యాల యిటత్తె బావనోన్ని యిడిసిపెట్టి దొమ్మరోనికి పోయిసస్తుగున్నది" అని చెప్పిండు. సదరు ఈరయ్య రంధితోకూర్చున్నడు.

లోపల.... చాలాసేపు కూర్చుండి గోఫ్‌ఫాల్ అయ్యే అవకాశం పరిశీలించేరు సర్దార్, వోవర్‌మ్యాను, నర్సయ్య.

"అండర్మేనేజరు యింక రాకపాయె మజ్దూర్లన్న తోలరాదు" నర్సయ్య సర్దార్‌తో చెప్పిండు. సర్దార్ వోవర్‌మెన్ పంక చూసిండు. ఓవర్‌మ్యాన్ నర్సయ్యతో "నర్సయ్యా.... మూడు వర్కింగుప్లేసుల్ల ఒక్కొక్క కేఫ్ బొగ్గు అయితది టాప్రిమర్సు ఖాలీ టబ్బులిమ్మని, కోల్‌కట్టర్సుతో ఏఫేసుల వీలైతె ఆ పేసుల పుళ్లు కొయ్యమని చెప్పు, చెప్పి మీదిపేసుల నువ్వుండు అంత బదిలీఫిల్లర్సే, జెరజాగర్తగ ఫిల్లింగు చేయించు యిద్దరు మజ్దూర్లను తీసుకపొయ్యి ఏడవుంటెఅడ దాస్లుతెచ్చి సపోర్టు చేయించు" అని పురమాయించిండు. "గోఫు గట్లుండె, ఫిల్లింగు మొదలువెడ్తె ఎట్లనంటరు? ఏడిదాకకూలుకత్తదో ఏందో?" సర్దార్ బాధపడుతూ చెప్పిండు.

"మరేంజేసుడండీ నేను మీదనేవద్దన్న ఆయింత గోఫు వచ్చేదాక ఒకరోజో రెండురోజులో డిస్ట్రిక్టు బందుపెట్టిసూద్దాం అని. కని మేనేజరు ఒప్పుకోలేదు. రేజింగు అచ్చే డిస్ట్రిక్టు బందుపెట్టుకోని మనంవంత ఏంజేద్దాంవండీ అని 'కారెడ్గం' ఆడిండు" అని మళ్ళీ, "లాడీసోళ్ళదగ్గర సేఫ్టీఫస్టంటరు. ఆఫీసులకు వోయినంక అవుట్‌పుట్ ఫస్టంటరు నడుమనచ్చేదిమనమండి." అనటానంగ గునిగిండు వోవర్‌మ్యాన్. కొద్దిసేపట్లోనె తిరిగి వచ్చిన నర్సయ్య "సారూ.... ఫిల్లర్సొల్లురారట. యింక జెరాగి సూత్తం అంటాండ్రు" అని చెప్పిండు.

---

11. ఫైలు: యిద్దరు కార్మికుల్ని కలిపి ఫైలు అంటరు బొగ్గుఎత్తి తట్టలో నింపితె, మరొకడు ఆ బొగ్గును టబ్బులో నింపుతాడు.

"యింక జెరాగినంక అంటె మూడింటికి పోతఁటా్న?" కదిలిండు వోవర్ మ్యాన్ "ముండకొడుకులకు పిరికిపొచ్చింది" అన్నడు సర్దార్.

"ఏఁవైందయా? రమ్మంటె, బయంఅయితాందటకద ఎవలకు?" అని అడిగిండు.

"ముసురువడ్డట్టు గోపుల బండకూలనేవట్టె ప్యాలాలు ఏగినట్టు పక్కలనుంచి బొగ్గుపెళ్ళలు రాలవట్టె, పుట్టెడు బండకింద ఎట్లపన్జేసుడుసారూ? ఓ దమ్మలేదు దాటు లేదు" రాయమల్లులేచి ఓచెయ్యి రొండికానించుకుని మరోచెయ్యి తిప్పుతూ అడిగిండు వోవర్ మ్యాన్ ముఁగిసతీరుగ మూతిముందుకుసాపి "ఏం సువ్వొక్కనివే సేత్తానవా? షిఫ్టోడు సేసిపోలేదా? నీతోటి నేనుంటలేనా?" అని అడిగిండు.

"మాపుంటరు మీకేంది? పిట్టబుర్రిమంటె బుట్టసంకసవెట్టుకోని వురికచ్చినట్టు కట్టెసంకసవెట్టుకోని వురికత్తరు." అన్నడు రాయమల్లు.

"గది గుర్రిం గిదిమైదానం.... ఆయంక మస్టర్లు కావాల్నంటె కుదురని పని" అన్నడు వోవర్ మ్యాన్.

గట్లంటె ఎట్లనయ్యా సారూ? ఎవరో గుంపులోంచి దీర్ఘంతీసిండ్రు.

"కాకుంటె నాగాలువెట్టుకోనిపోండ్రి" వోవర్ మ్యాన్.

నాగాలువెట్టుకోని పోవుటానికే అచ్చినఁవా? అంతదూరం నుంచి మీతరీఖ కుటకుట మోటర్లమీద రాలేదు, ఈడ్సుకుంటీడ్సుకుంటచ్చినం." చాకలి మల్లయ్య మందిలోంచి అన్నడు.

"అత్తె రిటనుపొమ్మన్ననా? పనిసూయించిన"

"బదిలీపిల్లరోల్లతీరుగ అయితె మమ్ముల్నిగూడ పడింటిదాక మీద బొగ్గు మోయించుకోని 'రిటన్' పొమ్మంటరు." అని ఎవరో అంటె బదిలీఫిల్లర్స్ పది మంది బితుకుబితుకుమని వొదిగివొదిగి కూర్చున్నరు

"మీయిష్టమయ్యా!" చిరాకుపడి చెప్పిండు వోవర్ మ్యాన్.

"నీతల్లి యిట్టాల యిట్టాలుఅని ఎవనికొంపలు ముంచుతరో ముంచనియ్. ఏఁవన్నగావాలెగని, గిప్పుడెందుకు" అని చాకలిమల్లయ్య కోపంగలేస్తూ "పార్రి మనపానానికి ఆయినపానం అడ్డంబెడ్తడట!" అనుకుంట బయలుదేరిండు. ట్రాక్‌లు (లైన్లు) మంచిగలెవ్వని తిట్టుకుంట 'ఖాలీ' టబ్బులు దొబ్బుకుంట లోపలికిపోయిండ్రు.

అందాక వట్టిగనేకూర్చున్న కోల్ కట్టర్సు "తప్పదిరా దేవుడా!" అనుకుంట ఎక్స్ప్లో జివ్స డబ్బాలు బుజాలకేసుకుని వర్కింగుప్లేసుల్లోకి నడిచింర్రు.

మూడు వర్కింగుప్లేసుల్లో ఫిల్లింగు మొదలైంది. బయం బయంగ, దూరంగ తూలిన బండను చూస్తూ.... చెమ్మస్కార్మికులు 'చెరచెర' బాటంపై చెమ్మసులు రాకుతోంటె బొగ్గుఎత్తి తట్టల్లోనింపుతున్నరు. మోసేవాళ్ల నెత్తికి చుట్టబట్టచుట్టుకుని మోస్తున్నరు. ఖాలీటబ్బుల్లో బొగ్గుపోస్తుంటె 'దఫెల్‌దఫెల్' మని ఒకచేచప్పుడు డీఫిల్లరింగులో ప్రతిధ్వనిస్తోంది. ప్రతిచప్పుడికి గబగబ బయటకు పరుగెత్తుకొస్తుంటె వోవర్‌మెన్ గొర్రెల్ని తోలుకుపోయినట్టు మళ్ళీ వర్కింగుప్లేసుల్లోకి తీసుకు పోతు న్నడు. టైం అయిపోతుందని ఆయనబాధ.

షిఫ్ట్ అండర్‌మేనేజరు వీరాజ్రు చేతికర్ర టార్చికిమీదతాటిస్తూ హుందాగ నడిచి వచ్చి వోవర్‌మెన్‌తో

"ఏంవైంది? ఫిల్లింగుయింతలేటు" అడిగిండు.

"గోఫ్ జెర సప్పుడుచేస్తుంటె" ఆగిపోయిండు ఓవర్‌మాన్. "ఆం....దాందే వుందండీ, కాస్తశ్రద్ధతో పనిచేయించాలిగాని, మూడురోజుల్నించి అదిఅలాగే వుంది" అని

"శంకరయ్యగారూ! మొన్న 'రిలే బి'లో రేజింగు బాగఎక్కిందని మేనేజరు సాబ్ ఎంత యిదైపోతున్నారనుకున్నారు?" కళ్లు విశాలంచేస్తూ చెప్పిండు.

వోవర్‌మ్యాన్ మాటమారుస్తూ "వర్కింగుప్లేసుల్ల సపోర్టులుబాగవుంటె గోఫు ఫాల్ అయినా రూఫ్ చెడిపోకుంటవుండు. గింత ఏమాత్రం సప్పుడైనా ఒగన్నొగడు దొబ్బుకుంట పురుకవట్టిరి" అన్నడు.

"అబ్బే వాళ్ళదంతా అదుగోపులీ అంటె తోకబారెడు అనేరకం. నిన్న రేజింగు ఎక్కలేదని మేనేజరుసాబ్ మన షిఫ్ట్‌గురించి ఒకచే గొడవ. యిప్పుడు నేను దిగేప్పుడు" అన్నడు వీరాజు.

"రేజింగు ఎక్కించుటానికేందండీ? సపోర్టుచేసుటానికి కనీసం తుంటలేదాయె దాట్లులెవ్వాయె." అన్నడు వోవర్‌మ్యాన్ విచారంగ.

"నిన్న స్టోర్లకు టింబర్ వచ్చిందట! ఈరోజు లారీపోయింది తీసుకురావడానికి" అన్నడు. ఆ మాటలువిన్న కోల్‌ఫిల్లరు ఖాలీతట్టతో తిరిగివస్తూ "అల్లుడచ్చేదాక అమాసఆన్నే ఆగుద్ది" అని గొణిగిండు వ్యంగ్యంగ.

"చూడుబాబూ! మీప్రాణాలు మీకే పట్టింపు అనుకోకండి. మీకేదన్నాఅయితె రేపుమాకొస్తుంది 'వురి'" అన్నడు వీరాిజు. బరువుతట్టతో తిరిగివస్తున్న అదే కార్మికుడు "ఎంతమంది కార్మికులు పచ్చిపోతె ఎంతమంది దొరలను వురితీసిండ్రు దొరా?" అని అడిగిండు.

"నాయనా! గోఫ్ మంచిగలేదు మాటలు తర్వాత" చకిరిం అడ్డేసిండు వోపర్ మ్యాన్. "హమ్మయ్య" అనుకున్నడు అండర్మేనేజరు వీరాిజు. "చెడిపోతున్నరు" అనికూడ అనుకున్నడు.

పొడవైన బరువుదాటు మోసుకొనివస్తున్నరు టెంపరరీ మజ్దూర్ప్ లింగయ్య. ఎల్లరెడ్డి. అదిచూసిన వోపర్మెన్ శంకరయ్య "అయ్యో.... యింకొగళ్ళ ఆసర వట్టుఁవంటె ఏఁవైందయా" అని సానుభూతిగ అన్నడు. అక్కడేవున్న నర్సయ్య అందుకుని, "వాళ్ళకేఁవైందిసారూ? మస్తుపన్జేస్తరు" అన్నడు. వీరాిజు "అలాగా" అన్నట్టు తలవూపితె మళ్ళీ నర్సయ్య అన్నడు.

"వీలైతె టింబరింగుల పర్మెంటు యియ్యాలె" అని వీరాిజు "చూద్దాం" అని వర్కింగుప్లేసులు తనిఖీచెయ్యబోయిండు. మూడులెవెల్లలో డయాగ్నల్గవున్న, వర్కింగుప్లేసుల్లో పనిముమ్మరంగ సాగుతున్నది. వుళ్లకోసేవాళ్లు కోస్తున్నరు. బొగ్గు తట్టల్లోకి ఎత్తేవాళ్లు ఎత్తుతున్నరు. టబ్బుల్లోనింపేవారు నింపుతున్నరు; చూసే అధికార్లు పైకప్పుకేసి, గోఫ్కేసి, చూస్తున్నరు. టింబర్మ్యాన్ప్ టెంపరరీ మజ్దూర్ప్ ఎడతెగకుంట పెద్దపెద్ద కార్స్బార్లుసైతం దాట్లుగాకోసుకోని తెచ్చి వర్కింగుప్లేసుల్లో వచ్చినకాడికి పెడుతున్నరు. నూతనోత్సాహంతో లింగయ్య. రాత్రి నిద్రలేక పోయినా భార్యకాస్త పొద్దుటే రమ్మనడంమూలంగ, చేతకాకపోయినా, ముందుగా అడిగి పర్మిషన్తీసుకుని వెళ్లాలని ఎల్లరెడ్డి గబగబ పనిచేస్తున్నరు. అప్పటికే టైం బాగగడిచిందని, ఫిల్లింగు ఏమీకాలేదని చిరాకుపడిపోతున్నడు వీరాిజు అండర్మేనేజరు. ఆఫేసులోంచి ఈఫేసులోకి ఈఫేసులోంచి ఆఫేసులోకి తిరుగుతూ కార్మికుల్ని గదమాయిస్తున్నడు వీరాిజు. టబ్బులో బొగ్గుగుమ్మరిస్తున్న ఒక కారికున్ని అక్కడేఆపి,

"ఏయ్ బాబూ! ఆ చివరిటబ్బు ఎవరిది?" కనుబొమలు ముడివేస్తూ అడిగిండు. "నాదే" అన్నడు పెయిమీదపడ్డదుమ్ము దులుపుకుంటూ "నీదేనా? చూడు బాబూ, నీకు మీవాళ్లో ఒకరోజుకూలి ఎంతిచ్చేవాళ్ళు?" యింటర్వ్యూ చేసున్నట్టు.

"బొగ్గుపొరల్లో...."

"అయిదు రూపాయలు" అన్నడు అనుమానంగ.

"యిక్కడ కంపెని నీకెంతిస్తుంది రోజు ?"

"సరీగసేత్తె ముప్పయ్"

"బుద్ధుండక్కర్లేదూ ? ముప్పయ్‌రూపాయలు తీసుకుంటున్నప్పుడు టబ్బు పరీగనింపాలన్న జ్ఞానంపుండక్కర్లేదూ ?" కోపంగ అన్నడు.

"యింకోతట్టట పొయ్యరాదుర ఆడ అయిదురూపాయలుగూడ మనకు ఎవ డియ్యడట ! ఈడ ఈనెజేబుల్నుంచి తీసియిత్తాండెమరి" చెమ్మస్‌తో బొగ్గుఎత్తుతూ మరోకార్మికుడు అంటె.

"ఆడ పండిచ్చిన పంటకు, ఈడ తవ్వితీసినబొగ్గుకూ అవుతల ధర ఒక్క తీరుగనే వున్నదా ?" అని మరొకరన్నరు.

"అదీకట్టమే ? యిదీకట్టమేనా ?" మరెవరో మందిలోంచి.

ప్రమాదాన్నిసూచించే విజిల్‌వూదాడు మధ్యలెవెల్లోని వర్కింగుప్లేసులోంచి సర్దార్, మరుక్షణం 'బాజు, బాజు' అన్న కేకలువిన్పించినయి. అంతే తట్టలు చెమ్మసులు ఎక్కడివక్కడ వదిలేది గబగబ పరుగులు మొదలువెట్టిండ్రు కార్మికులు. టబ్బులమధ్యనుంచి దిమ్మలమధ్యనుంచీ తీసుకపోతుంటె శంకరయ్య వోపర్‌మ్యాన్ మళ్లీ పడిపోయిండు. ఆ గడబిడలో అదిగమనించినా తొక్కుకుంట పురికి జంక్షన్లో ఆగిండ్రు కార్మికులు. కుంటుకుంటు వచ్చిండు శంకరయ్య. "ఏమైందండీ ?" అంటూ ముందే పరుగెత్తుకెల్లిన వీర్రాజు అండర్మేనేజరు దగ్గరికివస్తూ సర్దార్నడిగిండు

"గోపుల యిషారదాటు రెండుసార్ల యిరిగినట్టు సప్పుడైతె...." అనిచెప్తూ "ఒకటీ, రెండూ...." అని ఆత్రంగ కార్మికుల్ని లెక్కపెట్టుకుని తృప్తిపడ్డడు. అంతలోనే ఒకే ఒకక్షణం అందరి చెవుల్లోని 'గూబల్ని ఏదో బయటకు లాగినట్టు 'జువ్వ్వవ' బాధకల్గింది. లోపల.... గోఫ్‌లో ఏదో 'నఫక్'మన్న ధ్వని, మరుక్షణం వేగంగా, గోఫ్‌లోకి వెల్తున్న గాలివల్ల, గాలిలో రేగిన బొగ్గుదుమ్ము, స్టోన్‌డస్ట్‌లవల్ల ఏమీ కన్పించలేదు. తెలిసినవాళ్లు "గోఫ్‌కూల్తాంది, గోఫ్‌కూల్తాంది, లైన్లుపట్టుకోండ్రి. దూరంవురుకుండ్రి" అని హెచ్చరించిండ్రు. నెత్తిమీది టోపీలు పడిపోతున్నా భయంతో చెల్లాచెదురుగ వురికిండ్రు కార్మికులు. దాదాపు పావుగంట గడిచినమీదట అందర్ని పిలిచిండు సర్దార్. బితుకు బితుకుమంటువచ్చి, పోయిన టోపీలు వెతుక్కుంటున్నరు కార్మికులు. అందరూ ఒకర్నొకరు చూసుకుని ఆశ్చర్య పడ్డరు. బొగ్గుదుమ్ముపడి నల్లగఅయిండ్రు ఒక కార్మికుడు.

"ఏంగోపు అచ్చడురా తండ్రి! డిష్లరింగంటె ఏందో అనుకున్న". అతని కాళ్లు యింకా వణుకుతూనేవున్నయి. వురికినప్పుడు తగిలిన దెబ్బలను వెతుక్కొని అయోడీన్ వేయించుకుంటున్నరు సర్దార్ చేత కొందరు కార్మికులు. తనను కిరింద పడవేసి తొక్కుకుంట వచ్చినందుకు కోపంగ శంకరయ్య వోవర్ మ్యాన్, "అది కూలుడుతక్కువ మీగాబర ఎక్కువ" అన్నాడు. చాకలి మల్లయ్య అంటిన బొగ్గు దుమ్మును 'వుఫ్వుఫ్'మని వూదుకుంటూ "వానికేంది బాయిపనోడు, మారాజు అంటరు వచ్చిన సావెరుగక బతికిన బతుకెరుగక వుస్తైడు బండకింద అరువమోటు కట్టంచేసినా గని, వందలకు వందలు జీతాలత్తె తాగుతరని పేరుసేత్తరు, నీతల్లి యింత కట్టపడ్డా గుడిశెల్ల బతుకుతప్పదాయె" తపుక్కున వుమ్మివేసిండు.

"వురిగ పారాదుండ్రి" బుడుబుంగపిట్టతీరుగ మందలోంచి బయటకు వచ్చిన టింబర్ మ్యాన్ ఓదెలు.

"ఎక్కడికిరా?" అడిగిండు నర్సయ్య.

"లోపల్కి దాటువెట్టుకుంట యిడ్సిపెట్టిఅచ్చినం" నవ్వుకుంట అన్నడు ఓదెలు.

"బిడ్డా! గిసోంటి దైర్నాలుసేత్తె నాశినమైపోతవ్. అంతగొడితె నా నాగాలన్ని రోజులుగాలె నువ్వు అపాయింట్ మెంటై" సురసురచూస్తు అన్నడు నర్సయ్య.

"ఏం నర్సయ్య! లోపలికివెళ్లొద్దా? యిటునుంచియిటే మీదికిపోదామా?" అని వీర్రాజుగారు అన్నరు.

"పోదామా అంటె.... అవుతల వశంగాని గోఫ్అచ్చికూలె, లోపలికిపోయి సూసుకోవద్దాఏంది? ఏగిరపడ్తెఎట్ల?" అన్నడు నర్సయ్య మొఖద్దమ్ను, వోవర్ మ్యాన్ను, నర్సయ్యను వుద్దేశించి అండర్ మేనేజరు.

"పదండిచూద్దాం" అని దారితీసిండు. నర్సయ్య వస్తున్న ఎల్లరెడ్డిని ఆపి "సుపీన్నేవుండు, మేంబోయి సూసిఅత్తం" అని మళ్ళ ఏదోయాదొచ్చినవాడితీరుగ వెనుకకుతిరిగి "మేంబోయినా వోతంగని, ఏఁవిట్లకు ఏంఅయింది మా బతుకంత ముందున్నది" అని "రారేఁవురా్రి" అంటూ యిగ ఆ టింబర్ మ్యాన్స్ను పిలిచిండు జాగ్రత్తగ మూడు వర్కింగుప్లేసులు తిరిగిచూసిండ్రి. డయాగ్నల్‌గవున్న వర్కింగు ప్లేసుల్లో కిరింది లెవల్లోని వర్కింగుప్లేసు పూర్తిగ కనిపించకుండ కూలిపెయింది ఆధి కార్లవెంటే మెల్లగా వచ్చిన అమ్మోరుమచ్చల దురుగయ్య నోలేళ్ళబెట్టి "బిడ్డో! ... పేరులెల్లినతుమురో" అని బయటికే అన్నాడు.

"మళ్ళ నువ్వెందుకచ్చినవయా" కసురుకున్నడు సర్దార్. వెనక్కి పరుగెత్తుక వచ్చిండు ఆ విషయం మిగతాకోల్‌ఫిల్లర్సుకి చెప్పడంకోసం. ఆ విషయంవిని గుండెల మీద చేతులుంచుకున్నరు మిగతాకార్మికులు.

"ఓ.... ఒగప్పుడు కొత్తగూడెం ఏదోబాయిల గిట్లనే గోఫ్ఃఫాలి బండకింద ముగ్గురో నలుగురో సిక్కిపెయిండ్రిట" అని ఒక ముసలి కార్మికుడు చెప్తుంటె మధ్యలో ఒకడు.... "సచ్చిపోలేదా?" అని విస్మయంగ అడిగిండు. "లే....సచ్చిపోలేదు బండమీద బండాని లోపలఎక్కనోళ్ళ సొరికెల సిక్కిపెయిండ్రిట! ఓ.... అప్పుడు తెల్లదొరల కాలం. మాదండి దొరలుగూడ అచ్చి ఆ లోపలిమనుసుల్ని తీసుడెట్లనో తెలుపక కిందుమీదైండ్రట! యిగ ఆ బండసొరికల్లనుంచి అండ్ల సిక్కిపెయిన మనుసులు పిట్టపిల్లల తీరుగ అంగోలిచ్చిండ్రిట ఎంతఏడ్సినా, ఎంతమొత్తుకున్నా ఆ బండకింది మనుసుల్ని తీసుటానికి వీలుకాలేదట. ఆ ఏడ్పులు యినెటోళ్ళపానం అవిశిపెయిందట. కనిఏంజేత్తరు. వెయిపుట్లబండ. మాట్లాడ్తాంటె యినత్తాంది. కనిఎట్లతీత్తరు? పాపం మూడురోజులు వొర్లినోళ్ళు వొర్లినట్టెవొర్లి 'శపాల'తీరుగై మూడోనాడో నాలుగోనాడో సచ్చిపెయిండ్రిట. గోఫంటె గదిగోఫు మానాయినచెప్పెటోడు. నేనప్పుడు మంచిగనేవున్న" అంటు అదే ముసలికార్మికుడు తానుఎరిగిన ఒకానొక దుర్ఘటనను గురించి చెప్పిండు. అసలే గుండెదడపుట్టిన ఫిల్లర్సుకి వణుకుపుట్టింది.

"పెండ్లాం పోరగాండ్లకు కరువైతంరా పోతె" అని ఒకరు.

"పనద్దు మన్నద్దు పోదాంపారార్రి" అవి మరొకరు.

"బతికుంటె సేసుకోవచ్చు, ఈరోజుకే కంపిని వొడిసిపోతలేదు" అని మరొక రన్నరు.

"కసేపు సూసిపోదాం"అని ఒక కాపాయస్థుడంటె అందరు తిట్టిపోసిండ్రు. అంతలోనె టింబర్‌మ్యాన్ నర్సయ్యవచ్చి "యిగో" బదిలీఫిల్లర్వోల్లను యింటికి పొమ్మన్నడు దొర. కిందపనిచేసే పర్మనెంటోళ్లను మీదిపనికి రమ్మన్నడు" అని చెప్పిండు. పదిమందికార్మికుల్లో కలకలంపుట్టింది.

"ఎందుకుపోవాలె" అని అడిగిండ్రు. ఒకరిద్దరికి పోవాలనేవున్నది నిజానికి, ఆ బయానికి.

"ఎందుకంటె? కిందవర్కింగుప్లేసు పూర్తిగకూలిపెయింది. గందుకని

కూడ మేం నింపలేదు ఎట్లమరి ?" అని వేరొకబదిలీఫిల్లర్. "గిప్పుడు పూర్తిగ టైం అయినంక పోతెఎట్ల ?" అనిమరొకరంటె "పోతె మస్టర్ కట్టిత్తరా" అని వేరొకరు.

"మేము మస్టర్లిచ్చినంక పర్మనెంటు కోల్ ఫిల్లర్ కిందనేలెక్క !" అని చెప్పిండు ఒక కోల్ ఫిల్లరు. అక్కడికివచ్చిన వోవర్ మ్యాన్ ను "ఎక్కడున్నన్న పనిసూయించుండ్రి" అని పారిదేయపడ్డరు.

"ఫిఫ్టీసెవెన్ డిప్ కువెళ్ళండి" అంతదూరంపోలేరని పూరికేచెప్పిండు వోవర్ మ్యాన్

"ఆడికిపొయెటాళ్ళకే మూడుఅయితది" చెప్పిండొకడు. "అయితె యింటికి పోండ్రి" చెప్పేసిండు వోవర్ మ్యాన్.

గుల్కుంటూ గులుక్కుంటూ తట్టలు చెమ్మసులు బుజానవేసుకుని అధికార్లని తిట్టుకుంటూ బయలుదేరి వెళ్లిపోయిండ్రు. అప్పుడేవచ్చిన అండర్మేనేజర్ కోల్ ఫిల్లర్స్ వంక తిరిగి.

"బొగ్గునింపండి" అన్నడు. కొద్దిసేపు ఒకరిముఖాలొకరు చూసుకున్నరు.

"టైంఅయింది" అన్నరు.

"బొగ్గులేదు" అన్నరు.

"దగాయించెటాల్లకు అల్చవైద్ది" అన్నరు.

"లోపల సపోర్టులు లెవ్వు" అనికూడ కొందరన్నరు.

"మేం రాం", అంటె "రాం" అని అందరన్నరు. వోవర్ మ్యాన్ ముందు కచ్చి "టైం యింక గంటున్నది" అన్నడు.

గిప్పుడు వోతెఎట్ల" అన్నడు సర్దార్.

"పోతె ఆబ్సెంటుస్ క్రిందేలెక్క" అన్నడు అండర్మేనేజరు.

"గోఫ్ గంటగనం అచ్చింది, ఒక్క వర్కింగుప్లేసుల ఒక్కటాబులేదు" అని ఒక కార్మికుడంటె

"అవి ఎనుకలాడి తెచ్చిపెట్టేదెప్పుడు? మేం టబ్బులు నింపేదెప్పుడు ?" అని మరో కార్మికుడన్నడు.

"నేను దాట్లు పెట్టిస్తా, బొగ్గుసరిపోకపోతె దగాయించుమనిచెప్త" అన్నడు అండర్మేనేజరు కర్రివ్వాపుతూ. అయినా లాభంలేకపోయింది. తట్టలు చెమ్మసులు బుజాలకేసుకుని విడిచిన బట్టలు చుట్టలు చుట్టుకుని బయలుదేరిండ్రు.

"మొన్ననే మస్టర్లు అయితె కోప్పడ్డడండీ. కనీసం మనిషికి ఒకటబ్బా నింపినా పీడవదిలిపోను" అని పోతున్న కోల్‌ఫిల్లర్నును పిలిచి అండర్‌మేనేజరు "యిదిగో రూల్‌ప్రకారం చెప్తున్న యింకా గంట టైం వున్నది" అన్నాడు. చాకలి మల్లయ్య వెనక్కుతిరగకుండనే "రూల్లుగిల్లుఅన్నీ మీరువెట్టుకున్నయేనాయె" అన్నడు.

"నువ్వంతరూలు పకారమే బాయినడిపిత్తానవా?" అని మరొకడు.

"మీరు పూరికే మస్టర్లెట్ల తీసుకుంటరో నేనుచూస్తా" అన్నడు అండర్‌మేనేజరు

"సూత్తె, సూలాన్రిసు" అమ్మోరుమచ్చల దురుగయ్య అన్నడు.

"చూస్తున్నరేం? వెళ్ళండి వెళ్ళవచ్చినదానికి రెండు ఫేసుల్ల దాట్లు సపోర్టు పెట్టండి." అని టింబర్‌మ్యాన్స్ వంక తిరిగి పురమాయించాడు వీరాన్రిజు. "సపోర్ట్సు కరీగవున్నా, బొగ్గు, ఖాలీటబ్బులు వున్నాగాని టైంలేదని పోతున్నారు అదేరేపు 'ఎంక్వైయిరీలో' చెప్పాల్సొస్తుంది" అని హెచ్చరించి పైకివెళ్ళిండు. ఆయన వెళ్ళిన కాసేపటికి సర్దార్‌కు అప్పగింతలుపెట్టి ఓవర్‌మ్యాన్ పైకిపోయిండు సర్దార్ టింబర్‌మ్యాన్స్ రెంపరీ మస్టార్స్ వర్కింగుప్లేసుల్లోకి పోయిండ్రు.

ఆఫ్‌డిప్‌పైన లెవెల్లో, టాక్‌పై కూర్చుని సర్దార్ దేనిగురించో ఆలోచిస్తున్నడు ఆఫ్‌డిప్‌లో అంతకుముందు పడిపోయిన దాటునులేపి పెట్టడంకోసం లింగయ్య, ఎల్లరెడ్డి ప్రయత్నిస్తున్నరు. లింగయ్య కాళ్ళమీదకూర్చుని పికాల్సాతో దాటుప్రవ్వు తుంటె, ఎల్లరెడ్డి దాటును వారుగపట్టుకుని నిలబడ్డడు. పొద్దున్నే అడిగిపోవాలను కున్న ఎల్లరెడ్డి పోలేకపోయినందుకు బాధపడుతున్నడు "రాధ ఎదురుచూస్తుందో ఏమో" అనుకున్నడు. పైగానిద్రలేనివల్ల, బుజంపై ఏటవాలుగా దాటు, నిద్రకవ్వుకచ్చినట్టు అయింది. లెవెల్లోకూర్చున్న సర్దార్ 'బాజు' అని అరిచిండు దాటుకోసం గుంట తీస్తున్న లింగయ్య చెప్పిన లేచిండు. కాని ఎల్లరెడ్డి అదులుకు విడిచిపెట్టిన దాటు మీదపడి లింగయ్య కిందపడిపోయిండు. ఒక అడుగువురుకపోయిన ఎల్లరెడ్డి, పడి వున్న లింగయ్య ఒక్కసారే "అమ్మా" అని హృదయవిదారకంగ అరిచిండ్రు. కాని వారిఅరుపు, ఆఖరి ఆర్తనాదం బొగ్గుపొరల్లో కప్పివేయబడ్డవి. జీవించాల్సిన పచ్చపచ్చని నిండుజీవితాలు రెండు ఆ బండకింద సమాధిచేయబడ్డవి. పైవర్కింగు ప్లేసులో పనిచేస్తున్నవాళ్లు. దాట్లకోసం పోయినవాళ్లు గబగబ పరుగెత్తుకవచ్చిండ్రు.

* * * *

మధ్యాహ్నం మూడుగంటలు.. బాయిముందు కార్మికులు గుమిగూడివున్నరు. ఫస్టుషిఫ్టుచేసి ఎక్కినవాళ్లు. సెకండ్‌షిఫ్టుకి వచ్చినవాళ్లు. మసల్‌పడేవారు పడకుండ ల్యాంపుకోసం పొయేవారు పోకుండ గుమిగూడిండ్రు. నెతురుకారుతున్న డోలీలలో

క్షణంకిందిదాక తమతో కలిసీవున్న సోదర కార్మికులను శవాల రూపంలోచూస్తూ బయకంపితులై పోతున్నరు.

"అయ్యయ్యో ఎట్లజరిగింది ?"

"ఎక్కడజరిగింది ?"

"సైడుకూలిందా ?"

"టాపుకూలిం ?" పదులకంఠాలు అడుగుతున్నయి. మరెందరో జవాబుకోసం ఎదురుసూస్తున్నరు. తెలిసినవాళ్ళు మరణించిన కార్మికులగురించి సానుభూతిగ....

"పాపం తలిదండ్రికి ఒక్కడేకొడుకు"

"యింటికాడ యింత ఎగుసాయంగూడవుండె"

"రేపోమాపో పెండ్లం పురుడువోసుకోనున్నది"

"అయ్యయ్యో ఎంతపని జరిగింది ?"

"గీనల్లపోరనికి మొన్ననే పెండ్లి అయిందిరాతండ్రి"

"ఎహె ఆగుండ్రి, మీయవ్వ, ఏడ్పులు. ఎట్లజరిగిందిరాఅంటె ఒక్కడు చెప్ప రేందిర ?" సెకెండ్‌షిఫ్ట్‌కోసం వచ్చిన ఒకకార్మికుడు ఆవేశంగ అడిగిండు. అమ్మోరుమచ్చలమొఖం జేవురించంగ కోల్‌ఫిల్లర్ దురుగయ్య....

"డిప్లరింగుల, బండకూలింది"

"డిప్లరింగుల్నా ? గీ అనుభవంలేనోళ్ళను ఎందుకుతోలిండ్రి? ఒంపరరో ళ్ళను డిప్లరింగు పంపద్దని తెలువదిరా వోర్మెన్లకు ?" ఎవరోకోపంగ. చాకలి మల్లయ్యలేచి ఆఫీసుగగిదిక్కు చూస్తూ, చూయిస్తూ "అగో, అండ్లకూకున్నడు పిల్లిగడ్డపు లం....కొడుకు వాన్నిఅడుగుండ్రి. ఈ యిద్దరు పోరగాండ్లను సావ గొట్టింది ఆ ఎరిజకండ్ల గాడ్దికొడుకే ? ఓ బద్మాష్ గాడ్దికొడుకా ! అవుతలమేయిన్ గోఫ్ కూలింది, ఫేసుల్ల సపోర్టులులేక బ్యాడ్‌రూఫ్‌లు అయితయి టైం అయింది పోతంఅంటె ఆ దొంగలప్డికొడుకు, "మీకు మష్టర్లెవరిత్తరో సూత్తనని ఈ పోర గాండ్ల తోలుకపొయ్యి బ్యాడ్‌రూఫ్‌కింద పన్జెయ్యవెట్టిండరాల్రి ! లేకపోతె బంగార ససోంటి పోరగాండ్లురా ! వాళ్ళకు సావెక్కడిదిరా :" అంటూ రెండుచేతులతో రొంబొచ్చె చరుచుకుంటూ అరిచిండు.

"బిడ్డా ! ఎంతపనిజరిగిందిరా ? తెలిసి తెలిసి షలినోల్లైకు తోలిండ్రురా",

"బొగ్గుపొరల్లో...."

"పంఖాలకింద పండుకుంట కార్లల్ల తిరుగుడాయె"

"నీయక్క ఈ లం....కొడుకులు ఎంతసేపు బొగ్గోబొగ్గని సత్తరుగని, ఈ బద్మాష్ కుక్కలకొడుకులు సేఫ్టీగురించి పట్టించుకోక పెయిరిరా"

"పందుల్లెక్క బలిసిండ్రు గాడ్దులు"

"ఒక్కొక్కనికి పెయిలకు పెయిలు జీతాలు"

"కల్లెలువట్టుకోని అట్లచ్చిట్లవోతరు" తలాఒకరకంగ తిడుతున్నరు. టింబరింగు సర్వదయ్యలేచిండు. ముసలిమొఖంల నెత్తురు పొంగుకచ్చింది. వలవల ఏడుస్తూ నెత్తీనోరూ బాదుకుంటూ

"నా తండ్రులారా! బంగారంవసోంటి పోరగాండ్లురా, యియ్యాల పొద్దుగాల నాతోనిరాంగ అల్చన్నిముచ్చట్లు చెప్పిండ్రిరా నాయినా! ఈ లపంగుల్జెయ్య వట్టి బతుకలేమురాతండ్రి! బతుకలేము- రేపో మాపో ఒగనికి బిడ్డపుడుతర్రా, యింకొగనికి మొన్ననే లగ్గంఅయిందిరా! వాళ్ళపెండ్లాలకు ఎవళు జవాబుచెప్తర్రా? ఏవళుసంపిండ్రని చెప్తర్ర? మీరెంజెప్తర్ర?" నొసలు, రొమ్ము గుద్దుకుంట ఏడుస్తున్నడు.

"బాంచోత్ ఒక్కొక్కన్ని నడిగోష్ల 'యిషార'దాటుకు కట్టిరావాలె"

"గరంఫేసుల్లతోలి ఫెన్సింగేసిరావాలె"

"నడువర్ర, నడువర్ర పిల్లికండ్లోన్ని అందుకోర్రి"అని ఒకడు మొఖమంత జేవురించంగ ఆఫీస్‌కేసి పరుగెత్తుతున్నడు. అతన్నిఆపి కొందరు గుంజుకచ్చిండ్రు.

"ఆయన్నెందుకాపిండ్రు?" పొడవైనముక్కు, చిన్నకళ్లగల షాట్‌ఫైరర్, ఆయనమాట ఎవరూ పట్టించుకోలేదు. ఫస్టుషిఫ్ట్ చేసిన కార్మికులు, సెకెండ్‌షిఫ్ట్‌కోసం వచ్చిన కార్మికులు కొన్నివందలమంది ఎవరేమిమాట్లాడుతున్నరో తెలియకుండ గొణుగుతున్నరు, తిడుతున్నరు, పెద్దగ అరుస్తున్నరు. మరీ చలించిపోయినవాళ్ల "వానవ్వల కుక్కల్దెం.... సచ్చిన సావెరుగకపెయిరి బలికిన బతుకెరుగకపెయిరి సేఫ్టీ, సేఫ్టని మైకులబెట్టి మందికిజూడ మొత్తుకునిరి. 'సేఫ్టీవీక్'లని పెట్టి మూడురోజులుమురిపిచ్చిరి. తరువాత సేఫ్టిసూడకపెయిరి" కండ్లు తుడుచుకుంటఅంటున్నడొకడు.

"సూసుకుంటుంటె గిట్లనే సత్తం, ఒరే ఏంజూత్తాండ్రిరా? అందరు సత్తరు సేఫ్టీలొట్టపీసు గరీబోళ్ళకుకాదు, దొరలకు" ముసలివాడొకడు.

"ఒరేయ్, నేను ముప్పయ్యేండ్లకిందినుంచి సూసుకుంట అత్తాన. గిసోంటియి జరుగకుంట ఏలంజకొడుకు సూసుడులేదు" బాగా అనుభవంవున్న బక్క ముసలి కార్మికుడు చెపుతున్నడు.

మరికొంతమంది కోపంపట్టలేక, బిక్కమొఖాలతో తిరిగేఅధికార్లను గద్దించి అడుగుతున్నరు. వాళ్ళరక్తం పొంగుతోంది. మనిషికోసం సాటిమనిషి పేగుపొర్లు తోంది. సంవత్సరాలుగా చీకటి గుయ్యారాల్లో బొగ్గు తవ్వీతవ్వీ బొక్కలుతేలిన శరీరాల వాళ్లు, ఎండిపోయిన ముఖాలవాళ్లు, లొట్టకండ్లవాళ్లు, చప్పిడిదవడలవాళ్లు భగభగ మండుతున్నరు.

అటువంటి సమయంల, యిండాకటి షాట్ ఫైరర్ జండాగద్దెనెక్కిండు. కాసేపు మాటలురాక చేతులలో గుంపుకేదో చెప్పాలన్నట్టు వూపిండు.

"కామ్రేడ్స్...." అతని కంఠం

అరె! ఏందో చెప్తాండు ఆగుండ్రి"

"ఏంజెప్తడు? రక్తానికి రక్తం అని చెప్తడా? యిగో వీళ్ళందరికి చెప్పవయ్యా. అందర్మేనేజరుగాడు గోఫ్ చూసికూడ ఎందుకు పనిచెయ్యమన్నడో? వాన్నిగుంజుక పొయ్యి గోపుల పారేయిండ్రి దమ్ములుంటె అని చెప్పవయ్యా. మేనేజరుగాడు పంఖ కిందకూకున్నట్లుగాదు. యిగో ఈడికిగుంజి ఈ నిండుపానాలకు ఏంజెప్పుతవో చెప్పు. కుక్కలకొడుకా అని అడగమని చెప్పవయ్యా కామ్రేడా? ఈళ్ళంధరితోని చెప్పు. మందిలోంచి ఒకడు ఆవేశంగ అరిచిండు.

"కామ్రేడ్స్!

ప్రమాదాలు మన బతుకుల్ల శానేండ్లనుంచి జరుగుతున్నయి. మీకందరికి ఎరికే. ప్రమాదాలు జరిగినప్పుడల్లా మనంగిట్లనేకసేపు పెనుగులాడ్తానం, ఏడ్తున్నం కనిపించిలవాన్నళ్ళ అడుగుతున్నం. కానిప్రమాదాలు ఆగినయా? రోజు ఎక్కడో ఓకాడ ఏదోవిధంగ మన కార్మికులు చచ్చిపోతూనేవున్నరు. మేనేజుమెంటు ఏదో విధంగ మలిపి అటుదిప్పి యిటుదిప్పి యిది కార్మికుల అజాగర్తవల్లే జరిగిందని రిపోర్టురాస్తుంది. మళ్ళ ఎప్పటిచిప్ప ఎనుగుల్నే. వాళ్ళు మనుషులుకాదు. వాళ్ళకు బొగ్గుదప్ప మన భద్రిత ముఖ్యంగాదు.

గతంలో సేఫ్టీఏర్పాట్లు చూడాల్నని మనం సమ్మెలుచేశాం. నాలుగు రోజులు ఏర్పాట్లుచూసుడు. మళ్ళపాతపాటే. గిదేందని మేనేజర్ను అడుగుతే 'యండి'నడుగు

వుంటడు, కర్రలు తెప్పియ్యరు. సపోర్టులు పెట్టియ్యరు. కెంపరోళ్ళను దిప్లరింగు చంపకమానరు." యిట్లచెప్పుకపోతున్నడు.

"ఏందయా నువ్వు జెప్పేది జెప్పనచెప్పు" కొందరు.

"ఏమున్నది సమ్మె చెయ్యాలంటడు" ఒకడు.

"కాదు మన బతుకులన్ని ప్రమాదంలోనెవున్నయి. ఈ దోపిడి ప్రభుత్వం వున్నంతవరకు మనకు రక్షణవుండబోదని అంటడు" ఎర్రిగావున్న కార్మికుడు.

"అది నిజమేకద!" చాలామంది అనుకున్నరు.

"మరందుచేత యింక యిటువంటి ప్రమాదాలు జరుగకుంట వుండాలంటె ఖచ్చితంగ వాళ్ల బావుల్లో సేఫ్టీఏర్పాట్లు చూసేదాక మనం బావుల్లోకి దిగద్దు. మనమేకాదు అన్నిబాయిలవాళ్ళు ఈ సమస్యమీద పోరాటం చెయ్యాలె. మనతోటి కార్మికులకు జరిగిన అన్యాయం అందరికీ తెలియజెప్పాలె. వాళ్ళదురాశ సాగదని మనం ఎలుగెత్తి చాటాలె. చలో నడువుండ్రి శవాలనెత్తుకోని సాగుండ్రి. వాడవాడల సందులు మొత్తం కాలరీఅంత తిరుగుతూ ఈ అన్యాయాన్ని తెలియజెప్పాలె. ఈ దోపిడీదొంగల నిజ రూపాన్ని ఎండగట్టాలె. అందుకని కామ్రేడ్స్! బయలుదేరండి" షాట్ ఫైరర్ వుపన్యాసం యింకా కొనసాగుతూనేవున్నది. కోపోద్రిక్తులైన కార్మికులు, ఆవేశంగ నెత్తురు ముద్దలైన లింగయ్య, ఎల్లరెడ్డిల శవాలున్న డోలీలను భుజాలకెత్తుకుని బయలు దేరిండ్రు. తట్టలతో చెమ్మాస్‌లతో వందలమంది కార్మికులు వెంటనడచిండ్రు. అంతకుముందే వివిధ బావులమీదికి ఈవార్త చేరవేసిన కొందరు యువకార్మికులు ఆయాబావుల కార్మికులను వూరేగింపులోకి తీసుకొచ్చిండ్రు. రోడ్డుపైనుంచి వస్తున్న వందల కార్మికులు 'కాలరీ'లోకి వస్తున్నకొద్దీ వివిధ బావుల కార్మికులు కలుస్తున్నకొద్ది కొన్నివేలమంది అయారు. రోడ్డుమీద బొగ్గులారీలు ఆగిపోయినయి. కార్మికవాడల్లోకి వూరేగింపువచ్చింది. దూరంగ దొరల బంగళాలువున్నయి. ఆవేశంగ "దొరల దౌర్జన్యం నశించాలె"

"దోపిడి స్వభావం నశించాలె" అంటు వుత్తేజకరమైన నినాదాలిస్తుంటె గుడిసెల్లోని ఆడవాళ్లు, వృద్ధులు, పిల్లలు అందరూ వూరేగింపులో కలిసిండ్రు అంతకంతకు వూరేగింపు పెద్దదై 'కాలరీ' వీధులన్ని తిరుగుతూ "మేనేజింగ్ డైరెక్టర్" కార్యాలయం వేపుసాగింది. ఆ రోజునుంచి బావుల్లోంచి బొగ్గుముక్క పైకి రావటం ఆగిపోయింది. బొగ్గుపొరల్లోని జనం కాలేబొగ్గుముక్కలై అంటుకుంటున్నరు. సమ్మె మొదలైంది.

# 'ఛివ్రలియా' చెట్టుకింద జీవాలు

తెలుగులో గద్దర్, వంగపండు ప్రసాదరావులవలె ఉత్తరప్రదేశ్‌లోని భోజ్‌పురీ భాషలో గోరఖ్‌పాండే అనే ప్రజాకవి ఉన్నాడు. జె.ఎన్.యు. (ఢిల్లీ)లో ఇటీవల జానపద సంగీత పాఠశాల జరిగినపుడు ఆయన ఒక కథ చెప్పాడు. అది-

అయోధ్యా నగరానికి సమీపాన ఒక అడవిఉంది. ఆ అడవిలో బాగాదట్టమైన ఆకులుగల 'ఛివులియా' చెట్టుకింద రెండులేళ్ళు నించుని ఉన్నాయి. వాటిలో ఆడలేడి విచారంగా ఉండటం చూసిన మగలేడి, సంగతేమిటని అడిగింది. పచ్చనిమేత దొరకటం లేదా, చల్లని నీళ్ళు కన్పించటంలేదా లేక మరేమన్నా కారణమా అని పరిపరివిధాల ప్రశ్నించింది. కాని, అదేమీకాదు, నాకన్నీబాగానే దొరుకుతున్నాయి, నేను విచారిస్తున్నది నీకొరకే సుమా అంది ఆడలేడి. ఆ మాట అని, దశరథ మహారాజుకు శ్రీరాముడు పుట్టాడు. ఇవాళ అతని బారసాల. విందుకోసం నిన్ను చంపబోతున్నారు అంటూ కన్నీరు కార్చింది.

మగలేడిని చంపారు. దాని మాంసంతో వంట ప్రారంభమయింది. ఆడలేడి మెలగా అడవిదాటి, రాణివాసంలో ప్రవేశించి, కౌసల్యాదేవిని చూడబోయింది. అక్కడ ఆమెతో దీనాలాపాలాడింది. తన జంటను వేరుచేసారు. ప్రాణంతీసారు. విందుచేసుకుంటున్నారు. కనీసం ఆ చర్మమైనా ఇప్పిస్తే 'ఛివులియా' చెట్టుకొమ్మకు తగిలించి చూసుకుంటూ, తన జతగాడు తనతో ఉన్నట్లే తలపోసుకుంటూ ఊరట చెందుతానంది. కాని మహారాణి కౌసల్యాదేవి అందుకు ఒప్పుకోలేదు. ఆ చర్మంతో మంచి సంగీతవాద్యం తయారుచేయించుతానని, శ్రీరాముడు దానిని మోగించి పాడుతాడని ససేమిరా వీల్లేదంది.

శ్రీరాముడు ఆ వాద్యాన్నిమోగించినపుడు దానిశబ్దం అడవిలోకి వినిపిస్తుంటుంది 'ఛివులియా' చెట్టుకింద నిలిచిన ఆడలేడి మౌనంగా కన్నీరు కారుస్తుంటుంది.

నిజానికి ఇది కథ కాదు. భోజ్‌పురి, అవధీ భాషలలోని ఒక జానపద గీతానికి తాత్పర్యం. పిల్లల బాలసార రోజున ఈ రెండు భాషల స్త్రీలు ఇప్పటికీ ఈపాట పాడుతుంటారు. ధనిక-పేద, కుల తారతమ్యాలు లేక అందరిలోనూ ఇది వాడుకలో ఉంది.

లేళ్ళను సంకేతాలుగా తీసుకుని, రాజరికవ్యవస్థలో సామాన్యప్రజలు బలయ్యే తీరును చిత్రించిన ఈ గీతం భావాన్ని ప్రత్యేకంగా వివరించనక్కరలేదు. మన దేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా జానపదగీతాలు, కథలు ఇటువంటి సామాజిక

# రైతాంగ పోరాటాల వాస్తవ చిత్రణ 'ఊరు' నవల

భూమి, భుక్తి, విముక్తి కోసం రైతాంగం సాయుధపోరాట పతాకాన్ని ఎగరేసిన వాస్తవ చిత్రణ అల్లం రాజయ్య ఊరు నవల. నక్సల్బరీ నిప్పు గుండెల్లో రగులుకొంటున్న ఆదిలాబాద్, కరీంనగర్ ఊర్లన్నిటికీ ఇది ప్రతీక. ఈ నవలలో ఒక రైతు అన్నట్లు "మట్టిబుక్కి పుట్టిపెర్గి మా ఊపిరి" మట్టిలోని ఫలసాయం దక్కాలంటే దున్నే వానిదే భూమి కావాలన్నదే కాదు: దాన్ని దక్కించుకోవడానికి రాజ్యాధికారం రావాలని చెప్పిన నక్సల్బరీ చారిత్రక వాస్తవాన్ని తన అనుభవమూ, చైతన్యం నుంచి గ్రహించిన ఊరు, ఊరంటే భూమి: ఊరంటే చేసే ప్రజలు.

నక్సల్బరీ పోరాటపరిపక్వత, శ్రీకాకుళ పునాదిని ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల ఊర్లలోని రైతాంగం సంతరించుకుంది. ఊర్లలోని రైతుకూలీలు గడీల దౌష్ట్య

---

స్థితిగతులను సంకేతాల ద్వారా పరోక్షంగా చిత్రించాయి. కాని ప్రస్తుత జానపద గీతం రామాయణంపైనే దాడిచేయడం, రామభక్తి నందేంజరుగా పారుతున్న ఉత్తర దేశంలో ప్రచారంలో ఉండటం అన్నదే విశేషం. దీనిలో ధ్వనిస్తున్న నిజమైన భావం, దాన్ని పాడేవాళ్ళకు తెలుసా అన్నది సందేహం. తెలియదని ఊహించవచ్చు తెలియజెప్పితే ఏమంటారు? ఈ ప్రశ్న అడిగితే పాండే నవ్వుతూ, ఈసారి ఆ ప్రాంతాలకు పోయినపుడు చెప్పిచూడాలి అన్నారు.

బహుశా ఇట్లా అయి ఉంటుంది. తప్పకుండా వర్గచైతన్యంగల వ్యక్తో లేక వ్యక్తులో దీన్ని, రామాయణ కాలమంటూ ఉంటే అప్పుడో, ఆ తర్వాతో రాసి ఉంటారు. తర్వాత మెల్లగా కాలం గడవటం, రామాయణకథ మతవిశ్వాసాలతో బలంగా ముడిబడి పోవటం, వివిధ ఉపరితలాంశాల ప్రభావం వల్ల ఆ పాట అర్థాన్ని గ్రహించే చైతన్యాన్ని ప్రజలు కోల్పోయారు. అదేవిధంగా కాలక్రమాన పాటకూడా తన మొదటి భాషను, రూపాన్ని కొంత పోగొట్టుకునే ఉంటుంది. ఈ రెండు పరిణామాల ఫలితంగా పాటకుగల వర్గపదును పోయి, లేదా మరుగునపడి అన్ని వర్గాలకు ఆమోద యోగ్యం అయింది. పోరాటాల ద్వారా వర్గచైతన్యం కలిగినపుడు, తామింతకాలం పాడుతున్న ఇటువంటి గీతాల అసలు భావాన్ని శ్రామికజనం స్వయంగానో, ఇతరులు వివరించినపుడో గ్రహించే అవకాశం ఉంది. ఆ అవగాహన వారి చైతన్యాన్ని మరింత పెంచుతుంది.

— పంకజాల అశోక్

కిని వెట్టిచాకిరీలకు పీడనకు ఎదురుతిరిగారు. భూమిమీద అధికారాన్ని ఊరుమీద తిరుగులేని పెత్తనాన్ని చలాయించే భూస్వాములు (దొరలు) పెత్తనాల పునాదులు కదలబారాయి. పోరంబోకులు బంచరాయిభూముల్లో ఎర్రజెండాలుపెట్టి ప్రజలు దున్నుకున్నారు. తమదగ్గరనుండి దొరలు పలువిధాల గుంజినదండగలు తిరిగి వాపసుకక్కించారు. ఉరిమిచూసినదొరలను ఊర్లనుంచి బహిష్కరించటంతో దొరలు పట్టణాలకు పరుగుతీశారు. పీడితప్రజాశక్తిముందు దొరలు లొంగితప్పదన్న వాస్తవం బహిర్గతమయింది. అప్పుడిక పోలీసుక్యాంపులను, కల్లోలితప్రాంతచట్టాలను ఇందిరా ప్రభుత్వం అడ్డేస్తేతప్ప భూస్వాములు బతుకలేనిస్థితి ఏర్పడింది. ఇందిరా ప్రభుత్వ పోలీసుల అండతో దొరలు పట్టణాలనుండి పల్లెలకు తిరిగివచ్చారు. దొరలు పోలీసులు మిలాఖతై రైతాంగంపై క్రూరనిర్బంధాలకు, అణచివేతకు పూనుకున్నారు. వీటన్నిటినీ అధిగమిస్తూనే రైతాంగం "రైతుకూలిసంఘం" పతాకకింద సంఘటితులై అప్రతిహతంగా పురోగమిస్తున్నది. ఈ పూర్వరంగంలో ఊరునవలను పరిశీలించవలసి వుంటుంది.

ఊరువిడిచి పట్నంచేరుకున్న దొర నారాయణరావు సంవత్సరం తరువాత పోలీసుక్యాంపు అండతో తిరిగి ఊరుచేరుకున్నాడు. భూములు బీడుపడిపోయాయి. గడీ పాడుబడింది. ఇకనుంచి తనముందు దర్జాసాగదని కొత్తఎత్తులతో జనాన్ని వంచించడానికి పూనుకోవాలనుకుంటాడు. తన ఏజంట్లను అడ్డమేసుకొని ఊరిజనంతో రాజీకిదిగుతాడు. దొరతో రాజీవిషయమై రైతుకూలిసంఘం సభ్యులు సమావేశమై వాళ్ళలోవాళ్ళు చర్చలుజరుపుతారు. రైతులు అన్నివైపులా చైతన్యవంతమైన ఆలోచనచేసి షరతులు రూపొందిస్తారు. పోలీసుక్యాంపు ఎత్తివేయించి, కేసులన్ని రద్దుపెట్టాలనీ, దండుగలబాపతుపైకం పదివేలు ప్రజలకు వాపసుఇవ్వాలని, ఈ షరతులకు ఒప్పుకుంటే రాజీకి అంగీకరించేలా నిర్ణయంతీసుకుంటారు. ఒకరోజు పంచాయతి జరుగుతుంది. సంఘంపెట్టిన షరతుల్ని దొర ఒప్పుకున్నట్లు పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టరు, దొరఏజెంట్లు, సర్పంచ్ పటేలు, రెండునాల్కల ధనికరైతు ఓదేలు నక్కజిత్తుల తతంగాలతో తెలియజేస్తారు. రాజీకుదురుతుంది. దొర ఇవ్వతేలిన దండగలపైకం పదివేలలో ఒకనెలతరువాత ఐదువేలు, మిగతాపైకం పంటలోఇస్తానని ఎత్తువేస్తాడు. ఈ నెలరోజులలో తన దుష్టపన్నాగాన్ని అమలుజరిపి జనంఐక్యతనే దెబ్బతీయాలని దొరఎత్తు. దీనితో దొరపొలాల్లో నాగండ్లునడిచాయి. గడీలో సందడిపెరిగింది. ప్రజలు మేకవన్నెపులిలాంటి దొర నయవంచనను పసికట్టలేక

పోతారు. ఓదెలుమధ్యవర్తిత్వంతో చంద్రయ్యకు భూమాశజూపి సంఘం రహస్యాలు దొర ఆరాతీయడానికి ఉపయోగించుకుంటాడు. నెలతరువాత కట్టవలసిన దండగలు 5 వేలు అంతాఒకేదఫా పంటకాలంలో కడతానని దాటవేయడానికి వేసినఎత్తు పారుతుంది. జనంలో కొంతమంది షరతుప్రకారం ఐదువేలు ఇవ్వడు చెల్లించకపోతే పసులుబందెపెడతామంటే మరి కొందరు అలాపసులు బందెపెట్టటానికి వీల్లేదంటారు వారిలోవారే తగువుపడతారు. ఇది చూసి దొర తన పన్నాగంపారిందని. జనంఐక్యత చెడిందని లోలోపల సంబరపడతాడు. దీన్ని అవకాశంగాతీసుకొని దొర నారాయణరావు మరింత బరితెగించి సంఘం ముఖ్యులను పరోక్షంగా దెబ్బతీయడానికి పన్నాగాలు సాగిస్తాడు. ఊరిలో కూలిజనం ఎప్పటిలా దొర పొలాల్లో రెక్కలు ముక్కలు చేసుకొని సంపదలు సృష్టిస్తున్నారు. కూలిరేట్లు పెరిగినా కొలతలు తగ్గిపోయాయి. మళ్ళీజనానికి దొర అప్పుల ఉరితాళ్ళు బిగుసుకుంటున్నాయి. పేదరైతుల భూములు దొర అప్పులకు ముడిపెట్టబడివున్నాయి. అన్ని విలువైనవస్తువులు మరోరూపంలో దొంగడి చేరుతున్నాయి సంఘం నాయకత్వంలో జనంసాధించుకున్న విజయాలు వారికళ్ళేముందే వమ్మవుతున్నాయి. రాజీషరతులన్నిటిని దొర పాటించలేదు, దొరగాడి పన్నాగంలో మళ్ళీ యిరుక్కున్నామని జనం గ్రహిస్తున్నారు. దొరకు వ్యతిరేకంగా సాగిన గత పోరాటస్మృతులు జనం మదిలో మెదిలాయి. నినాదాలను మననం చేసుకుంటూంటే పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి.

ఇలాంటి పరిస్థితిలో జైలునుంచి విడుదలైవచ్చిన పార్టీకార్యకర్త ఊళ్లోకి వస్తాడు. దొరచేసే వంచనను, ఎత్తుకుపైఎత్తుగా తీయనిమాటలతో జనంఐక్యతను ఎలాదెబ్బతీశాడో వివరిస్తాడు జనం సంఘటితమై దొర సాగిస్తున్న దుష్టపన్నాగాలను ఎదుర్కోవలసిన అగత్యాన్ని గుర్తుచేస్తాడు, పల్లెజనంలో ఆలోచనలూ, ప్రశ్నలూ రేకెత్తినా ఇదే అదనులో గంగులు అనేరైతు కష్టార్జితమైన పంటను వడ్డీకివడ్డీపెంచి దొర ఎలాదోచుకున్నాడో జనంముందు ఏకరువుపెడుతూ, రేపు కల్లంలో తన పంటలు అప్పుకింద కొలుస్తాడనీ, ఈ అన్యాయంనుండి రక్షించమని జనాన్ని కోరుకుంటాడు. జనమంతాకలిసి కల్లంలో ధాన్యం రేపు గంగులు ఇంటికి చేర్చాలని నిర్ణయం తీసుకుంటారు. ఇది తెలిసిన దొర గంగులు ధాన్యం తనకు దొరకదన్న కక్షతో తన గూండాలతో కల్లంలోని ధాన్యానికి. గడ్డికి అగ్గిపెట్టిస్తాడు. ఈ అఘాయిత్యం దొర చేయించినదని తెలియడంతో ఊరిప్రజల్లో ప్రతీకారక్రోధాగ్ని జ్వలిస్తుంది. ఈ సంఘటన ఊరిప్రజలలోని గాఢంగా దొర నయవంచనపట్ల గుండెల్లో ఇగులుకుంటున్న ప్రతీకారక్రోధావేశాలను రగుల్కొల్పుతుంది. ఊరు

జారే ఉప్పెనలా జనం దొరగడీపై పడతారు. జనం చేతికి దొరికిందల్లా గడీలో ప్రతివస్తువు ధ్వంసమవుతుంది. దొర నారాయణరావు తనవద్దనున్న పిస్టలుతో జనంపై దుర్మార్గంగా కాల్పులు జరుపుతాడు. నర్సింహులు హనుమయ్యలు నేల కొరుగుతారు. నిరాయుధులైన ప్రజలు ఆయుధంముందు చెల్లాచెదరవుతారు.

ఈ ఘటనతో రైతాంగం తాము సాయుధం కావలసిన అవసరాన్ని గుర్తిస్తారు. దొరలదోపిడీ విధానాన్ని కాపాడుతున్న ప్రభుత్వాన్ని సాయుధంగా కూల్చందే తమకు విముక్తిలేదన్న చైతన్యం రైతాంగం సంతరించుకుంటుంది. ఈ పోరాటానికి నాయకత్వం వహించి నడుపుతున్న విప్లవపార్టీలో తామూ చేరి అమరుల ఆశయసాధనకోసం తమవంతు విప్లవకర్తవ్యాన్ని నిర్వహిస్తామని రక్తతిలకాలు దిద్దుకొని ప్రతినబూని రైతాంగకార్యకర్తలు. యువకులు అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోతారు ఇపటేలిసిన దొర దొరగడీచుట్టు పోలీసులు కావలావున్నా ప్రాణాలరిచేతబట్టుకొని బిక్కుబిక్కుమంటూ రోజులు గడపవలసివస్తుంది. పటేల్లు, పట్వారీలకు గుండెల్లో గుబులుపట్టుకుంటుంది. ఇకరాజీలేని పోరాటం ఆ ఊరిప్రజలది. రాజ్యాధికారమే ఆ ఊరిలక్ష్యం. అదే ఆ ఊరిదారి.

ప్రజల్లోఐక్యత, చైతన్యం, సంఘటనాశక్తి యొక్క క్రమానుగత అభివృద్ధిని జీవితవాస్తవాలతో పెనవేసుకొని ఎదిగినతీరును నవలలో రచయిత స్పష్టంగా చిత్రించారు. స్త్రీలు పురుషులతోసమానంగా పోరాటచైతన్యాన్ని సంతరించుకుంటారు. అమరులైనవారి కుటుంబాలకు తోడ్పడటానికి స్త్రీలు చైతన్యయుతంగా కదులుతారు.

“అదే నేను తుపాకీపట్టుకోనా.... కబురుతెత్తనే నీతోమాట్లాడేది” అంటుంది నరమ్మ తనభర్త చంటయ్యతో. ఆ ఊరిస్త్రీ చైతన్యానికిది ప్రతీక.

ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలోని రైతాంగజీవితాల్లోనుండి, వాస్తవ పరిస్థితులనుండి, ఘటనలనుండి, పోరాటాలనుండి, సంఘర్షణలనుండి తీసుకున్న వస్తువుకు సాహిత్యప్రతిబింబమే యీ ఊరునవల. ముందుమాటలో కా॥ వరవరరావు గారు చెప్పినట్లు "కరీంనగర్ రైతాంగం, ఆ రైతాంగపోరాట ఆచరణను ఉద్యమాల్లో ఎట్లానిర్వహిస్తున్నదో రాజయ్య నవల 'ఊరు' ఇంటిసంగతి గోడలుచెప్పినట్లుగా చెప్తుంది, వ్యావహారిక భాషా వాసనలులేని మాండలికభాషలో మరిన్నిరచనలుచేసి అల్లంరాజయ్య విప్లవ సాహిత్యాభిమానులకు అందించగలరని ఆశిద్దాం.

ప్రతులకు : సృజన, హనుమకొండ వరంగల్ - 506 001 రూ॥ లు

— వరి

పరిచయం :

# ఇంటర్నేషనల్స్

కె. వి. రమణారెడ్డి

బూర్జువావర్గంలాగే శ్రామికవర్గంకూడా అంతర్జాతీయతా స్వభావాన్ని సంతరించుకోవడం సహజమే. జాతి-రాజ్యాలలో విప్లవాలద్వారా అధికారం సంపాదించుకున్నాక క్రమంగా బూర్జువా ఆర్థిక-రాజకీయ- సైనిక కార్యకలాపాలు జాతి -రాజ్యాల సరిహద్దులు మీరాయి. స్వదేశంలో తాను అధికారానికి రావడంలో తోడ్పడి విప్లవ విజయానికి ఎంతో దోహదంచేసిన తదితరవర్గాలకు విప్లవఫలాలు దక్కకుండా వాటిని అణగదొక్కి స్వార్థంప్రదర్శించిన బూర్జువావర్గం, జాతీయవాదంమాటున మార్కెట్ల విస్తరణకోసం జాతిరాజ్యాలమధ్య యుద్ధాల చిచ్చురగిలించింది. ఇతరరాజ్యాలలో బూర్జువావిప్లవాలు గెలుపొందేందుకు సహాయ సహకారాలందించింది. శ్రామికవర్గం కూడా పరదేశాల వర్గబంధువులతో సంబంధాలు పెంపొందించుకుంటేనేతప్ప తన పోరాటం ఫలప్రదంకాజాలదని గ్రహించి శ్రామికవర్గ అంతర్జాతీయతా దృక్పథాన్ని అవలంబించింది.

అయితే ఇది సంస్థారూపం ధరించేందుకు ముందుగా వర్గచైతన్యం పదునెక్కడంతోబాటు, ప్రాంతీయసంకుచిత్వం వైదొలగి దేశవ్యాప్తమో లేక పరిశ్రమావ్యాప్తమో అయిన విశాలదృక్పథం రూపొందవలసి వుండింది. ఊహాజనిత(ఉటోపియన్) పరిష్కారమార్గాలు అసాధ్యమని రుజువుకావలసి ఉండింది. వివిధ దేశాల శ్రామికవర్గ సంఘాలమధ్య అన్యోన్యత పెరగవలసిఉండింది. అన్నిటినీమించి సవ్యమైన శ్రామిక వర్గ సిద్ధాంత శాస్త్రమొకటికావలసి ఉండింది. ఇవన్నీ పూర్తిచెందాకనే శ్రామికవర్గ అంతర్జాతీయ సంఘటనప్రారంభమైందని భావించడం అనారిత్రికం. ఇవి రూపుదిద్దుకునే క్రమంలోనే, ఎన్నోప్రయత్నాల పర్యవసానంగా, అది ఫలించింది. జాతీయ విమోచనకోసంచట్టబద్ధ రాజ్యాంగంకోసం, భూస్వామ్య అవశేషాల నిర్మూలనకోసం 1848లో యూరపియన్ దేశాలలో భూకంపంలాసాగిన మహాసంకులమైన పోరాటం విఫలమయ్యాక ఐదేళ్ళకు పెట్టుబడిదారీ వ్యవస్థ తాలూకు మొట్టమొదటి అంతర్జాతీయ సంక్షోభం ఫలితంగా శ్రామికవర్గంముమ్మరంగా సమ్మెపోరాటాలకు దిగింది. అలాగే ఇటలీ, జర్మనీవంటి దేశాల రాజకీయ ఏకీకరణకోసంసాగిన ఉద్యమాలలో చురుగ్గాపాల్గొంది. రాచరిక నిరంకుశత్వం, భూస్వామ్యపెత్తనం, నిర్దాక్షిణ్యమైన అధికారం సాగిస్తూవచ్చిన జర్మనీదేశంలోనే ట్రేడ్‌యూనియన్లు తలెత్తాయంటే, పారిశ్రామిక

విప్లవం పురిటిగడ్డఅయిన ఇంగ్లాండులోనూ రాజకీయ విప్లవాలెన్నోజరిగిన ఫ్రాన్సులోనూ, అప్పుడప్పుడే పారిశ్రామికవిప్లవ ప్రభంజనం తాకిడికి గురౌతూవచ్చిన అమెరికాలోనూ, శ్రామికవర్గ ఉద్యమ నిర్మాణరూపాలు ప్రశాంతపటిష్ఠంకావడం ఆశ్చర్యం కలిగించదు. ముఖ్యంగా ఇంగ్లాండులో కార్మికుల కోర్కెలపత్రం (చార్టర్) ఆధారంగా మహోద్యమంగాపెరిగిన 'ఛార్టిజం' అప్పటికే శిఖరాలనందుకుంది. యూరపు దేశాల శ్రామికవర్గ సంఘాలతో దానికి గాఢమైన సంబంధాలేర్పడ్డాయి. 1844 నాటికే 'ఫ్రాటర్నల్ డెమోక్రాట్స్' పేరిట ఇంగ్లీషుఛార్టిస్టులూ, యూరపియన్ దేశాలనుంచి ప్రవాసంవచ్చిన శ్రామికులూ లండన్‌లో ఒక సమావేశం జరిపినప్పుడు మార్క్సు, ఎంగెల్సులు దానితో సహకరించారు. 'ఇంటర్నేషనల్ కమిటీ' అనే సంస్థ 1855 నుంచి నాలుగేళ్ళపాటు అంతర్జాతీయ దృక్పథాన్ని పెంపొందించింది. అమెరికాలోనే కాక బ్రిటిష్‌సామ్రాజ్యభాగాలన్నిటా నీగ్రో దాస్యం అంతరించాలని, ఆ విషయమై అమెరికాలోమొదలైన అంతర్యుద్ధంలో లింకన్ నాయకత్వంవహించి నడిపినపక్షాన్ని బలపరచడానికి, యిలాంటి సంఘాలు వివిధదేశాలలో ప్రదర్శనలు జరిపాయి. పోలండ్ జాతీయపోరాటాన్ని సమర్థించాయి. ప్రపంచశాంతిని కోరాయి.

"ప్రపంచ కార్మికులారా, ఏకంకండి!" అని కమ్యూనిస్టు మేనిఫెస్టో శ్రామికవర్గ అంతర్జాతీయతను శంఖారావంగా 1848లో ప్రకటించిన పదహారు సంవత్సరాలకు 1864లో లండన్‌లో సెయింట్‌మార్టిన్ హాల్లో, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, ఇంగ్లాండు ఇంకా కొన్ని దేశాలకు చెందిన శ్రామికవర్గ ప్రతినిధులు సమావేశమై 'ఇంటర్‌నేషనల్ వర్కింగ్‌మన్స్ అసోసియేషన్' స్థాపించారు. దీన్నే 'ఫస్ట్ఇంటర్నేషనల్' అని ఇప్పుడు వ్యవహరిస్తున్నాం. ఇది పన్నెండేళ్ళకాలమే (1864-1876) పనిచేయగలిగింది. చివరినాలుగు సంవత్సరాలలో యూరపుఖండంలో నిలవనీడలేక, అమెరికాకు తరలిపోవలసివచ్చింది. అయితే ఈ కొద్దికాలంలోనే అది తన సంఘటిత శక్తిని నిరూపించుకోగలిగింది. చివరిదశలోతప్ప ఎంగెల్సుకు దీనితో సన్నిహిత ప్రమేయం లేదుగనక, మొదటి ఇంటర్నేషనల్‌కు చోదకశక్తి కార్ల్‌మార్క్సు అనకోవచ్చు. మార్క్సు లేనట్లయితే, ఇది కేవలం రహస్యసంస్థగా పనిచేయవలసివుండేది. ఊహాజనిత భావాలునిండిన కార్యక్రమం లేకుండా పోవడానికి గూడా మార్క్సు కారణం. "సత్యం", "న్యాయం", "నీతి" వంటి పెటీబూర్జువాపదాలు కొన్ని చోటుచేసుకున్నా, సంస్థనియమావళిని పకడ్బందుగా రూపొందించడంలో మార్క్సు హస్తం బలంగా ఉంది. దాని కార్యక్రమాన్ని వివరించిన ప్రకటన పత్రాన్ని (అడ్రెస్) కూడా రూపొందించింది మార్క్సు.

మొదటి ఇంటర్నేషనల్ కార్యస్థానం లండన్. బ్రిటిష్ శ్రామికవర్గ పత్రిక 'బీహైవ్' దాని అధికారపత్రిక. మహాసభఎన్నుకునే జనరల్ కౌన్సిలుగాక సంస్థకు ఒక కేంద్రకమిటీ వుండేది. దానిలో యూరపులో ప్రతిదేశానికి ప్రాతినిధ్యంవహించే సభ్యుడికి స్థానంవుండేది. కమిటీ సభ్యుల సంఖ్య 21. అదనపు సభ్యులను కోఆప్ట్ చేసుకునే అధికారం ఈ కమిటీది. ఒక దేశానికీ, సంఘానికీ చెందిన ప్రతినిధులు కలిసి ఒక 'సెక్షన్'. ప్రతినిధులెందరైనా ఒక్కొ-సెక్షన్‌కు ఒకటే ఓటు. బ్రిటన్‌కు చెందిన జార్జ్ ఓడ్గర్ అధ్యక్షుడు. విలియమ్ క్రెమర్ గౌరవకార్యదర్శి. కార్యదర్శి వర్గంలో ఒక్కొ-దేశానికి కొందరేసి కార్యదర్శులుండేవారు. జర్మనీకి సంబంధించి మార్క్స్‌తోబాటు మరి ఎనిమిదిమంది ఉండేవారు. అయినా "మొదటి శ్రామిక అంతర్జాతీయసంస్థ ఏర్పడిన తొలిరోజునుంచికూడా కార్ల్‌మార్క్స్ దాని మేథోనిధి అద్భుతమైన సిద్ధాంతకర్త, వాస్తవానికి దాని నాయకుడూ".

మొదటి ఇంటర్నేషనల్ నిబంధనావళి ఉపోద్ఘాతం సంఘటిత నిర్మాణానికి పిలుపిచ్చింది. శ్రామికుల విముక్తి స్థానికవిషయమో జాతివిషయమో కాదు. ఆధునిక సమాజం ఇప్పుడు రూపొందిఉంటూన్న సమస్త దేశాలకు వ్యాప్తమైన సామాజిక విషయం. బాగా అభివృద్ధిపొందినదేశాలు సైద్ధాంతికంగానూ ఆచరణరీత్యానూ ఏకీభావం ప్రకటిస్తేనే ఆ సమస్యకు పరిష్కారం సాధ్యం. అందుచేత ఇప్పటివరకు పరస్పర సంబంధం లేకుండావుంటూవచ్చిన వుద్యమాలన్నీ తక్షణం ఐక్యంకావలసివుంది. కార్మికవర్గాల విముక్తిని కార్మికవర్గాలే స్వయంగా గెలుచుకోవలసివుంది. కార్మిక వర్గాల విముక్తి అంటే సమానమైన హక్కులకోసమూ విధులకోసమూ పోరాటమే, వర్గపాలన సాంతం రద్దుకావడంకోసం పోరాటమేగాని, ప్రత్యేకవర్గహక్కులకోసమో గుత్తాధికారాలకోసమో పోరాటంకాదు. జీవితానికి మూలాధారమైన శ్రమసాధనాలమీద గుత్తాధిపత్యం వహించేవానికి శ్రమజీవి ఆర్థికంగా లోబడివుండడమే అన్నివిధాలైన దాసత్వానికీ, సమస్త సామాజికక్షోభకూ, మానసికక్షీణస్థితికీ రాజకీయపరాధీనతకూ దారితీస్తుంది. అందుచేత కార్మికవర్గాల ఆర్థికవిముక్తి అనే మహత్తరమైన లక్ష్య సిద్ధికిలోబడి ప్రతిరాజకీయఉద్యమమూ సాధనప్రాయంగానే ఉండితీరాలి.

కార్యక్రమానికి సంబంధించిన 'ఇనాగరల్ అడ్రెస్' (ప్రారంభప్రకటన) కమ్యూనిజం మూలసూత్రాలను కార్మికవర్గం నిత్యంజరిపే పోరాటాలకు అన్వయించడమేగాక, దాని అంతిమలక్ష్యాలనుకూడా ప్రదర్శించిన గొప్పపత్రం. 1848 లగాయతు పరిశ్రమలేమో వ్యాపిస్తూ పెట్టుబడిదారులు లాభాలుపెంచుకుంటూ వచ్చినా,

పేదరికం నానాటికీ దారుణంగా పెరుగుతూ, కార్మికులకు బతకడమే గగనమయిందని చెప్పింది. ముప్పైసంవత్సరాలుగా ఆందోళనకుదిగి పోరాటంచేశాకనే 1847లో కార్మికులు పదిగంటల పనిబిల్లును రాబట్టుకోగలిగారని, ఇది గొప్ప విజయమని పేర్కొంది. "మొట్టమొదటిమారు పట్టపగటిపూట మధ్యతరగతి రాజకీయ ఆర్థికవ్యవస్థ కార్మికవర్గ రాజకీయ ఆర్థికవ్యవస్థ తడాఖాకు లోబడింది" సహకార వుద్యమ పురోగతినిహర్షిస్తూ, ఆదేసమయంలో ఇదొక్కటే శ్రామికుల దురవస్థను అంతమొందించజాలదని ప్రకటించింది. రాజకీయకార్యాచరణ అవసరం. "అందుచేత రాజకీయాధికారాన్ని గెలుచుకోవడం కార్మికవర్గానికి మహత్తర కర్తవ్యమయింది." కార్మికులకు సంఖ్యాబలంఉంది. అయితే, ఒక్కటిగారూపొంది సిద్ధాంతం నాయకత్వాన నడిచినప్పుడే సంఖ్యాబలం నిజమైనబలంకాగలదు. లోగడ అనైక్యతఎలాంటి అనర్థాలకూ అపజయాలకూ దారితీసిందో గమనించి కార్మికులు సంఘటితంకావాలి. కార్మికవర్గానికి తనదంటూ ఒక విదేశాంగ విధానం అవసరం. జాతీయ విద్వేషాలూ, దోపిడీయుద్ధాలూ, క్రూరకౌటిల్యాలూ ప్రముఖాంశాలైన పెట్టుబడిదారీ వర్గాల విదేశాంగవిధానం కార్మికులకు విషప్రాయం. పరదేశాల శ్రామికవర్గాలతో సోదరసంబంధాలుంటేనేగాని శ్రామిక వర్గవిముక్తి జరగదు. "ప్రజాస్వామికమైన, శాంతికాముకమైన" విదేశాంగ విధానంకోసం జరిపేపోరాటం శ్రామికవర్గ విముక్తిలో అంతర్భాగమే.

1864 నాటికి ఇంగ్లాండు, ఫ్రాన్సులాంటి దేశాలలోతప్ప తక్కినవాటిలో బలమైన శ్రామికోద్యమాలు లేవు సరికదా, జాతివ్యాప్తమైన శ్రామికవర్గ సంఘాలుగాని, శ్రామికవర్గ రాజకీయపార్టీలుగాని లేవు. ఇంగ్లాండులోనైనా ఛార్టిస్టు ఉద్యమం తర్వాత తలెత్తసాగిన ట్రేడ్‌యూనియన్లు దేశరాజకీయాలలో లిబరల్‌పార్టీని అంటకాగుతూ ఆర్థిక సదుపాయాలతో తృప్తిచెందుతూవుండేవి. అప్పుడప్పుడు బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానం ముదిరి సామ్రాజ్యవాదం అవుతూవుంది. శ్రామికులలో నిపుణులకు (స్కిల్డ్) అదనపు ప్రతిఫలం ముట్టజెప్పుతూ నోరుమూయించగలిగింది. ఓటుహక్కువంటి వాటికోసం తప్పిస్తే, ట్రేడ్‌యూనియన్ల నాయకులు స్వతంత్ర రాజకీయ కార్యాచరణకు విముఖులు. పాక్షికమైన (పార్షల్) ఆర్థిక పోరాటాలకుమాత్రమే సుముఖులు. ఇక ఫ్రెంచి కార్మికవర్గంలో ప్రౌధాఁ (Proudhon) భావాలపట్టు బలంగావుండేది. చిన్నపాటి వుత్పత్తిదారుల, వ్యవసాయదారుల ప్రయోజనాలకు భావప్రాతినిధ్యం వహించిన ప్రౌధాఁకు ట్రేడ్‌యూనియన్లంటే సరిపడదు. ఉత్పత్తి

దారులు తమ ఆదాలో మిగిలించిన సొమ్మని పరస్పర సహకారసంఘాలలో మదుపు చేసి తమస్థితిని మెరుగుపడేలా క్రమంగా తామూ ఆస్తిపరులుగా రూపొందడంద్వారానే ప్రస్తుత వ్యవస్థనుంచి బైటపడగలరనీ, నూతన సమాజాన్ని శాసించేందుకు రాజ్య మేదీ అవసరంలేదనీ, అరాజకమే (Anarchy) దాని లక్షణమనీ ప్రౌధాఁ భావించాడు. అతనికి వర్గపోరాటమే సరిపడదు. రాజకీయపక్షాలూ అనవసరమంటాడు. "శ్రామిక వర్గంలేని బూర్జువావర్గం" ప్రౌధాఁ లక్ష్యమంటూ అతనిది బూర్జువా సోషలిజమని కమ్యూనిస్టు మేనిఫెస్టో (1848)లో మార్క్స్ వర్ణించడం జరిగింది.

అతని సిద్ధాంతగ్రంథం 'దారిద్ర్యతత్వం'(The Philosophy of Poverty) (1846) దాన్ని ఖండిస్తూ మార్క్స్ 'తత్వదారిద్ర్యం' (The Poverty of Philosophy) (1847) ని రాశారు.

జర్మనీలో మొట్టమొదటి శ్రామికవర్గ సంఘాన్ని నిర్మించిన ఫెర్డినాండ్ లస్సాల్ మార్క్స్ అనుచరుడుగానే మొదలైనా, ప్రౌధాఁ భావాలను కొన్నిటిని ఒంటబట్టించుకున్నాడు. శ్రామికవర్గాన్ని ఎలాగైనా మచ్చికచెయ్యాలని తలపెట్టిన ప్రష్యాముఖ్య మంత్రి బిస్మార్క్ ఎత్తుపారేలా, ప్రభుత్వం కలిగించే ఆర్థికపరపతిని వాడుకుంటూ శ్రామికులు తమ స్థితిని మెరుగుపరచుకోవాలిగాని ట్రేడ్ యూనియన్ పోరాటాలద్వారా తమ వేతనాలను పెంచుకునేందుకు ప్రయత్నించడం వృథాఅని లస్సాల్ అభిప్రాయం. కేవలం జీవితావసరాలను తీర్చగలిగిన స్థాయికి వేతనాలు అంటిపెట్టుకుని వుంటాయని సిద్ధాంతం చేశాడు. ట్రేడ్ యూనియన్ పోరాటాల ద్వారా వేతనాలొక వేళ పెరిగినా, వెనువెంటనే జీవనవ్యయం కూడా పెరగక తప్పదు గనక వేతనాల పెరుగుదల నిరర్థకం కాగలదని 'ఐరన్ లా ఆఫ్ వేజెస్' పేరిట సూత్రీకరించాడు. దీన్ని ఎదుర్కొంటూ ఇంటర్నేషనల్ పక్షాన 'వేతనం, ధర, లాభం' అనే చిన్న పుస్తకాన్ని మార్క్స్ రాయవలసివచ్చింది (1865). రాజకీయ, ఆర్థిక కార్యాచరణ ద్వారా శ్రామికులు వట్టి జీవితావసరాలను సంతృప్తిపరిచే స్థాయినిమించి తమ జీవన ప్రమాణాలను నిజంగానే పెంచుకోగలరని చెబుతూ, వేతనాల రేటు పెరిగినప్పుడు లాభాల రేటు తగ్గుతుందని, ఈ సాధారణ ధర్మంమూలాన సరుకుల ధరలో మార్పుండ బోదని పేర్కొన్నాడు. అయినా, మొత్తానికి, "పెట్టుబడిదారీ వుత్పత్తి సామాన్య ధోరణి వేతనాల సగటుస్థాయిని కుంచించడమేగాని హెచ్చించడంకాదు" అని నిర్ధారణచేశాడు. పాక్షికపోరాటాలు చేస్తూనే వేతనాల పెంపుదలతో శ్రామికులు తృప్తిపడ కూడదనీ, వేతనవ్యవస్థ రద్దునే కోరాలనీ ఉద్బోధించాడు.

మితవాద అవకాశవాదధోరణులతోనేగాక, అతివాదధోరణులతో సైతం ఇంటర్నేష నల్‌లో మార్క్స్ పోరాడవలసి వచ్చింది. ఎన్నోపోరాటాల్లో రాటుదేలిన ఫ్రెంచి సాహసి బ్లాంక్వీ పేరిస్ కార్మికవర్గంలో పలుకుబడి సంపాదించుకున్న గొప్పవ్యక్తి. కమ్యూనిజాన్నీ శ్రామికవర్గ నియంతృత్వాన్నీ అభిమానించినా అతనిభావాలకు స్పష్టతలోపించింది. పైగా, రహస్యపద్ధతుల్లో చిన్నచిన్న బృందాలతో సాయుధ తిరుగుబాట్లులేవదీసి ప్రస్తుతరాజ్యాన్ని కూలదొయ్యవలసిందేగాని ఆర్థిక, రాజకీయ సంస్కరణలకోసం ప్రయత్నించనేకూడదని మొండికిపడేతత్వం బ్లాంక్విది. ఇంట ర్నేషనల్ సమావేశాలలో అనేక అంశాలమీద మార్క్సిస్టుపంథాను సమర్థించినా, పేరిస్‌కమ్యూన్ సందర్భంలో (1871) తీవ్రమైన అభిప్రాయభేదాలతో వ్యవహ రించాడు.

ఇంటర్నేషనల్‌కూ మార్క్స్‌కూ మరింత కంటకంగాతయారైంది రష్యన్ అరాచకవాది బకూనిన్. ప్రౌఢ, భావధోరణికేచెందినా క్రమంగామారి ట్రేడ్ యూనియనిజం గురించి సద్భావం పెంచుకున్నాడుగాని, అంతిమంగామాత్రం సాయుధతిరుగుబాటు ద్వారానే రాజ్యాన్నికూల్చడం సాధ్యమనీ, భావిసమాజంలో రాజ్యమనేసంస్థకీ స్థానంలేకుండా ఉంటుందనీ, సొంతఆస్తిగాని మతంగాని ఉండ బోదనీ బకూనిన్ వాదించాడు. ఆర్థిక, రాజకీయ సంస్కరణలకోసం రాయితీల కోసం పోరాడడం తగదనీ, బూర్జువారాజ్యాన్ని ప్రజాస్వామికం చెయ్యాలనే రాజ కీయ ప్రయత్నం నిష్ఫలమనీ, చిన్నచిన్న తిరుగుబాట్ల స్వభావం ఉన్నంతమేరకే సమ్మెలను బలపరచాలనీ, సార్వజనిక సాయుధ తిరుగుబాటొక్కటే పెట్టుబడిదారీ రాజ్యాన్ని తుదముట్టించగలదు కాబట్టి ఆ అంతిమలక్ష్యమే ఏకైకలక్ష్యంకావాలని బకూనిన్ పట్టుబట్టాడు. పెట్టుబడిదారీ రాజ్యాంతానికీ సోషలిస్టు రాజ్యారంభానికీ మధ్యకాలంలో శ్రామికవర్గం రాజ్యాధికారాన్ని నిర్వహిస్తూ వెనకటి పరిపాలక వర్గావశేషాలమీద నియంతృత్వం నెరపుతుందనే మార్క్సిస్టు సూత్రీకరణతోనూ, శ్రామికవర్గానికి స్వతంత్రమైన రాజకీయపార్టీ ఆవశ్యకత విషయంలోనూ ఇంట ర్నేషనల్ చివరిసమావేశాలలో తీవ్రంగా పేచీకిదిగాడు. స్విట్జర్లాండ్, ఇటలీ, స్పెయిన్‌వంటి దేశాలలో వెనకబడివున్న శ్రామికవర్గానికి యీ పెటీబూర్జువాభావాలు బాగావచ్చాయి. 1868లో ఇంటర్నేషనల్‌లో సభ్యత్వంపొందినా తన నాయకత్వాన వున్న శ్రామికవర్గసంఘాలను 'అలయన్స్' పేరుతో పోటీ అంతర్జాతీయసంస్థగా నడపసాగాడు. ఇంటర్నేషనల్‌లో సభ్యత్వంపొందిన వివిధ 'సెక్షన్'లకు స్వయం

ప్రతిపత్తి (అటానమీ) ఉండాలిగాని, జనరల్‌కౌన్సిల్ పెత్తనం ఉండగూడదనీ, కేంద్రీకృతాధికారం సాగరాదనీ వాదించాడు. ఉత్తరప్రత్యుత్తరాలు సాగించే కేంద్రంలాగా పనిచెయ్యాలితప్ప సుసంఘటితమైన ప్రపంచ శ్రామిక రాజకీయనిర్మాణంగా ఇంటర్నేషనల్ వ్యవహరించరాదని 'స్వచ్ఛందత' (స్పాంటేనియిటీ)ని సమర్థించాడు. మార్క్స్ అభిప్రాయంమాత్రం, ఇంటర్నేషనల్ అంతర్జాతీయ శ్రామిక వర్గ రాజకీయపక్షానికినాంది. ఇన్నిముఖ్యంశాలమీద ఇంతతీవ్రంగా విభేదించి విచ్ఛిన్నతకలిగించినందుకు హేగ్ సమావేశంలో (1872) బకూనిన్‌నూ అతనిఅనుచరులు కొందరినీ బహిష్కరించవలసి వచ్చింది. ఆ తర్వాత వాళ్లుస్వయంగా తమ భావాలతోటిపోటీ ఇంటర్నేషనల్‌ను 1877దాకా నడుపుకున్నారు. దీన్ని "బ్లాక్ ఇంటర్నేషనల్" అంటారు. ప్రజాసంఘాల నిర్మాణాన్ని, పోరాటాలనూ తృణీకరిస్తూ, కొన్ని వెనకబడినదేశాలలో రాజకీయాధికారంకోసం తిరుగుబాట్లుసాగిస్తూ క్రమంగా వ్యక్తి హింసావాదపద్ధతులకు ఈసంస్థ బలైపోయింది. బకూనిన్‌తర్వాత మరో రష్యన్‌పీటర్ క్రోపాట్కిన్ దీనికి నాయకుడయ్యాడు. పెట్టుబడిదారీ వర్గాన్నిగాక రాజ్యాన్నిమాత్రమే వ్యతిరేకిస్తూ, దైనందిన పోరాటాలనుగాక సాయుధతిరుగుబాటుని మాత్రమే లక్ష్యంచేసుకుంటూ, శ్రామికవర్గ సాధారణ ప్రయోజనాలను లెక్కించకుండా ఎన్నికలను పోరాటరూపంగా గుర్తించకుండా చివరికి తమ వితండవాదం మూలంగా అరాజకవాద కమ్యూనిస్టులు ఒంటెత్తుపోకడలతో రాజకీయ ఆత్మహత్య చేసుకున్నారు. అయితే వారిప్రభావం పూర్తిగా అంతరించలేదు. స్వయంప్రతిపత్తిగల శ్రామికవర్గ సంఘాల స్వచ్ఛందరాజకీయకార్యాచరణ మూలసూత్రంగా 'సిండికలిజం' అనే ధోరణి వ్యాపించింది. భవిష్యత్సమాజంలో ట్రేడ్‌యూనియన్ల రాజ్యం ఏర్పడుతుందని, టెర్రరిస్టు పద్ధతులతో సార్వజనికసమ్మె (జనరల్‌స్ట్రైక్)లో ప్రస్తుత రాజ్యాన్ని అంతమొందించగలమని వీరినమ్మకం.

ఇలా మొదట, పెడధోరణులతో కుస్తీపడుతూ మొదటి ఇంటర్నేషనల్ 1872 దాకా యూరపులో పనిచేస్తూవచ్చింది. క్రమంగా పెరగసాగిన దానిశక్తిని గమనించి ఫ్రాన్సులోనూ తదితరదేశాలలోనూ ప్రభుత్వాలు నిర్బంధకాండను అమలు పెట్టసాగాయి. శ్రామికవర్గసంఘాలు మాత్రమేగాక, విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంఘాలకుగూడా ప్రాతినిధ్యమిచ్చి ఇంటర్నేషనల్ తన వేదికను సిద్ధాంతవిషయాల్లోనూ ఆచరణ విషయాల్లోనూ యుద్ధరంగంగా మార్చుకుంది. ఎన్నో సమ్మెపోరాటాలకు ప్రేరణనూ నాయకత్వాన్నీ కలిగించింది. ఐర్లాండు, పోలండ్‌దేశాల

జాతీయస్వాతంత్ర్య పోరాటాలను సమర్థించింది. ప్రష్యా, ఆస్ట్రియా దేశాల యుద్ధాన్నీ, జర్మనీ, ఫ్రాన్సుదేశాల యుద్ధాన్నీ వ్యతిరేకిస్తూ శ్రామికవర్గ అంతర్జాతీయ తను చాటింది. ట్రేడ్ యూనియన్‌ల ఆర్థికపోరాటాలను బలపరిచినా రాజకీయలక్ష్యాల విషయంలో అప్రమత్తంగా ఉండాలని ప్రబోధించింది. పేరిస్‌కమ్యూన్ తొందర పాటు చర్యే అని మొదట్లో అనుకున్నా, అది ఏర్పడ్డాకమాత్రం దానిలోపాల్గొని భవిష్యత్ శ్రామికరాజ్యానికి ప్రయోగంలాగా భావించింది. దోపిడీవర్గపు రాజ్యాన్ని యథాతథంగా చేజిక్కించుకోవడంగాక, దాన్ని బద్దలుగొట్టందే శ్రామికవర్గరాజ్యం రూపొందదనే గుణపాఠంలీపింది. ఈ సందర్భంలో మార్క్సురాసిందే "సివిల్ వార్ ఇన్ ఫ్రాన్స్". ఈదశలోనే 'కేపిటల్' మొదటిసంపుటంకూడా వెలువడింది. కొన్నిపొరబాట్లు జరిగినా, ఇంటర్నేషనల్ గొప్పదనానికి లోటులేదు. 1872 నుంచి 1876 దాకా అమెరికాలో కొద్దిమంది తోడ్పాటుతోమాత్రమే పనిచేయగలిగింది. అది సంఘటితశక్తిగా అంతరించేందుకు ముఖ్యమైనకారణాలు దాని అనైక్యతతోబాటు, సరిగ్గా ఆ రోజుల్లోనే యూరపియన్ పెట్టుబడిదారీవ్యవస్థ పొందసాగినమార్పు. బూర్జువావర్గం తన అభ్యుదయాత్మకస్వభావాన్ని పూర్తిగా పోగొట్టుకుంటూ సామ్రాజ్యవాద దశారంభానికి చేరుకోసాగింది. ఈ కొత్తదశలో తలెత్తుతతప్పని కొత్తకర్తవ్యాలను నిర్వర్తించేందుకు శ్రామికవర్గ రాజకీయపార్టీలు అత్యవసరం. అప్పటికి అవి లేవు. ఒకటీ అరాఉన్నా, శైశవదశలోనే ఉండేవి. శ్రామికవర్గ విప్లవవిజయం తక్షణమే సంభవమనే ఆశావాదాన్ని దెబ్బతీసేలా పెట్టుబడిదారీవ్యవస్థ స్థిరపడి రూపాంతరం చెందడంతో, మొదటి ఇంటర్నేషనల్‌కుగల చారిత్రిక అవశ్యకత అంతరించి నట్టైలెక్క.

## 2

పోరాటం కోసం శ్రామికవర్గాన్ని సంఘటితంచేసి, అస్పష్టంగా అనాచరణీయంగా వుండిన సోషలిస్టు భావాలకు నిర్దుష్టస్వరూపం ఇచ్చేందుకు రూపొందిన ప్రథమ అంతర్జాతీయ నిర్మాణరూపం 'ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్' ఊహాజనిత సోషలిస్టులు, అరాచకవాదులు, పాక్షికపోరాటవాదులు, రాజకీయపోరాటవిముఖులు- ఇలాంటి వారితోగూడిన బృందాలు (సెక్ట్స్) దానికి అడ్డుదగులుతూ వచ్చాయి. అయినా ఈ అడ్డంకులను దాటుకుని అది శ్రామికవర్గ అంతర్జాతీయతకు సిద్ధాంతపరంగానూ, ఆచరణాత్మకంగానూ పునాది వెయ్యగలిగింది.

సంస్థగా అంతరించినప్పటికీ, అది వ్యాప్తిచేసిన భావం మాత్రం వివిధదేశాల శ్రామికోద్యమాలలో సజీవంగా కొనసాగింది. మరో అంతర్జాతీయసంస్థ రూపొందేముందుగా శ్రామికవర్గ రాజకీయపార్టీలు కొన్ని దేశాలలోనైనా ఏర్పడ్డాయి. అంతర్జాతీయ శ్రామిక మహాసభలు జరుగుతూ వచ్చాయి. సమ్మె పోరాటాలు వరదెత్తాయి. దీనికి తోడుగా పెట్టుబడిదారీ వ్యవస్థలో గుణాత్మకమైన మార్పువచ్చింది. పోటీ ప్రముఖలక్షణంగా వుండిన దశ దాటి, గుత్తాధిపత్యం ప్రముఖ లక్షణమైన దశ మొదలైన ఫలితంగా, పాశ్చాత్య దేశాలలో పెట్టుబడి కేంద్రీకరణఫలితంగా పెద్దపెద్ద ట్రస్టులూ, కార్టెల్లూ రూపొంది ద్రవ్యాన్ని బడుగుదేశాలకు ఎగుమతిచేసి వాటిని ఆర్థిక, రాజకీయ పరాధీనతకు గురిజేస్తూ, లెక్కకు మిక్కుటమైన లాభాలుతీస్తూ సామ్రాజ్యవాదం అవతరించింది. బ్రిటన్, ఫ్రాన్స్ వంటి దేశాలు ఈ విషయంలో ముందంజవేశాయి. అయితే వాటికి పోటీగా జర్మనీ వంటిదేశాలు బరిలోకి దిగాయి. ఆర్థికమైన స్పర్థలు రాజకీయ, సైనిక వైషమ్యాలుగా మారాయి. అంతిమంగా ఇవి మొదటి ప్రపంచయుద్ధానికి దారితీశాయి. యుద్ధం సామ్రాజ్యవాదానికి ప్రాణగండమయ్యేలా శ్రామికవర్గ విప్లవానికి అనుకూలమైన భౌతికవాతావరణం ఏర్పడింది.

సామ్రాజ్యవాద దశారంభంలో మాత్రం ఈ సూచనలంతగా బయల్పడలేదు. పైకి అంతా ప్రశాంతంగా వున్నట్టుగానూ, పెట్టుబడిదారీ వ్యవస్థ స్థిరపడుతున్నట్టుగానూ, శ్రామికవర్గపోరాటం పుధృతికోల్పోయినట్టుగానూ అనిపించింది. శ్రామికవర్గ విప్లవానికి గల అవకాశాలు సుదూరభవిష్యత్తులో ఏమోగాని, ఇప్పట్లో మాత్రం ఆశాజనకం అనిపించలేదు. పెట్టుబడిదారీ జాతీయవాదం రేపివిడిచిన యుద్ధాల పరంపర ఆగిపోయినట్టు కూడా అనిపించింది. ముఖ్యమైన పెట్టుబడిదారీ దేశాలలో కార్మికవర్గానికి, ముఖ్యంగా నైపుణ్యంగల విభాగానికి, వేతనాలు పెరిగాయి. రాయితీలు లభించాయి. కార్మికవర్గంలోనే ఇలా ఒక సంపన్నబృందం (లేబర్ అరిస్టోక్రసీ) తలెత్తగలిగింది. ట్రేడ్‌యూనియన్ పుద్యమం అపూర్వంగా పెరిగింది. పాలకవర్గ భావజాలం శ్రామికవర్గసిద్ధాంతానికి తెగులుగా పరిణమించసాగింది. మితవాద అవకాశవాద ధోరణి బలిసింది. బూర్జువా చట్టాలపరిధిలోనే శాంతియుత పద్ధతుల్లో సంస్కరణల ద్వారా క్రమంగా సోషలిజాన్ని సాధించుకోవచ్చునంటూ బ్రిటిష్ శ్రామికవర్గంలో 'ఫాబియనిస్టులు' అనే పేరుతో కొందరు పైకివచ్చారు. జర్మన్ శ్రామికోద్యమానికి చెందిన మార్క్సిస్టులు సైతం లస్సాల్ అనుచరులతో కలిసి ఒకే

పార్టీ పెట్టేందుకని సిద్ధాంత విషయాలలో లొంగుబాటు ధోరణి చూపారు. గోథా ఒప్పందం ఫలితంగా రూపొందిన గోథా కార్యక్రమాన్ని మార్క్స్ చీల్చిచెండాడినా. (1875) ఈ విమర్శా గ్రంథాన్ని వైబ్‌నెక్ట్ లాంటి జర్మన్‌పార్టీ నాయకులు 1891 దాకా తొక్కిపట్టారు. మొత్తంమీద సంస్కరణ వాదానిదే అప్పట్లో పైచేయి. ఈ పరిస్థితుల్లో 1889 జూలై 14న పేరిస్‌లో ఇరవైదేశాలకు చెందిన శ్రామి వర్గ ప్రతినిధుల సమావేశం నుంచి రెండవ ఇంటర్నేషనల్ మొదలైంది.

రెండో ఇంటర్నేషనల్ ఐదోమహాసభ పారిస్‌లో జరిగేవరకూ (1900) దానికి ఒక నిశ్చితమైన సంస్థారూపమే లేదు. ఆ మహాసభలో 'ఇంటర్నేషనల్ సోషలిస్టు బ్యూరో'ను ఏర్పాటుచేశారు. దీనికొక కార్యదర్శిని పెట్టారు. సాలీనా 10,000 ఫ్రాంకుల ఆదాయం చూపారు. ఈ బ్యూరో సంవత్సరానికి నాలుగుమార్లు సమావేశంకావాలి. దీని కార్యస్థానం బ్రస్సెల్స్. ఒక సమావేశానికీ మరో సమావేశానికీ మధ్యకాలంలో దీని వ్యవహారాలను నిర్వహించే అధికారం బెల్జియన్ లేబర్‌పార్టీ కార్యవర్గానికి అప్పగించారు. ఈ బ్యూరో నిజమైన నాయకత్వం వహించలేక పోయింది. కేవలం ఉత్తరప్రత్యుత్తరాలకూ లెక్కపక్కలకూ దీనికార్యకలాపాలు పరిమితం అయ్యాయి. పోనుపోను దీనిసంఖ్యాబలాన్ని పెంచడం జరిగింది. వివిధ జాతీయపార్టీల వివాదాలలో పరిష్కర్తగాకూడా వ్యవహరించేలా దీని ప్రాముఖ్యం అతిశయించింది. అయినా మొదటి ఇంటర్నేషనల్ తాలూకు జనరల్ కౌన్సిల్‌కూ దీనికీ నాయకత్వం విషయంలో పోలికేలేదు. ప్రూధాం, లసాల్, బకూనిన్‌ల అనుచరుల ప్రభావం పూర్తిగా అంతరించకపోయినా వారిశక్తిమాత్రం వుడిగిపోయింది. పేరిస్ సమావేశంనాటికి ప్రపంచ శ్రామికోద్యమంలో మార్క్సిస్టులదే అగ్రస్థానం. మార్క్స్ మరణించాక (1883) ఎంగెల్స్ మరణించేంతవరకూ (1895) శక్తివంతమైన నాయకత్వానికి కొదవలేకుండా పోయింది. అయినా మితవాదధోరణి మాత్రం తప్పలేదు. రెండో ఇంటర్నేషనల్‌ను భ్రష్టుపట్టించిన జాడ్యం ఇదే. దీనికి మూలకారణం బూర్జువావర్గభావజాలం శ్రామికోద్యమంలోకి చొరబారిరావడమే. రెండో ఇంటర్నేషనల్ తలెత్తిన రెండేళ్ళకే ఇంగ్లీషు 'పాజిబిలిస్టుల'ను చేర్చుకోవడం (1891) దీనికి తొలిసూచన, జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీకోసం కార్ల్ కౌట్స్కీ రూపొందించిన 'ఎర్ఫర్ట్‌ప్రోగ్రామ్'లో జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్ స్థాపనను కోరకపోవడమే గాక, శ్రామికవర్గనియంతృత్వ భావాన్ని వదిలివెయ్యడం మరోసూచన. ఇంగ్లాండులో 'ఫేబియన్‌లీగ్' పేరిట బూర్జువా ప్రజాస్వామికాన్ని సమర్థిస్తూ మార్క్సిజానికి పెడ

మొగం పెట్టిన బృందం ఒకటి ఏర్పడి బలపడడం ఇంకో సూచన 'అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్' నాయకత్వం అవకాశవాదాన్ని అవలంబించడం మరింకో సూచన. లండన్ సమావేశం నాటికి (1906) ఈ సూచనలన్నీ గట్టిపడి మితవాదధోరణికి ఒక నిశ్చితమైన రూపం ఏర్పడింది. సోషలిజం తాలూకు విప్లవ లక్ష్యం అడుక్కి వెళ్ళేలా కేవలం పాక్షికపోరాటాలకూ ఆర్థికకోర్కెలకూ ప్రాముఖ్యమివ్వడం వీనిలక్షణాలలో ఒకటి అంటే, బూర్జువా రాజ్యాన్ని కూలదొయ్యడంగాక శ్రామిక వర్గవిముక్తిని శాంతియుతంగా సాధించుకునేందుకు అనువుగా మార్చుకోవచ్చుననే భ్రమ కలగడానికి ఇదేమూలం. వెనకటికాలంలోలాగా మహానగరాలలో బేరికేడ్లు లేపి వీధిపోరాటాలు సాగే వీలులేనంతగా పెట్టుబడిదారీ రాజ్యం తన సైనికవ్యవస్థను బాగా ఆధునికం చేసుకొందని 1895లో ఎంగెల్స్, మార్క్స్ రచన 'క్లాస్ స్ట్రగుల్స్ ఇన్ ఫ్రాన్స్'కు రాసిన పుపోద్ఘాతంలో చెప్పినదాన్ని ఆధారంచేసుకుని, మరికొన్ని రచనాభాగాలను తొక్కిపట్టి, విపరీతార్థాలు తీయడం జరిగింది. విప్లవంలో సాయుధ పోరాటం అసాధ్యమని ఎంగెల్సు సూత్రీకరించినట్టు వికృతభాష్యాలు చేయడంజరిగింది. విప్లవం ప్రారంభదశలో ఇలాంటి సాయుధ పోరాటానికి అవకాశం తక్కువ అని మాత్రమే అన్నాడు గాని విప్లవక్రమంలో సుసాధ్యమని ఎంగెల్స్ చెప్పాడనే విషయాన్ని మరుగుపరిచారు. మొత్తానికి రెండో ఇంటర్నేషనల్ ఆదిలోనే హంసపాదు వేసింది. మార్క్సిస్టులమనే బెర్న్‌స్టెన్, కౌట్స్కీ, ప్లెహనోవ్ వగైరాలు క్రమేపీ వూగిసలాటకుగురై, మార్క్సిస్టేతరుల సంస్కరణవాద పంథానే బలపరిచే స్థితికి దిగజారారు.

మొదటి ఇంటర్నేషనల్ రోజుల్లోనే ఎనిమిది పనిగంటల ఉద్యమక్రమంలో అమెరికాలోని చికాగోనగరంలో 'హేమార్కెట్' అనేచోట 1866 మే 4న కార్మికుల సభ సందర్భంగాజరిగిన బాంబుపేలుడును పురస్కరించుకుని దొంగకేసులు బనాయించి నలుగురు కార్మికనాయకులను ఉరితీసిన దరిమిలా, ప్రతిసంవత్సరం పోరాట దినంగా మే ఒకటవ తారీఖున శ్రామికులు పనులుమాని ప్రదర్శనలు చెయ్యాలనే సూచన తీర్మానమైన తర్వాత (1890) రెండో ఇంటర్నేషనల్‌లో మితవాదవర్గం ప్రదర్శించిన వైఖరి దానిపంథాను అద్దంలోలాగా చూపించి మే మాసంలో మొదటి ఆదివారం శెలవురోజున ఈ ప్రదర్శన జరగాలంటూ దాని పోరాటస్వభావాన్ని నీరుగార్చేందుకు తంటాలుపడింది. ఫ్రాన్సులో మిల్లిరాండ్ అనే శ్రామికనాయకుడు పరమ అభివృద్ధి నిరోధకమైన ఒక బూర్జువా మంత్రివర్గంలో చేరిన విషయంమీద

కూడా ఈ ధోరణి తన రూపాన్ని బయటవేసుకుంది. దీనికి గెలుపు కలిగేలాగా కౌట్స్కీవంటి 'సెంట్రిస్టులు' అవకాశవాదాన్ని ప్రదర్శించారు (1900)

జర్మనీలో ఎడువార్డ్ బెర్న్‌స్టీన్ మార్క్సిజానికి కాలదోషం పట్టిందంటూ 'క్రమపరిణామాత్మక సోషలిజం' (ఇవల్యూషనరీ సోషలిజం) అనే గ్రంథంలో అదనపువిలువ సిద్ధాంతాన్నీ వర్గపోరాట సిద్ధాంతాన్నీ చారిత్రిక భౌతికవాద దృక్పథాన్నీ పెట్టుబడి కేంద్రీకరణ సూత్రాన్నీ సవాలుచేశాడు (1899). పెట్టుబడిదారీ వ్యవస్థ స్థిరపడుతూందని, శ్రామికవర్గానికి ఇతోధికదారిద్ర్యం కలగడంలేదని, వేతనాల పెరుగుదలమూలంగా దానిస్థితి మెరుగుపడుతూందనీ, మధ్యతరగతి క్షీణించడంలేదు సరికదా పెరుగుతూందనీ, వీటన్నిటి దృష్ట్యా పెట్టుబడిదారీ వ్యవస్థ బలపడుతూ హితకరంగా పరిణమిస్తూంది కాబట్టి విప్లవం, శ్రామికవర్గ నియంతృత్వం అవసరంలేదని రాశాడు. వర్గసామరస్యం ద్వారా ప్రజాస్వామిక హక్కుల విస్తరణద్వారా శ్రామికులు పెట్టుబడిదారీ రాజ్యంలో భాగస్వాములయ్యే అవకాశాలే ఎక్కువ అన్నాడు. ఇలా క్రమేపీ శాంతియుతంగా సోషలిజాన్ని సాధించవచ్చునని ఆశజూపాడు. రివిజనిజానికి ఇవేమొదలు. సమస్యగా ఈవిషయం రెండో ఇంటర్నేషనల్ ఆరోసమావేశం (1904) ముందుకువచ్చింది. జర్మన్ సోషల్-డెమోక్రాటిక్ పార్టీలో బేబల్, రోసా లుక్సెంబర్గ్‌వంటి మార్క్సిస్టుల ప్రతిఘటనతో ఈ అవకాశవాద ధోరణి శృంగభంగం పొందినా, ఇదికేవలం జాతీయవిషయంగానే ఉండిపోక అంతర్జాతీయ విషయంగా రూపొందింది. సామ్రాజ్యవాద ప్రాభవయుగంలో బూర్జువారాజ్యాల ప్రలోభాలకు జాతీయ శ్రామికవర్గపక్షాలూ వ్యక్తులూ ఎలాలొంగిపోతారో, పోరాటపంథాకు స్వస్తిచెబుతూ శ్రామికవర్గంలో పాలకవర్గాల తాబేదార్లుగా ఎలా రూపొందుతారో, సిద్ధాంతాలనెలా నీరుగారుస్తారో, ఈ అంశం తెలియజేస్తుంది. ఆమ్‌స్టర్‌డామ్ సమావేశం (1904) ఈ ధోరణినిఖండించి, వామపక్షానికి విజయం చేకూర్చింది.

సామ్రాజ్యవాదదేశాల అంతర్గతవైరుధ్యాలు శాంతియుతంగా పరిష్కారమయ్యే అవకాశాలు క్రమేపి సన్నగిల్లిన ఫలితంగా యుద్ధప్రమాదం పెరగసాగినప్పుడు, జాతీయ శ్రామికవర్గపక్షాలలో మరొక ప్రమాదకరమైన ధోరణి బయల్పడింది. స్థాయిసైన్యాలను రద్దుచేసి సాయుధప్రజాసైన్యాలను (మిలీషియా) నిర్మించాలనీ, స్వార్థపూరితంగా పెట్టుబడిదారీ ప్రభుత్వాలుసాగించే జాతీయవాదయుద్ధాలలో శ్రామికవర్గం సోదరభావం ప్రదర్శించాలనీ మొదటి ఇంటర్నేషనల్ బోధించింది. బోధించడమే

కాదు, ఆచరించిచూపింది. రెండో ఇంటర్నేషనల్ కూడా మొదట్లో సవ్యమైనవైఖరినే అనుసరిస్తూ, ఆయాదేశాల శాసనసభలలో స్థానాలుపొందివున్న సోషలిస్టులు తమ ప్రభుత్వాల యుద్ధప్రయత్నాలను వ్యతిరేకిస్తూ ఆ యుద్ధవ్యయంకోసం ధనం మంజూరుకు ప్రతికూలత చూపాలని చెప్పింది. జర్మనీలో అలాజరిగిందికూడా. అయితే పోనుపోను 'దేశభక్తి' పేరిట శ్రామికవర్గపార్టీలుకూడా పెట్టుబడిదారీ ప్రభుత్వాలకు వంతపాడసాగాయి. ఇది శ్రామికవర్గ అంతర్జాతీయతకే శిరచ్ఛేదం.

కుళ్లి విడిపోసాగిన కళేబరంలాంటి రెండో ఇంటర్నేషనల్ కార్యకలాపాలలోకి పదనెక్కిన కత్తిలా లెనిన్ ప్రవేశించింది సరిగ్గా ఇలాంటి క్లిష్టపరిస్థితిలోనే. అంతవరకూ రష్యన్ సోషల్-డెమోక్రాటిక్ వర్కర్స్ పార్టీలో ప్లెహనోవ్‌లాంటి మెన్షివిక్‌లతో హోరాహోరీ పోరాటంచేస్తూ 1903 నాటికి వారినుంచి విడిపోయి బోల్షివిక్ బృందాన్ని మార్క్సిస్టు మూలసూత్రాలచుట్టూ సమీకరించిన లెనిన్, పార్టీఐక్యత పేరుతో అవకాశవాదంతోటి సహజీవనం సాగించేందుకు ససేమిరా ఇష్టపడలేదు. రెండో ఇంటర్నేషనల్‌లో కౌట్స్కీ ప్రభృతులు చేసిన రాజీప్రయత్నాలను నెట్టివేశాడు 1905 నాటి రష్యన్ విప్లవం తాలూకు అనుభవాలను శ్రామికవర్గం గ్రహించకుండా ఇంటర్నేషనల్‌లోని మితవాదనాయకత్వం చెయ్యని ప్రయత్నమంటూ లేదు. ఆధునిక పరిస్థితుల్లో సాయుధ ప్రజల తిరుగుబాటు, సామూహిక సమ్మె, బూర్జువా విప్లవానికీ సోషలిస్టు విప్లవానికీ మధ్యగల సంబంధం, భవిష్యత్ సమాజానికి ప్రాతిపదికగా సోవియట్‌పాత్ర, కట్టుదిట్టమైన క్రమశిక్షణతోటి దృఢమైన మార్క్సిస్టుపార్టీ ఆవశ్యకత- ప్రపంచ కార్మికవర్గానికి 1905 విప్లవం స్వానుభవం ద్వారా అందించిన గొప్ప విషయాలు. రెండో ఇంటర్నేషనల్ నేర్చుకోకుండా పోయింది కూడా ఈ విషయాలే అందుకనే అది చెడింది.

మొదటి ప్రపంచ యుద్ధం రెండో ఇంటర్నేషనల్‌కు గోరీకట్టింది. వలసాధిపత్యాన్నీ, సామ్రాజ్యవాద యుద్ధాన్నీ సమర్థించే ధోరణి చాలాకాలంగా బలపడుతూ వచ్చింది. స్టట్‌గార్ట్ సమావేశం (1907) లో ప్రసంగిస్తూ, సామ్రాజ్యవాదయుద్ధానికి జవాబు శ్రామికవర్గ విప్లవం మాత్రమేనని లెనిన్ ఉద్ఘాటించాడు. పెట్టుబడిదారీ విధానమే యుద్ధాలకు పుట్టిల్లు. దాన్ని అంతమొందించి సోషలిజం స్థాపిస్తేతప్ప అవి ఆగవు. కాబట్టి యుద్ధం మూలంగా ఏర్పడే సంక్షోభాన్ని శ్రామికవర్గం సరిగా వాడుకుంటూ బూర్జువావ్యవస్థ పతనానికి కృషిచెయ్యాలనేది లెనిన్‌వాదం. అంటే, యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చడమన్నమాట. స్టట్‌గార్ట్ సమావేశంలో లెనిన్ -

లక్జెంబుర్గ్‌ల సవరణలతో ఈ రూపంధరించిన బేసెల్ తీర్మానం సుప్రసిద్ధమైంది. ఆ పిమ్మట జరిగిన సమావేశాలలో కూడా ఇలాంటి తీర్మానాలు ఛెయ్యతమైతే జరిగింది గాని, మితవాదనాయకత్వం అంతిమంగా బూర్జువా ప్రభుత్వాల స్వార్థపూరిత యుద్ధాలను 'దేశభక్తి' పేరిట సమర్థించింది. 'సెంట్రిస్టుల' మంటూ కౌట్స్కీ ప్రభృతులు మితవాదానికి డాలుగా వ్యవహరించారు. విప్లవ పదజాలాన్ని మాత్రం నోటబెట్టుతూ విప్లవ కార్యాచరణను ఉపేక్షించారు. అంతర్జాతీయతావాదుల మంటూ "సోషల్-షావినిజం" ప్రదర్శించారు. పార్లమెంటరిజం వూబిలో కూరుకుపోయారు. శ్రామిక వర్గరాజకీయపార్టీలను ట్రేడ్ యూనియన్ల అధిపత్యానికి బలిపెట్టారు. ఈ నాయకత్వం నుంచి దాని అనుచరవర్గాన్ని విడగొట్టి వామపక్షశక్తులను సమీకరించి బలీయం చేసేందుకు లెనిన్ విశ్వప్రయత్నం చేశాడు.

మొదటి ప్రపంచయుద్ధం విరుచుకుపడి (1914) రెండో ఇంటర్నేషనల్‌ను లోపలినుంచే చావుదెబ్బకొట్టించిందంటే, క్రమంగా మితవాదంవైపుకుజారి దొర్లుకుంటూపోయిన 'సెంట్రిస్టు' నాయకత్వమే దోషి. దేశదేశాల శ్రామికులకు ప్రాణప్రదమైన శాంతివిషయంలో అది స్వవర్గద్రోహానికి వెనుదీయలేదు. వెనుకటి తీర్మానాలన్నీ గాలికి పేలపిండిగామారాయి. జాతీయ బూర్జువావర్గ ప్రభుత్వాల కూంగు జారుడుగా శ్రామికవర్గ మితవాదపక్షాలు జాతీయదురహంకార వైఖరిని ప్రదర్శించసాగాయి. బూర్జువా జాతీయవాదం ఛత్రచ్ఛాయల్లో విరుద్ధవర్గాలను కలిపినిలిపాయి. అవకాశవాదం శత్రువర్గదాస్యానికి దారితీసింది. మార్క్స్-ఎంగెల్సుల పర్యవేక్షణలో పుట్టిపెరిగిన జర్మన్ సోషల్-డెమోక్రాటిక్‌పార్టీ యీపతనంలో ముందంజ వేయడం జరిగింది ఆస్ట్రియా, ఫ్రాన్సు, ఇంగ్లాండు, బెల్జియం వగైరా దేశాల సోషలిస్టుపార్టీలు తమ తమ ప్రభుత్వాలను బలపరిచేవైఖరి తీసుకున్నాయి. అయితే కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌పార్టీలు యుద్ధవ్యతిరేకత ప్రకటించాయి. రష్యాలో మెన్షివిక్కులుమాత్రం 'మిత్రరాజ్యాల'ను సమర్థించారు. మరికొన్నిపార్టీలు తటస్థంగా వుండిపోయాయి. అంతర్జాతీయత వాస్తవంలో అబద్ధమైంది. "శ్రామికులకు మాతృదేశమంటూ లేదు" అని మార్క్సు చెప్పిన మాట గాలికిపోయింది.

ప్రపంచ శ్రామికోద్యమాన్ని ఈ దుస్థితినుంచి తప్పించేందుకు 1914 నవంబర్ 1న యుద్ధంగురించి లెనిన్ ప్రకటించిన 'మేనిఫెస్టో' ఎంతగానో పనికి వచ్చింది. సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చమనే వినాదాన్నిచ్చింది. యుద్ధక్రమంలో త్వరలోనే దుర్భ్రమలు వైదొలిగిన ఫలితంగా యుద్ధవ్యతిరేకభావాలు

పెరిగాయి. యుద్ధవ్యతిరేక సోషలిస్టు సమావేశాలు జరిగాయి. 1915 సెప్టెంబరులో ఇటాలియన్ సోషలిస్టుపార్టీ జిమ్మర్‌వాల్డ్‌లో (స్విట్జర్లాండ్) నిర్వహించిన సమావేశం చెప్పుకోదగింది. లెనిన్ తీర్మానాన్ని ఆమోదించకపోయినా లెనిన్ బృందం సమకూర్చిన విషయాలు ఆధారంగా ఆ మహాసభ ఆమోదించిన తీర్మానం సామ్రాజ్యవాద యుద్ధాన్ని వెనువెంటనే ఆపుచెయ్యాలనీ, ప్రాదేశికదురాక్రమణలు ఏవీలేని శాంతిని నెలకొల్పాలనీ కోరిందిగానీ, లెనిన్ ప్రతిపాదించినట్లుగా సోషలిజం స్థాపనగురించిగానీ మరో ఇంటర్నేషనల్ స్థాపన గురించిగానీ నిశ్చితంగా ఏమీ చెప్పలేదు. అయినా మూడో ఇంటర్నేషనల్‌కు యీ మహాసభ ప్రాతిపదిక వేసిందనే భావించాలి. 1916లో ఈ సోషలిస్టు బృందం కీయింతాల్‌లో రెండోమారు జరిగిన మహాసభలో కూడా సెంట్రిస్టులూ మితవాదులూ కలిసి బోల్షివిక్‌లు ప్రతిపాదించిన తీర్మానం నెగ్గకుండా చేశారు. అయితే వామపక్షం మరింత సంఘటితం కావటం విశేషం. రెండో ఇంటర్నేషనల్‌కు సారథ్యం వహిస్తూవచ్చిన ఇంటర్నేషనల్ సోషలిస్టు బ్యూరోను ఖండించడంద్వారా, మూడో ఇంటర్నేషనల్ స్థాపనకు అనుకూలమైన మార్పు మొదలైంది.

రష్యాలో 1917 మార్చిలో జరిగిన బూర్జువావిప్లవాన్ని మరో ఆరునెలలకాలంలోనే బోల్షివిక్‌పార్టీ లెనిన్‌నాయకత్వాన ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు విప్లవాన్ని జయప్రదంచేసింది. ఈ మధ్యకాలంలో యుద్ధవ్యతిరేకత అపూర్వంగా పెరిగింది. 1917లో స్టాక్‌హోమ్ నగరంలో జిమ్మర్‌వాల్డ్ సోషలిస్టుకమిటీ ఆధ్వర్యాన జరిగిన మహాసభకు అనేకదేశాల సోషలిస్టుపార్టీలు తమఅనుకూలత ప్రకటించాయి. ఆ మహాసభ రష్యన్‌విప్లవ విజయాన్ని ఆమోదపూర్వకంగా అభినందిస్తూ, సోషలిస్టు శాంతికోసం ప్రజాపోరాటం జరగాలనీ, శాంతివిషయమై అలాంటి అంతర్జాతీయ శ్రామికజనపోరాటం రష్యన్ విప్లవపరిరక్షణకు సంకేతప్రాయం కాగలదనీ ప్రకటించింది. ఇంకా మిగిలివున్న మితవాద, సెంట్రిస్టు బృందాలను నిర్మూలించందే మరో ఇంటర్నేషనల్ ఏర్పడడం అసంభవమని లెనిన్ గ్రహించాడు. రెండో ఇంటర్నేషనల్‌ను లెనిన్ చీల్చలేదు. జిమ్మర్వాల్డ్ సమావేశాల్లో అధికసంఖ్యాకులుగావుండిన కాట్స్కీ అనుచరులు యుద్ధంగురించి స్పష్టమైన వ్యతిరేకతను, సోషలిస్టు విప్లవం గురించి ఖచ్చితమైన అనుకూలతను ప్రదర్శించలేదుగనక, వామపక్షం తనసొంత 'మేనిఫెస్టో' ప్రకటించడంతోటే మూడో ఇంటర్నేషనల్ స్థాపించక స్థాపించినట్లయింది. 1917 నవంబరు 7న రష్యాలో శ్రామికవర్గ విజయంతర్వాత మూడో ఇంట

ర్నేషనల్ నిర్మాణానికై 1918 జనవరిలో పెట్రోగ్రాడ్ (దీన్నే లెనిన్ మరణంతర్వాత లెనిన్‌గ్రాడ్ అన్నారు)లో సన్నాహంమొదలయింది.

## 3

సామ్రాజ్యవాదమూ శ్రామిక వర్గవిప్లవమూ ముఖ్యలక్షణాలైన యుగానికి సంబంధించిన మార్క్సిజాన్నే లెనినిజమని నిర్వచించవచ్చు. ఈ కొత్త చారిత్రిక దశకు ప్రారంభం నవంబరు విప్లవవిజయం. శ్రామికవర్గ విప్లవకర్తవ్యాలను ఏమీ పట్టించుకోకుండా, విప్లవపంథానే విడనాడి, అవకాశవాదంతో సంస్కరణవాదంతో వర్గసామరస్యధోరణిని అవలంబించిన రెండోఇంటర్నేషనల్ కాలంలో దేశదేశాలలో కార్మికోద్యమం విస్తరించి దానికి జాతీయరాజకీయపార్టీలు బలపడి ఆర్థికపోరాటా లనేకం జరిగాయి. లెనిన్ నాయకత్వాన ఏర్పడి మార్క్సిస్టుసూత్రాలకు నిబద్ధమైన బోల్షివిక్‌పార్టీతప్ప తక్కినవేవీ కమ్యూనిస్టుపార్టీలుకావు. నేరుగా కమ్యూనిస్టుపార్టీతో గూడిన మరోఇంటర్నేషనల్ ఏర్పడగలదని 1874లోనే ఎంగెల్సు ఆశించాడు. 1919 నాటికిగాని ఇది వాస్తవంకాలేదు. లెనిన్ వర్ణించినట్టుగా, రెండోఇంటర్నేషనల్ కృషిఫలితాలను సమకూర్చుకుంటూ, దాని అవకాశవాద, జాతీయ దురహంకార, బూర్జువా, పెటీబూర్జువా మురికిని వదిలించుకుని శ్రామికవర్గ నియంతృత్వాన్ని అమలు పరిచేందుకు మరోఇంటర్నేషనల్ పూనుకోవలసివచ్చింది. ఇది లెనినిజాన్ని పాటించ సాగిన ఇంటర్నేషనల్ - కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ (కోమింటర్న్) యూరప్, ఆసియా, అమెరికాఖండాలకుచెందిన దేశాల్లో కమ్యూనిస్టుపార్టీల స్థాపనకుతోడ్పడడం దీనిప్రధానకర్తవ్యంగా పేర్కొడంజరిగింది. సామ్రాజ్యవాదదేశాల శ్రామికవర్గ పోరాటానికీ వలస, అర్ధవలసదేశాల దళితప్రజల జాతీయ విమోచనోద్యమానికీమధ్య సన్నిహితమైన శాశ్వతఅనుబంధాన్ని ఏర్పరచి, సామ్రాజ్యవాద ప్రపంచవ్యవస్థలు కూలిపోయేలా దళితప్రజలపోరాటాన్ని బలపరచడం కర్తవ్యమని కోమింటర్న్ ప్రారంభ సమావేశంలో (1919) స్పష్టంచేసింది.

ఆనాటికింకా రష్యన్‌విప్లవం గండాలుగడిచి బైటపడలేదు. పెట్టుబడిదారీదేశాల సైనిక చక్రబంధంలో రష్యా సతమతమౌతూవుంది. మరోవైపున అంతర్యుద్ధం సాగుతూవచ్చింది. హంగరీ, బవేరియా, స్లోవేకియాలలో సోషలిస్టువిప్లవాలు జరిగినా అవి వచ్చేప్రాణం పోయేప్రాణంగానే వున్నాయి. త్వరలో వాటినిఅణిచివెయ్యడం జరిగింది. జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్‌వంటి సామ్రాజ్యవాదదేశాలలో భీషణ

మైన సమ్మెపోరాటాలు పోటెత్తాయి. చైనాలోనూ ఇండియాలోనూ జాతీయోద్యమం ఉధృతమైంది. అరబ్ దేశాలు కదలబారాయి. ఇండొనేషియాకూడా పోరాటం అందుకుంది. బల్గేరియా, యుగోస్లావియా, మెక్సికో, డెన్మార్క్, స్పెయిన్, ఇరాన్, బ్రిటన్, టర్కీ, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు, ఇటలీదేశాలలో కమ్యూనిస్టుపార్టీలు తలెత్తాయి. అయితే ఇవన్నీ సమావేశంకావటానికి భౌతికపరిస్థితులింకా అనుకూలించలేదు గనక, కోమింటర్న్ కార్యనిర్వాహకవర్గాలపక్షాన రష్యన్ కమ్యూనిస్ట్‌పార్టీ ప్రతినిధులే తత్కాలానికి అంతర్జాతీయ వ్యవహారాలను చూడవలసివచ్చింది. యువకులకు, మహిళలకు, విప్లవ ట్రేడ్ యూనియన్లకు సంబంధించి అంతర్జాతీయ నిర్మాణరూపాలుకూడా ప్రారంభమవుతూ వచ్చాయి. మరోవైపున, రెండోఇంటర్నేషనల్ తాలూకు మితవాదనాయకులు యుద్ధానంతరం సోషలిస్టు విప్లవవ్యతిరేకతతోటి జెనీవా నగరంలో రెండోఇంటర్నేషనల్‌ను పునరుద్ధరించారు (1920). బ్రిటిష్ లేబర్‌పార్టీ, జర్మన్ సోషల్-డెమోక్రాటిక్‌పార్టీలో అధికసంఖ్యాకబృందం ఈ సమావేశంలోని ప్రముఖపార్టీలు. పోతే, 'సెంట్రిస్ట్' పంథాను అనుసరిస్తూ అనిశ్చితవైఖరితో పనిచేసిన పార్టీలుకొన్ని 1921లో వియన్నాలో "రెండున్నర ఇంటర్నేషనల్" అనిపించుకున్న 'వియన్నా యూనియన్'ను స్థాపించాయి. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యాన్నీ శ్రామికవర్గ నియంతృత్వాన్నీ సమన్వయంచేసే చేటిపెయ్యలక్షణాలతో దీనికి పుట్టిలోనే సంధికొట్టింది. అప్పటి పరిస్థితులలో సువిశాలమైన ఐక్యసంఘటనకుగల తక్షణ అవశ్యకతనుగుర్తిస్తూ, పెట్టుబడిదారీవిధానంతో పోరాడగోరే కార్మికుల సమ్మేళన కావాలని కోమింటర్న్ నాయకత్వంకోరింది. మూడో ఇంటర్నేషనల్‌సంస్థల ప్రతినిధులు బెర్లిన్‌లో సమావేశమయ్యారుకూడా. అయితే రెండోఇంటర్నేషనల్ కుత్సితబుద్ధివల్ల ఇదివిఫలమైంది. దరిమిలా 1923లో 'వియన్నా యూనియన్' రెండో ఇంటర్నేషనల్‌తో కలిసిపోయి 'లేబర్ అండ్ సోషలిస్ట్ ఇంటర్నేషనల్' పేరున ఒక అంతర్జాతీయసంస్థగా వ్యవహరించసాగింది.

కార్మికోద్యమంలో ఒక చెంపను మితవాద అవకాశవాదాన్నీ మరో చెంపను అతివాద వితండ ధోరణినీ విడనాడుతూ బూర్జువా వ్యవస్థను కూలదోసి శ్రామికవర్గ నియంతృత్వం రూపంలో కార్మికవర్గ రాజ్యాన్ని స్థాపించడం ఒక్కటే, అభివృద్ధి పొందిన దేశాలకు ప్రస్తుతం మౌలికమైన కర్తవ్యమని లెనిన్ నిర్దేశించాడు. అయితే ఈ లక్ష్యసాధనలో ఒక దేశం అనుసరించే పంథానే మరొకటి విధిగా అనుసరించవలసిన అగత్యంలేదనీ, వైవిధ్యానికి ఎంతైనా అవకాశం వుందని కూడా చెప్పాడు.

శ్రామికవర్గ నియంతృత్వాన్నీ దాని స్థాపనకై క్రమబద్ధమైన పోరాట ఆవశ్య

కతనూ గుర్తించి, పార్టీనుంచి సంస్కరణవాదులనూ సెంట్రిస్టులనూ గెంటివేసి, చట్టబద్ధమైన పోరాటరూపాలనూ చట్టవ్యతిరేకమైన పోరాటరూపాలనూ జోడించి, ప్రజాస్వామిక కేంద్రీకరణ సూత్రంమీద నిర్మాణమయ్యే పార్టీలకు కోమింటర్న్ సభ్యత్వఅర్హత ఉండగలదని స్పష్టంచెయ్యడం జరిగింది. మొదటి ఇంటర్నేషనల్ నిబంధనావళిని కొనసాగించాలని సంకల్పించారు. రెండో ఇంటర్నేషనల్ వైఫల్యానికి ఒక ముఖ్యకారణం దానినిర్మాణం పటిష్ఠంగా ఉండకపోవడమే గనక బలమైన కేంద్రీకృత నిర్మాణం అవసరమని గుర్తించారు. మొత్తం ప్రపంచానికంతటికీ ఏకైక కమ్యూనిస్టుపార్టీగా కోమింటర్న్ వ్యవహరించవలసి వుంటుందన్నమాట. కార్మికవర్గం రైతాంగం తాలూకు జనబాహుళ్యంతోటి మైత్రి నెరపుతూ సంపన్న భూస్వామికవర్గాన్ని వ్యతిరేకించవలసిఉంటుంది. వలస అర్ధవలసదేశాల ప్రజల జాతీయ విప్లవోద్యమాలను కోమింటర్న్ బలపరుస్తుంది. ఆ దేశాల కమ్యూనిస్టు పార్టీలు బూర్జువా - ప్రజాస్వామిక విప్లవోద్యమాలకు నాయకత్వం వహించి వాటిని బలంగా ప్రభావితంచెయ్యాలి. యం. యన్. రాయ్ భావించినట్టుగా ఆ వుద్యమాలకుగల బూర్జువా నాయకత్వం అనుసరించే రాజీ-లొంగుబాటు ధోరణిదృష్ట్యా జాతీయ పోరాటాలకు కమ్యూనిస్టులు దూరంకాగూడదు. కేవలం కార్మిక - కర్షకోద్యమాల నిర్మాణానికీ కమ్యూనిస్టుపార్టీల నిర్మాణానికీ మాత్రమే అంకితమై ఒంటెత్తుపంథా అనుసరించగూడదు. కోమింటర్న్ రెండవ సమావేశం ఇలా ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ రాజకీయపంథాను రూపొందించింది. అవకాశవాదాన్నీ సంస్కరణవాదాన్నీ వైదొలగించుకుంది. అయితే అతివాద పెడధోరణులు మాత్రం ఇంకా పూర్తిగా వదల్లేదు సరిగదా, కొన్ని సందర్భాలలో కోమింటర్న్‌ను తప్పుదారిపట్టించాయి.

1928 దాకా కోమింటర్న్ కార్యక్రమానికి స్పష్టమైన రూపం ఏర్పడలేదు. అప్పటికి లెనిన్ లేడు. ఆయన అవసానదశలో కోమింటర్న్ సమావేశాలకు కొన్నిటికి స్వయంగా హాజరు కాలేకపోయాడు కూడా. అయినా విప్లవాత్మక మార్క్సిజం ప్రాతిపదికగా లెనినిజాన్ని కొనసాగించే విధంగా ఈ కార్యక్రమం పెట్టుబడిదారీ వ్యవస్థకూ సోషలిజం విజయానికీ మధ్యగల సంక్రమణదశకు సంబంధించిన విషయాలను వివరించింది. ప్రపంచ విప్లవం అన్నిదేశాలలోనూ ఒక్కుమ్మడిగా సంభవమయ్యే ఏకైక ఘటనకాదనీ, కొన్నిటిలోనో ఒకే ఒక్క దేశంలోనో అది మొదట విజయవంతమయ్యే అవకాశం వుందనీ విశదం చేసింది. పెట్టుబడిదారీ విధానం బాగా అభివృద్ధి చెందిన దేశాలలో శ్రామికవర్గ నియంతృత్వానికి నేరుగానే పరివర్తన సాధ్యంగాని, అది ఒకమోస్తరుగానే అభివృద్ధి సాధించి బూర్జువా ప్రజాస్వామిక

సంస్కరణలు ఇంకా పూర్తిగాని దేశంలో బూర్జువా ప్రజాస్వామిక విప్లవం త్వరిత గతిలో సోషలిస్టు విప్లవంగా పరిణమించి బూర్జువా ప్రజాస్వామిక కర్తవ్యాలను నిర్వర్తిస్తుంది. ఇక అర్ధవలస, వలస, పరాధీనదేశాలలోనైతే బూర్జువా, ప్రజాస్వామిక విప్లవం సోషలిస్టు విప్లవంగాపరిణమించాలంటే సుదీర్ఘమైన చారిత్రికదశ అవసరం కావచ్చు. శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పడిన దేశాలనుంచి నేరుగాఅండ దండలు లభించినప్పుడే ఇలాంటిదేశాలలో సోషలిస్టునిర్మాణం జయప్రదం కాగలుగుతుంది. ఆ పరిస్థితిలో ఇలాంటిదేశాలు పెట్టుబడిదారీయేతర అభివృద్ధిపంథాను అనుసరించవచ్చు. ఏ దేశంలోనైనా కమ్యూనిస్టులు కార్మికవర్గంలో అధికభాగాన్ని తమ వైపుకు తిప్పుకోవలసివుంటుంది. ఇందుకోసం వాళ్లు ట్రేడ్‌యూనియన్ల వంటి ప్రజాసంఘాలలోనూ, రైతాంగంలోనూ, పెటీబూర్జువావర్గంలోనూ చురుగ్గాపని చెయ్యాలి. వలస, అర్ధవలస, పరాధీన దేశాల విప్లవపోరాటానికి ముందుండాలి. నిర్దిష్టపరిస్థితులనుబట్టి ప్రతి కమ్యూనిస్టుపార్టీ తన ఎత్తుగడల పంథాను రూపొందించుకోవాలి. ప్రపంచయుద్ధాల ప్రమాదానికి వ్యతిరేకంగా నిలిచిపోరాడుతూ, సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చి స్వదేశంలోని సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని ఓడించేందుకు, జాతీయవిమోచనోద్యమాలనూ, సోవియట్ యూనియన్‌నూ బలపరచేందుకు కృషిచెయ్యాలి. వలసదేశాల జాతీయోద్యమాలలో జాతీయబూర్జువావర్గం ఖచ్చితమైన సామ్రాజ్యవాద వ్యతిరేకతను అవలంబించదు గనక ఈ జాతీయ-సంస్కరణవాద ప్రతిపక్షంతోటి కమ్యూనిస్టుపార్టీ ఎలాంటి కూటమి కట్టకూడదని కార్యక్రమం పేర్కొంది. ఈ బూర్జువావర్గంలో ముఖ్యంగా వాణిజ్యపరమైన విభాగం నేరుగా సామ్రాజ్యవాద పెట్టుబడికి వూడిగంచేస్తుంది గనక మొత్తం జాతీయోద్యమాన్ని వ్యతిరేకించి సామ్రాజ్యవాద ప్రయోజనాలకు తోడ్పడుతుందని, సామ్రాజ్యవాదానికి దేశంలో పెట్టనికోటలాంటి భూస్వామికశక్తులతోనూ అధికవేతనాలుపొందే దేశీయ అధికారబృందంతోనూ షరీకౌతుందనీ పేర్కొంది. జాతీయ పరిశ్రమకు సంబంధించిన బూర్జువావర్గ విభాగం మాత్రం జాతీయోద్యమాన్ని మొత్తంమీద బలపరిచినా, సంస్కరణవాద ధోరణికి లోబడి వూగిసలాట వైఖరిని ప్రదర్శిస్తుందని విశ్లేషించింది. ఈ సూత్రీకరణ మూలంగా మనదేశంలో కొంతకాలం కమ్యూనిస్టుపార్టీ జాతీయోద్యమానికి దూరంగా కేటాగా వుండిపోవలసివచ్చింది.

ఇలాంటి అతివాద పెడధోరణులు కోమింటర్న్‌లో మొదటినుంచీ వుంటూ వచ్చాయి. "లెఫ్‌వింగ్ కమ్యూనిజం యాన్ ఇన్ ఫాంటైల్ డిజార్డర్" అనే విశిష్టమైన రచనలో లెనిన్ ఈ ప్రమాదాన్ని సకాలంలోనే పసిగట్టి హెచ్చరించికూడా దీన్ని

సొంతం నివారించలేకపోయాడు. ప్రపంచ పెట్టుబడిదారీ శక్తులు మళ్ళీ బలపడుతున్నాయనే వాస్తవాన్ని గుర్తించకుండా, జర్మనీ లాంటి దేశాలలో కమ్యూనిస్టుపార్టీ బలాన్ని అతిగా అంచనావేసి శ్రామికవర్గ విప్లవానికి సాయుధపోరాటం చెయ్యమంటూ పిలుపివ్వడం, దానిఫలితంగా జర్మనీపార్టీ దెబ్బతిని సైనికశక్తులు పడగవిప్పడం జరిగింది (1923). అప్పటికే ముస్సోలినీ ఇటలీలో అధికారాన్ని చేజిక్కించుకుని ఒక సంవత్సరం గడిచింది. అలాంటి పరిస్థితుల్లో సోషల్.డెమోక్రాటిక్ పార్టీలతో చేతులుకలిపి విశాలప్రాతిపదికమీద జనాన్ని సమీకరించవలసిందిపోయి, ఉమ్మడి శత్రువు లాభంపొందేలా సోషల్-డెమోక్రాట్లనే ప్రధాన శత్రువుగా యెంచే ఒంటెత్తు పోకడతో జినోవియేవ్ లాంటి కోమింటర్న్ నాయకులు వ్యవహరించారు. పలుమార్లు లెనిన్ నొక్కిచెప్పిన ఐక్యసంఘటనను కేవలం ఒక యెత్తుగడగానే భావిస్తూ, అడుగునుంచి ప్రజానీకంతో ఐక్యసంఘటనేగాని మీదినుంచి సోషల్-డెమోక్రాటిక్ పార్టీ నాకత్వంలో మాత్రం ఐక్యసంఘటన పనికిరాదని వితండవాదం చేశారు.

ప్రపంచవిప్లవం జరగకుండా, పెట్టుబడిదారీ అభివృద్ధిసాధించిన దేశాల శ్రామికవర్గం రాజకీయాధికారం పొందకుండా, కేవలం ఒక్కదేశంలోనే సోషలిజాన్ని నిలబెట్టడం అసంభవమనేవాదంతోటి లెనిన్ మరణానికి ముందునుంచీ ట్రాట్స్కీ మరొకతప్పుపోకడకు ప్రాణంపోయసాగాడు. జినోవియేవ్, కామెనెవ్‌లాంటి అతివాదులతో జోడుకట్టేడు. ఇది రష్యన్ కమ్యూనిస్టుపార్టీలో విచ్ఛిన్నధోరణికి దారితీసింది. అందుచేత పార్టీ కేంద్రకమిటీనుంచి ట్రాట్స్కీబృందాన్ని బహిష్కరించడం జరిగింది. ఆ తర్వాత పార్టీనుంచే ఉద్వాసనచెప్పారు. మరికొంతకాలానికి కోమింటర్న్‌నుంచి గెంటివేశారు. చివరికి ట్రాట్స్కీ 1938లో 'నాలుగోఇంటర్నేషనల్' స్థాపించుకొనేంతదాకా వెళ్లాడు. ప్రపంచ కార్మికోద్యమాన్ని పెడదారిపట్టించి కొన్నిప్రాంతాల్లో అపరిణతమైన విప్లవకార్యాచరణద్వారా ఆత్మవినాశం కలిగించేందుకే ఎక్కువగా పనికివచ్చింది.

చైనావిషయంలో కోమింటర్న్ అనుసరించిన వైఖరిని ప్రస్తావించక తప్పదు. లెనిన్ హయాములో కోమింటాంగ్‌పార్టీతో స్నేహసంబంధాలేర్పడ్డాయి. అది కేవలం రాజకీయపార్టీకాదనీ, అనేక రాజకీయబృందాల సమాఖ్యలాంటిదనీ, చైనా కమ్యూనిస్టులు అందులోచేరి పనిచేస్తూ సామ్రాజ్యవాదానికీ భూస్వామ్యానికీ సైనికనియంతలకూ వ్యతిరేకంగా దాన్ని వినియోగించుకోవచ్చుననీ ఆదేశించారు. డాక్టర్ సన్యట్ సెన్ మరణంతర్వాత కొంతకాలానికి కోమింటాంగ్‌లో విభేదాలేర్పడి మితవాద బృందానికి చాంగ్ కై షెక్, వామపక్షానికి వాంగ్ చిన్ వై నాయకులై ఒకరు

నాంకింగ్‌లో మరొకరు వూహాన్‌లో పోటీప్రభుత్వాలు నడపసాగారు. ఈ వామపక్షం తోటి చేతులుకలిపి పనిచేస్తూ తమ ఆధీనంలోని ప్రాంతాలలో భూస్వామ్య వ్యతిరేక కార్యక్రమాన్ని నిర్వహించవలసిందిగా కోమింటర్న్ సలహాదార్లు చైనా కమ్యూనిస్టులను మరీమరీ కోరసాగారు. అయితే చాలాకొద్దికాలంలోనే వాంగ్ రూపంకూడా బైట పడింది. తనప్రత్యర్థి చాంగ్‌తోరాజీపడి అతడు కమ్యూనిస్టుల మీదికి ధ్వజమెత్తడం తోటి కోమింటర్న్ సలహాదార్లు చైనానుంచి బిచాణాఎత్తి బతుకుజీవుడాఅని పారిపో వలసి వచ్చింది. వలస, అర్థవలస దేశాలలో బూర్జువావర్గంలోని అతివాద విభాగాన్ని కూడా నమ్మకూడదనే నిర్ణయానికి వచ్చేందుకు చైనాఘటనలు కోమింటర్న్‌ను ఒక కొసకు నెట్టాయి.

ప్రపంచ పెట్టుబడిదారీవ్యవస్థ 1924 మొదలు ఒక ఐదేళ్ళపాటు కాలు నిల దొక్కుకుని స్థిరపడినట్లే కనిపించి, 1929లో ఘోరమైన సంక్షోభంలో పడింది. దీనినుంచి ఒడ్డునపడేందుకు సామ్రాజ్యవాదదేశాలు మార్కెట్లకోసం తీవ్రంగా పోటీ పడసాగాయి. అంతక్రితం గుట్టలుగాపడివున్న ఉత్పత్తివస్తువులనూ ధాన్యాన్నీ ముడి సరుకునూ వెలబుచ్చడం గగనమైంది. గిరాకీపడిపోయింది. ధనంవిలువ పాతాళం చేరుకుంది. బతుకు దినదినగండంగామారి కార్మికులూ తదితర పీడితప్రజలూ సమ్మె పోరాటాలకు దిగారు. జాతీయ విమోచనోద్యమాలకు మరోవూపువచ్చింది. మితవాద సోషల్-డెమోక్రాట్లు పెట్టుబడిదారీవ్యవస్థ అంగరక్షకులన్నట్టుగా వ్యవహరిస్తూ సమ్మె పోరాటాలమీద చన్నీళ్లు కుమ్మరించారు. అందుచేత కోమింటర్న్‌లో ఈ వర్గద్రోహు లంటే అరికాలిమంట నెత్తికెక్కింది. సోషల్-డెమోక్రసీకి సోషల్-ఫాసిజానికీమధ్య భేదమేదీలేదన్నట్టుగా, నాయకత్వాన్నీ అనుచరవర్గాన్నీ విడివిడిగాచూడలేని అతివాద వైఖరి తలెత్తింది. బూర్జువా ప్రజాస్వామ్యానికిసైతం తలకొరివిపెట్టే విప్లవ ప్రతీ ఘాతుక పరమ మతవాద తత్వంనుంచీ ఫాసిజం పుట్టుకొస్తుందని వివేచించకుండా బూర్జువా ప్రజాస్వామ్యాన్నీ ఫాసిజాన్నీ ఒకేదాట కట్టివెయ్యడం జరిగింగి. పాశ్చాత్య దేశాలలో శ్రామికవర్గవిప్లవం గర్భస్రావంచెందిన ఫలితంగానే ఫాసిజం ఏర్పడింది. 1933లో హిట్లర్ అధికారానికి వచ్చాడు.

ఎంతోకాలంగా క్లారాజెట్కిన్‌వంటి జర్మన్ కమ్యూనిస్టు నాయకులు ఫాసిజం ప్రమాదం గురించి హెచ్చరిస్తూ ఐక్యసంఘటన అవసరం విషయమై చెవినిల్లుగట్టు కుని పోరుపెడుతూ వచ్చారు. సంకుచిత విధానాలతో ఒంటెత్తు పోకడలతో ఆదేశాల కమ్యూనిస్టుపార్టీలు జిగొవియేవ్‌హయాములో విశాలప్రాతిపదికమీద ఫాసిస్టు-వ్యతి రేక, యుద్ధ-వ్యతిరేక ప్రజాసంఘటనను నిర్మించేవిషయంలో దారుణమైన అశ్రద్ధ

ప్రదర్శించాయి. 1935 లో ప్రారంభమైన కోమింటర్న్ ఐదవ సమావేశం ఈ విషయంలో గొప్పమార్పు కలిగించింది. డిమిట్రోవ్ రిపోర్టు ఆధారంగా, ఐక్య సంఘటనకు ప్రాణంవచ్చింది. అన్ని రంగాలలోనూ కమ్యూనిస్టులు ప్రజలతోనూ ప్రజాసంఘాలతోనూ ఫాసిస్టేతర రాజకీయ పక్షాలతోనూ వ్యక్తులతోనూ చేతులుకలుపుతూ పైరెండు ప్రమాదాలకు వ్యతిరేకంగా పోరాటాలకు నాయకత్వం వహించాలని డిమిట్రోవ్ పిలుపిచ్చాడు. వలస అర్ధవలస దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంఘటన నిర్మించాలని కోరాడు. మనదేశానికి సంబంధించి రజనీపామీదత్, బెన్‌బ్రాడ్లీ ఈ విధానానికి నిర్దిష్టరూపం కల్పించారు.

రెండో ప్రపంచయుద్ధం మొదలై (1939) నాలుగేళ్లు గడిచేదాకా ఈ విధానాన్నే కోమింటర్న్ ప్రధానంగా అనుకరించింది. సోవియట్ యూనియన్ మీద హిటలర్ దండయాత్ర మొదలయ్యాక మాత్రం, సోవియట్ యూనియన్ సంరక్షణే ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం తాలూకు అంతర్జాతీయబాధ్యత అనే అవగాహనవల్ల, సామ్రాజ్యవాదయుద్ధ మంటూ వచ్చినాదాన్ని హఠాత్తుగా ప్రజాయుద్ధ మనడం మొదలైంది. మనదేశంలో ప్రజాయుద్ధ నినాదం కమ్యూనిస్టుపార్టీని ఎలా జాతీయోద్యమంనుంచి దూరంచేసి దుష్ఫలితాలు కలిగించిందో అందరికీ తెలిసిందే.

ఆనాటికి వివిధదేశాల కమ్యూనిస్టుపార్టీలు నిర్మాణపరంగానూ సిద్ధాంతపరంగానూ శిశుదశనుదాటి వర్గపోరాటక్రమంలో అనుభవసంపదను పెంచుకోగలిగాయి. కమ్యూనిస్టుపార్టీల నిర్మాణానికి ప్రపంచ వ్యాప్తంగాతోడ్పడి వాటి తప్పటడుగులను దిద్దుతూ పైకితీసుకువచ్చే లక్ష్యంతోనే 1919 లో కోమింటర్న్ ఏర్పడింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి సైన్యాధిపత్యం వహించి పాతికేళ్ళపాటు నడిపించింది. ఏదేశం సమస్యలు ఆదేశపు కమ్యూనిస్టుపార్టీకి తెలిసేంత సూక్ష్మంగా కోమింటర్న్ నాయకత్వానికి తెలిసే అవకాశాలు రోజురోజుకీ తక్కువ కాసాగాయి. కమ్యూనిస్టు పార్టీలు ఇకముందు తమంతతాముగా వ్యవహరించే ప్రాజ్ఞత వచ్చిందని అభిప్రాయపడడంతోటి, 1943 జూన్‌లో కోమింటర్న్‌ను అంతర్జాతీయ కేంద్రంగా రద్దుచేసినట్టు ప్రకటించడం జరిగింది. ఇందుమూలంగా కమ్యూనిస్టుపార్టీల బరువుబాధ్యతలు పెరిగాయి. సోవియట్‌రష్యా కమ్యూనిస్టుపార్టీ సమకూరుస్తూ వచ్చిన నాయకత్వం, దానికి లభిస్తూవచ్చిన ప్రాముఖ్యం రాత్రికిరాత్రే అంతరించాయని అర్థంకాదు. యుద్ధానంతరకాలంలో 'కమ్యూనిస్టు ఇన్‌ఫర్మేషన్ బ్యూరో' (కోమిన్‌ఫార్మ్) పేరుతో ఒకసంస్థ నాలుగేళ్ళు పనిచేసింది. అంతర్జాతీయసంస్థ ఏదీ లేకున్నా, పెట్టుబడిదారీ వ్యవస్థను పునరుద్ధరించి లెనిన్-స్టాలిన్‌ల సోషలిస్టు నిర్మాణాన్ని తల్లకిందుచేసి సామ్రాజ్యవాద పంథా తొక్కేవరకూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీదే అగ్రతాంబూలం.

# కథాయజ్ఞం - కా.రా. - రంగనాయకమ్మ

గరికిపాటి నిరంజనరావు

1. "కథాయజ్ఞం - కాళీపట్నం రామారావు కథలపై యజ్ఞం అనుబంధంగా చర్చా వ్యాసాలు". సంపాదకులు : చేకూరిరామారావు, ప్రతులకు : హైద్రాబాద్ బుక్ ట్రస్ట్, 3-6-694, హిమయత్‌నగర్, హైద్రాబాద్ - 500029 పేజీలు xvi + 175 + 39, వెల 10.00.

2. "యజ్ఞం కథమీద 2 వ్యాసాలు" - రంగనాయకమ్మ, ప్రతులకు: అరుణా పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ - 520002. పేజీలు 135, ధర : 4-00

సంపాదకీయాన్ని మినహాయిస్తే 'కథాయజ్ఞం'లో ఒక సమీక్షవ్యాసం ఆంగ్లంలోనూ ఇరవైవ్యాసాలు తెలుగులోనూ వున్నాయి. ఇవిగాక కాళీపట్నం రామారావుగారి రచనల గూర్చి ఒకపట్టిక, యజ్ఞం కథ అనుబంధంగానూ చేర్చబడ్డాయి. రెండు, మూడు వ్యాసాలు మినహాయించి రామారావు కథలమీద అక్కడక్కడా విమర్శలతోపాటు ఎక్కువగా ప్రశంసాత్మకంగా రాసిన వ్యాసాలే ఎక్కువ. అయితే రంగనాయకమ్మ గారి యజ్ఞంమీద తీవ్రమైన విమర్శే చేశారు. అదే వ్యాసంతోపాటు మరో వ్యాసం రాసి "యజ్ఞం కథమీద 2 వ్యాసాలు" ప్రచురించారు.

సమీక్ష అంటే పుస్తకంలోని ముఖ్యాంశాలని చేర్చివేసి క్లుప్తంగా చెప్పడం అనుకుంటాను. అయితే ఈ సమీక్ష క్లుప్తంలో వీలుపడలేదు. కారణం దాదాపు రెండుడజన్ల వ్యాసాల్ని సమీక్షించడానికి సాహసించడమే. అయినా అందరిపేర్లూ, అభిప్రాయాలూ ఈ సమీక్షలోకి చేర్చబడలేదు. ప్రతివారి అభిప్రాయమూ స్పృశిస్తూ పోతే పాఠకులకి విసుగుకల్గుతుంది. అంచేత వ్యాసకర్తల్నిగాక వారు ఎంచిన అంశాల్ని, వేసిన ప్రశ్నల్ని ఎన్నుకొని సమీక్షించాను అంచేతనే రంగనాయకమ్మగారి విమర్శకే ఎక్కువ చోటుయివ్వాల్సివచ్చింది.

రామారావుగారూ, రంగనాయకమ్మగారూ యిద్దరూ నా అభిమాన రచయితలే. అయినా నా అభిమానాన్ని ప్రక్కకితోసి నాకు సబబయిన అంశాల్ని సమర్థిస్తూ, విభేదించిన చోట విమర్శకి దిగాను. ఈ విమర్శ ఒక్కొక్కప్పుడు కొంచెం తీవ్రంగావుంటే వాదనలోవున్న తీవ్రతే తప్ప రచయితలుగా వారిమీదవున్న నా అభిమానం తగ్గికాదు.

## మొదటి భాగం : ఇతర కథలు

మా గోఖలే తర్వాత "అడుగుతరగతి బడుగు జీవితాల్ని" గూర్చి రాసిన వారిలో కాళీపట్నం రామారావు (కా.రా.) గారికి అత్యంత ప్రముఖ స్థానంవుంది. కా. రా. కథ చెప్పేపద్ధతీ, భాషా, గ్రామీణ జీవితంలో పేదల - ముఖ్యంగా హరిజనుల- నిస్సారమైన అతుకుల బతుకుల చిత్రిణా నేటి యువరచయితల్లో కొంతమందికి ఒక ఒరవడి ఏర్పరిచాయి. 'రామారావు స్కూల్' ఏర్పడిన మాట నిజం (ఉదాహరణకి అక్కినేని కుటుంబరావుగారి 'సౌరాజ్జం', బొల్లిముంత నాగేశ్వరరావుగారి కథలు).

వివినమూర్తి అంటారు : "అస్పష్టమైన భావాలతో ఆరాటం నిండిన జనం తోనే ఆయన మాట్లాడుతారు. వారిభావాలకు స్పష్టతనీయడం, వారి ఆరాటాన్ని పోరాట శక్తిగా మలచటం ఆయన కార్యక్రమం" (కథాయజ్ఞం, పే. 5) చాలా కథల్లో ఈ కార్యక్రమం వుంది, కాని అన్ని కథల్లోనూవుందా ? అనుమానమే.

కా.రా. ఒక్కొక్క కథలో ఒక్కొక్క ప్రాథమిక ప్రశ్నని ఆవిష్కరిస్తాడంటూ, 'ఆర్తి'లో మాత్రం ప్రశ్నలున్నా ఏదిప్రధానమైన ప్రశ్నఅనేది చెప్పటం కష్టమంటారు సూరపరాజు రాధాకృష్ణమూర్తిగారు. "ఈ కథలో ప్రశ్నని నిరూపించడం కంటే మాలల నికృష్ట జీవితాన్ని అద్దంపట్టడమే ప్రధాన మనిపిస్తుంది" (పే. 17) అవునా? స్థూలంగా చూస్తే అవుననిపిస్తుంది. కాని శ్రీపతిగారన్నట్లు, "సన్నెమ్మని ఒక పని ముట్టుగా వాడుకోవటానికి తల్లి ఎర్రెమ్మా అత్తబంగారి ఘర్షణపడ్డారు. కూలిసంపా దించే జంతువును చేయగల దుష్టవ్యవస్థ మనది." (పే. 84).

ఇంతేగాక వ్యాసకర్తలు రాయని విషయం ఒకటుంది. యజ్ఞం కథలో వున్నంత విస్తృతంగా లేకపోయినా 'ఆర్తి' కథలో కూడా పేదకుటుంబాల ఆర్థిక చరిత్ర చెప్పా రాయన. కా.రా. గతరెండు దశాబ్దాల్లో రాసిన కథల్లో అక్కడక్కడా ఈ ఆర్థిక క్రమాన్ని గూర్చి, మార్పునుగూర్చి కుటుంబాల పతనాన్నిగూర్చి వివరిస్తూవుంటారు. బహుశా పేదరికం మీద తెలుగులో కథలురాసే వారందరికంటే కా.రా. కథలు భిన్నంగా వుండటానికి కారణం ఈ అంశమయివుంటుంది.

## ఆర్థిక చరిత్ర - సమస్యలు

"బంగారమ్మ కాపరానికి వచ్చిన యేడాదికి వాళ్ళత్త వేర్లుపెట్టింది. ఐదారు బస్తాలు పడ్డుపండేపొలం, వేస్తే నాలుగుబస్తాలు వేరుశెనగయ్యే మెట్టభూఁవీ - వీళ్ళ

వాటాకివచ్చేయి. రెక్కలు కష్టంచేసుకునే యిద్దరు పడుచువాళ్ళు తిండితప్పిస్తే గుడ్డ కూడా దర్జాకింత జమకట్టే కూలిబతుకు. బతుకుతోసుకుపోడానికి సరిపోతుండేది. తర్వాత వాళ్ళ కుటుంబం పెరిగింది. యింతలో యుద్ధం వచ్చింది. పంటలెప్పట్లానే పండుతూ యెండుతూ వుండినా, ధరలు పెరగటం సరుకులు దాచడం, బ్లాక్‌మార్కెట్టూ కొత్త గాదిగాయి. ఆవస్తువులే వూర్లోకొచ్చేసరికి వాటిధరలు విపరీతంగా ఎదిగాయి. జనానికి అప్పులుచేయకా తప్పలేదు; అవి తీరేదాకా భూఁవులమ్మకా తప్పలేదు. ఆ విధంగా వెనకటిరాజ్జంలో చాలామంది పేదవాళ్ళ భూఁవుల్తోపాటు వాళ్ళ భూఁవులు చెల్లిపోయాయి. మాలలకి వుద్యోగాలు, మాలలకియిళ్ళు, మాలలకే బంజర్లన్నీ అన్నారు కామందులు".

"అనడం, ఇనడఁవే తప్ప యేబంజరువాడికెళ్తే ఆబంజరుకాడే నిలబడేవాళ్ళు కాపు నాయుళ్ళు. ఎట్టకేలకు వూరికి ఆవడదూరాన్నుందేవీ, రాళ్ళు పాషాణాలతో ఆ బండలుపిండిచేస్తేతప్ప సాగుకి కొరగానివీ, అక్కడొకటీ యిక్కడొకటీ చిన్నచిన్న ముక్కలు తప్పితే మాలలకి దక్కిందిలేదు" (యజ్ఞం ఇతర కథలు- (ఆర్తి) పే. 105). ఇలా హరిజన పేదరైతాంగం ఎలా పతనమయిందో క్లుప్తంగా చెప్తారు కా.రా. అయితే బంగారి కుటుంబంలోవున్న ప్రత్యేక సమస్య ఏవిఁటి?

"ముందులేనిదానికోసం ఇప్పుడు ప్రయత్నించను. ఇప్పుడున్నదాన్ని ప్రాణాలు పోయినా వదిలిపెట్టను" అని గట్టిగా తీర్మానించుకుంది (బంగారి). ఆమె హయాంలో పూచికపుల్ల బయటికిపోలేదు.... ఇలాంటి నిష్టలు నెరపలులేని తక్కిన మాలలు వాళ్ళ రాజ్యం వస్తోందనినమ్మి, చెంబూగిన్నే అమ్మి చెమటోడ్చి బంజరుసాగుకు తెచ్చారు. అందుకైనమదుపుకింద అవిచెల్లిపోయాయి.... అప్పుతెస్తే అందరి బంజెర్లనాగే అవీ పోద్దని బంగారిబయం. అందుకని గడించడానికి బయలెల్లినాడు పైడియ్య.

"పద్దరాత్రి ఇవి నిలబడ్డానికి రోజులుకావు బతకడఁవే కష్టంగున్న రోజులు. కలో గంజోదాగి యిక్కడే పడందామంటాడు నారాయుడు. కోటయ్య, పైడియ్య ఒప్పు కోరు. మనదేఁటి యెకరాలొరకట్టేఁనావా: గరిశలపండిస్తున్నాఁవా. కూల్లుపడిపోతున్నాయి కాని కాలఁవొస్తే కలోగంజోతాగి పానాలునిలుపుకోడానికి ఆ మాత్రం ఓసెక్కుంటే అందరం కాకపోతే కొందరవైనా బతకవాఁ అంటారు" (యజ్ఞం ఇతర కథలు పే. 152) ఇదొక భూదాహానికి సంబంధించిన ప్రశ్న.

మరోప్రశ్నవుంది : అదే పతనంఅవుతున్న వ్యవసాయకూలీల ఆర్థికపరిస్థితి. బారిక రామయ్యకోడలు ఈ సమస్యని బాగావ్యక్తీకరించ గలిగింది.

"తింటన్నాం. కనపడ్డం నేదా? మర్చిపోతన్నావు, నీకొడుకేవున్నాడు. ఎనిమిదేళ్ళయి యెంకటాద్రియుడుకాడ కంబారిగున్నాడు. మొదటినాలుగేళ్ళు ఏంతిన్నగిచ్చినారు, జీతాలిచ్చినారు. మరుసటేడాది, "యిదిగోరేపు", "అదిగోమాపు", "అవాసొస్తంది", 'పున్నపెల్లనీ' అని అప్పుడో యిద్దుం అప్పుడో మిత్తుంసొప్పిన ఆర్నెల్లు జీతం కొలిసేతలిగి గగనమై పోనాది. ఉన్నజీతం వచ్చేపంటలకన్నారు. ఆ యేడాది పంటలు పోనాయన్నారు. పంటలుపోనేదు అలబతుకులూపోనేదు. మాడిపోతున్నాదని కాళ్లాయేళ్లాపడితే, మూణ్ణెల్ల జీతాలుకొలిసి "యిప్పటికింతే" అన్నారు. ఇప్పుడు రెండేళ్ళయి పంటలుపోతన్నాయి. అసలొక్కగింజకూలిస్తే ఒట్టు గట్టిగాఅడిగితే తంతారని బయ్యం."

"అదుపుకిపాటుబడ్డం ఎందుకుమానీరాదా అంతే మానీస్తే మొదటికీమోసం రాదా, ఎప్పుడోపండితే బాకీజీతాలు కొలుస్తారేమో, అంటాడు నీకొడుకు". (యజ్ఞం ఇతరకథలు — (ఆర్తి) పే. 121)

ఇలావెతుక్కుంటూపోతే తీవ్రమైన ప్రశ్నలేఎదురవుతాయి. భూదాహం, నిరుద్యోగం, చెల్లవేయనిజీతాలబాకీలు, వూహించలేని పేదరికం, సాంప్రదాయక పంచాయితీలు, కులపెత్తనం ఒకటా? దేనికదేప్రధానసమస్య.

## పైడియ్యా : తిరగబాటూ

రంగనాయకమ్మ పైడియ్యని ఒక తిరగబాటుదారునిగావూహించో లేక రచయిత అలా నిర్దేశించారనుకునో విమర్శించారు. పైడియ్య తిరగబాటుదారుడా? "మోచేతి కూడు వెలపరిస్తే" చెయ్యికడిగేసుకోవటం తిరగబాటుకి సంకేతమవుతుందా? నిరుపేద ఎర్రెమ్మకి నాయురాలుపెట్టిన "మోచేతికూడు" తినడానికి అభ్యంతరం లేకపోయినా, అప్పుసప్పుచేయక ఆత్మాభిమానంతో పేదకుటుంబాన్ని లాక్కొచ్చిన బంగారికొడుకుగా, పట్నంవెళ్ళి కూలిపనిచేసికొంటూ కొంతనాగరికత ఒంటబట్టించుకున్న అయినా పైడియ్య స్వామి-సేవక సంబంధాలనుండి వేతనకార్మికుడిగా మారే దశ అది. అంచేతనే అతనికి 'మోచేతికూడు' వెలపరించి ఇందులో 'తిరగబాటు' అనదగినంత మార్పేముంది? పైడియ్య నిజంగా తిరగబాటుదారుడే అయితే తన వ్యక్తిగతసమస్య బజారుపాలయినా, వాణెమ్మలా అపర్నాయుడి "పెద్దమనిషి" తీర్పుకి తల ఒగ్గివుండేవాడుకాదు. పట్నంవెళ్ళినా సామూహికవిషయాల్లోగాని మానసికంగా గాని పైడియ్య ఎదగలేకపోయాడు. పైడియ్య ఒక అర్భకుడు. అంచేతనే అన్న

కోటయ్యవిసుక్కొని తమ్మునిసమస్యను పరిష్కారంతేబోయి తగువునిపెద్దదిచేశాడు. అర్భకుడుగాకపోతే చేసికొన్నభార్యని "మాపిటికి తవిటప్పగారింటికొస్తావా" అని నీళ్ళునిండినకళ్ళతో అడగడు. అర్భకుడుగాకపోతే గంగమ్మతో,

"ఇప్పుడైనా నాన్నిన్ను అడక్కపోదును.... రాత్రి నాకొచ్చినతలపులు తలుసుకుంటే, నాకేజడుపు పుడుతోంది. ఏరోజో ఎప్పుడేంచేస్తానో- అనిబెంగ గుంది. ఆపైన నీదయ నా అదురుష్టం" అంటూ వెర్రినాగమ్మలా బీదరుపులు అరవడు. వాస్తవంగా పైడియ్యది ఒక వాజెమ్మపాత్ర. అతన్నొక తిరగబాటుదారుడనడం వింతగావుంది :

పైడియ్యకున్న సమస్యనిగూర్చిరాస్తూ, రంగనాయకమ్మ, "అయ్యో అతనికి ఆడమనిషి దొరకడంలేదే అనిపాఠకులు సానుభూతిచెందాలని రచయిత అభిప్రాయం" అంటూ ఓ నర్మగర్భితమైన విసురు విసిరారు (?వ్యాసాలు పే 123). వినాదంతో వచ్చిన గడుసువాదమో లేక ఆమె నిజంగా యిలానమ్మే వ్రాసారో తెలియదుగాని ఇది రామారావుగారిమీద అన్యాయంగా మోపినఆరోపణ.

"పట్నంలోవున్నసిరి యిక్కడేమయింది? ఇక్కడ ఆడవాళ్ళకోసం ప్రయత్నించినవాడు అక్కడ నీతిగా ఎలావున్నాడు" అని రంగనాయకమ్మగారి ప్రశ్న. ఎలావున్నాడంటే ఏం చెప్పటం? ఇంతకీ రంగనాయకమ్మగారి ప్రశ్నకి పైడియ్యే మంటాడో విందాం. పైడియ్యేమంటాడంటే-

"ఇరుగమ్మకో పొరుగమ్మకో పాటుబడితే ఇల్లిరగతీయాల. కన్నెపిల్లని సెరిపితే కలకాలం గుసుసురు తగుల్తాది. మరింత రోష్టోరి మనుషులున్నారు. ఆలజోలికెల్తే, ఆసుపత్రికి పోవడంసరేసరి". చివర్న పైడియ్యే మాటంటాడు. "పస్లోకెల్లకుండా పదిరోజులుంటే కూల్డబ్బులమాటేటి?" (....అర్తి పే. 129) అడ్డదారినిపోయి అవసరం తీర్చుకుందామనుకున్నా 'కూలిడబ్బు'ల సంగతి గుర్తుకుతెచ్చుకునే మనిషి పైడియ్య! ఇతను తిరగబాటుదారుడా!

రంగనాయకమ్మగారు ఒకటనొచ్చు. "అయితే, యిన్నికబుర్లు చెప్పినవాడు దాపిశరామయ్య కోడలు మీద మనసుపడ్డాడేం?" పాత్రచేసింది రైటాతప్పా అనే వాదన అలా వుంచి, పైడియ్య మామూలుసగటు మనిషి అని గుర్తించుకుంటే వాడు చేసిన పనిని అర్థంచేసుకోవచ్చు. ఇక్కడ తిరుగుబాటుతనానికీ, లొంగబోతుతనానికీ మధ్య వుందనుకుంటున్న వైరుధ్యం ఏమీలేదు. ఎందుకంటే మొదటిది పైడియ్యలో

లేదు. రెండోది వాడికి చాతకానేదు! పోతే బారిక రామయ్య కోడలు సంగతి? మూడు నెలలుగా ఆడ పొందుకోసం అలమటిస్తున్న తాపంవాడిది; పైగా తనని చూసి ఆ పిల్ల మనసుపడిందని భ్రమించాడు.

'తిరగబాటుదారుడైన పైడియ్యని 'మంచిభర్త'గా ఎందుకు చిత్రించలేదని రంగనాయకమ్మగారి మరో ప్రశ్న. పైనరాసినట్లు పైడియ్య తిరగబాటుదారుడుగాదు: అన్ని బలహీనతలూవున్న సామాన్య మానవుడు. మాటవరసకి పైడియ్య తిరగబాటు దారుడేనని ఒప్పుకున్నా. ఈ బలహీనతని చూపిస్తే అందులో అసహజత్వంఏమీలేదు సెక్సు విషయంలో కొంతమంది "విప్లవ" నాయకులే పప్పులోకాలేస్తున్నారు. సామాన్య మానవుడైన పైడియ్య ఒకలెక్కా?

రంగనాయకమ్మ విమర్శల్లో చాలాభాగం "ఆపాత్ర అలా ఎందుకు మాట్లాడింది? అలా ఎందుకు చేసింది? ఇలా ఎందుకు మాట్లాళ్ళేదు? యిలా ఎందుకు చేయలేదు" అనే స్వీయాత్మక, సూత్రబద్ధ ధోరణిలో సాగింది. "తల్లినీ, అత్తనీ మందలించా ల్సింది? గంగమ్మని కోరడంవుండ కూడదు.... అతను భార్యమీదే యిష్టంతోటీ భార్య తోటి గడపాలనే ఆశతోటి వుండాలి. ఎంచేతనట? ఎందుచేతనంటే పైడియ్యది విప్లవపాత్ర గాబట్టి. మరి పైడియ్యది విప్లవపాత్ర కాకపోతేనో? బహుశా ఈ విమర్శకి చోటులేదేమో!

రామారావుగారి "సమర్థకు"లైన వ్యాసకర్తలుగూడా చాలాచోట్ల పాత్రల్లోలేని విప్లవం వుందనివాదించి రంగనాయకమ్మగార్ని ప్రేరేపించారు. "విప్లవం" "వ్యాడ లిజం" "సంధికాలం" "పెట్టుబడిదారీవిధానం" లాంటి భావనలను చాలవిరివిగావాడి అటుపాత్రలకీ యిటు కా. రా. గారికీ యిబ్బందికలిగించి, లేనివైరుధ్యాలువున్నాయనే వాదనలకు తావుచూపారు. రామారావుగారి సాధారణతాత్వికదృక్పథం మార్క్సిజమ్ గాబట్టి, కథానాయకులందరూ విప్లవకారులుగానో, విప్లవాన్ని కోరేవారుగానో వుండా లనుకునే సిద్ధాంతంసరిగాదు. రామారావుగారు విప్లవాన్ని కోరుతున్నారు. సందేహం లేదు. కాని ఆయన మరోమెట్టుపైనే వున్నారు. ప్రధానంగా ఆయన విప్లవాన్నికోరే కళాకారుడు. దీన్నిగూర్చి తర్వాత ప్రస్తావిస్తాను.

రామారావుగారి రచనల్లో "తప్పుల", "వైరుధ్యాల" పట్టిక తయారుచేయడంతో విమర్శకురాలుగా తమబాధ్యత తీరినట్లు రంగనాయకమ్మగారు భావిస్తున్నట్లున్నారు. ఈ తీవ్ర 'విమర్శ'నా ధోరణివల్లనే ఒక్కొక్కప్పుడు రంగనాయకమ్మ హాస్యాస్పదమైన వాదనలోకిదిగారు.

"ఆ గుడిసెలోవున్నదంతా మోచేతికూడేనా? ఆ గుడిసెలోవున్నది ఆ పేదల కష్టార్జితంగాదా? అదివారి స్వంత శ్రమఫలితంకాదా?" (2 వ్యాసాలు పే. 125).

'ఆర్తి' చివరిపేజీలో రామారావుగారు రాసిందేమిటి? అసలెందుకిలా రాసి వుంటారు? "అన్నంతినకపోతే ఆకలేస్తుంది. ఆ కూడు తినకపోతే వెలపరిస్తోంది. 'మోచేతికూడు' అని ఎంచితే ఎంచడానికి వీవిదేవుందా గుడిసెలో?" (....'ఆర్తి' పే 156) ఆ గుడిసెలోవున్నవన్నీ మోచేతికూడుబాపతనే అర్థంవస్తుందంటారు రంగ నాయకమ్మ. ఇంతకీ ఆ గుడిసెలో ఏమున్నాయి?

"అందులో గట్టివి నాల్గుండబొచ్చులేకాక రెండు సిలవరి గళాసులూ, ఒక చిల్లు పట్టిన సిలవరిచెంబూ, తాకట్టుకుపనికిరాని లొత్తల తపేళా, పైగా రెండుకంచా లున్నాయి." (....ఆర్తి పే 104)

ఇవీ కడుపేదరాలు ఎర్రెమ్మకున్న ఆస్తి! "ఎంచడానికి లేనిదేవుందాగుడిసెలో" అని కా.రా. అన్నారంటే ఎర్రెమ్మ కడుపేదరికాన్ని సూచిస్తున్నారేగాని, దాదాపు పనికిరాని ఆ ఆరువస్తువులూ ఎర్రెమ్మ కష్టార్జితమూ శ్రమఫలితమూగాక మోచేతికూటి బాపతు అని రాస్తున్నారనుకోవడమూ, ఆ అంశంమీద ఆయన్ని విమర్శించడమూ రంగనాయకమ్మ లాంటి మార్క్సిస్టు యోధురాలుకి తగదు. విమర్శ వేరు ఉపన్యాసం వేరు దురదృష్టవశాత్తూ రంగనాయకమ్మ రాతల్లో ఉపన్యాసధోరణి విమర్శని చాలాచోట్ల మింగేసింది!

మంచి వ్యాసాలు : నిశితపరిశీలనలు

'కథాయజ్ఞం'లో మంచి వ్యాసాలున్నాయి. ముఖ్యంగా కేతు విశ్వనాథరెడ్డి, రామమోహనరాయ్, పి. రామకృష్ణారెడ్డి, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, కె. వి. రమణారెడ్డిగారలు కా.రా. కథల్లోని సన్నివేశాలు ప్రస్తావించి పాఠకులకి ఎన్నో లోవెలుగులు చూపారు. చావు కథలో ముసలమ్మ చావువార్తవిని చెయ్యవలసిన తతంగంగూర్చి వాకబుచేస్తుంది నారెమ్మ. దినవారాల్నాడు తిళ్ళకనీ తాగుడుకనీ పదోపాతికో ఖర్చవుతుందని తెల్సుకొని నారెమ్మ అంటుంది:

"గోయిందా- నాసేతెండి కడియాలు గోయిందా" ఈ సందర్భం చర్చిస్తూ రామమోహనరాయ్ అంటారు:

"ఇక్కడింతా కన్నీళ్ళు రాకపోతే మనలో మానవత్వం యింకేమాత్రం మిగిలి వున్నట్టు?" (కథాయజ్ఞం పే. 42)

"నత్తానాంవా పిల్లలమీద పాపమన్న ముసిల్దాన్నొగ్గేసి తల్లీపలుగురూ తగలడాలా? కాదు- కడుపుజరక్క ఎల్లిన్నాడు ఒకళ్ళు ముందొస్తేటప్పా?". వెంకటాపురం నాయుడన్న ఈ మాటల్ని ఎత్తిచూపి రమణారెడ్డి గారంటారు:

"ఏరచయితకైనా ఎలా అందుతాయి యిలాంటివి? బాల్యస్మృతులు మనస్సులో గట్టిగా కాలూని వుండాలి.... ఒక 'అగ్రి'వర్ణస్థుడు ఉపనయనం ముందయినాసరే, సిమ్మాద్రి, దాలిపెంటిగాడు వంటి నత్తానాంవా పిల్లలతో దోస్తుకట్టగలడా?.... ఇదే రచయితగా కా.రా. అనన్యత" (కథాయజ్ఞం, పేజీలు: 54, 55). 'చావు' కథమీద చిలమకూరి రామబ్రహ్మం, సూరపరాజు రాధాకృష్ణమూర్తి సంయుక్తంగా రాసిన వ్యాసం పకడ్బందీగానేవుంది. "సమిష్టిచైతన్యం ఎలా కలుగుతుందో, ఎట్లాకలిగినప్పుడు అది నిజమైన సమిష్టిచైతన్యం అవుతుందో చూపుతాడు కా.రా." (కథాయజ్ఞం పే. 112). అయితే వీరువాడిన కొన్ని ఉపమానాల్ని రంగనాయకమ్మ చాలా తేలికగా ఎద్దేవా చేయగలిగారు; అయినా 'వీరిద్దరూ' చూపిన పరిశీలన కొంతబాగుంది.

"కా. రా. తనకథకు అవిద్యనే మూలంగా గ్రహించాడు. తనుచిత్రిస్తున్న వర్గంలోలేని చైతన్యాన్ని, ఆరోపించాడు. మౌఢ్యాన్ని దానికిమూలమైనశక్తుల్ని తప్పుపట్టడం సరికాదు. "ఒరేయ్ ఓరిసూరయ్యతాత! నిన్నుతిట్టనానికి నాకునోరాదు" అంటాడు అప్పారావు. మౌఢ్యంలో నిహితమైన ఆర్ద్రతను, శవసంస్కారంలోని మానవతను చివరివరకు నిర్వహించాడు కా రా". (కథాయజ్ఞం పే 115)

"దొంగ"తనమూ : తిరగబాటూ

"చావు"లాంటి గొప్పకథకూడా రంగనాయకమ్మగారి విమర్శకు గురయింది,

"కుర్రాళ్ళు దొంగతనంగా కట్టెతెచ్చి పేదముసలమ్మ శవాన్ని దహనంచెయ్యడంలో ఎవరికీ అభ్యంతరం వుండదు. కాని- ఆ పనిని తిరగబాటుగానో విప్లవసూచనగానో రచయిత చెప్పదలచుకున్నప్పుడే వస్తుంది చిక్కంతా. దొంగతనమే విప్లవం అయితే బందిపోటుదొంగలంతా చాలా విప్లవకారులే. చావులో కుర్రాళ్ళుచేసినపనిలో యింతకన్నా ప్రత్యేకతఏముంది?" (2 వ్యాసాలు, పేజీలు 116, 117)

'దొంగతనం' అనేమాటను ఈ సందర్భంలో "వర్గసమాజపు" విలువలతో ప్రయోగించినట్టుంది. ఏదిదొంగతనం? ఏదికాదు? ఎవరిదృష్టిలో దొంగతనం? ఎవరిదృష్టిలోకాదు? అప్పను, హరిజనేతరుల దృష్టిలో దొంగతనమే. రంగనాయకమ్మగారి దృష్టిలోకూడా యిది 'దొంగ'తనమేనా? వూడుస్తుడికట్టెలుతెచ్చి దహనంజరిపితే అది 'దొంగ'తనం అవుతుందా? ఈ సాంప్రదాయక నీతికొలతలు రంగనాయకమ్మగారు మాట్లాడటం విడ్డూరంగానేవుంది. 'దొంగ'తనాలుచేయకుండా, వర్గశత్రువు మీద దెబ్బకొట్టకుండా ఎవరుమాత్రం ఏ తిరుగుబాట్లు ఏ విప్లవాలు తీసుకురాగలరు? రంగనాయకమ్మగారి లక్ష్యం ప్రకారం 'దొంగ'లు విప్లవకారులుగానటైతే వర్గశత్రువు పనిపట్టేవాళ్ళుగూడా విప్లవకారులుగారు: కేవలం హంతకులే! అసలుతిరుగుబాటుతనం అంటే యేమిటో విప్లవంఅంటే ఏమిటో నిర్వచించో ప్రవచించో రంగనాయకమ్మ వాదనలోదిగితే ఈ అనవసరమైన గందరగోళమూ, చర్చా వుండేవికావేమో! రంగనాయకమ్మ విమర్శఅంతా యిది "తిరుగుబాటుకాదు.... యిది విప్లవంకాదు" అనేధోరణిలో వుంది. ఈ 'నేతి నేతి' ధోరణినుండి బయటకొచ్చి 'తిరుగుబాటునీ, విప్లవాన్నీ' నిర్దిష్టంగా నిర్వచించి విపులీకరించివుంటే అది కా. రా. కి యితరపాఠకులకీ ఆమె ఎంతో మేలుచేసివుండేవారు। దీన్నిగూర్చి తర్వాత మరోమారు ప్రస్తావిస్తాను.

'చాపు' కథనిగూర్చి పురాణం చక్కగావ్యాఖ్యానించారు. "ఇందులో మార్క్సిజం, సాంప్రదాయిక బానిసత్వంనుండి విముక్తికై తిరుగుబాటుసూచన, ఆలోచించేవాళ్ళ ఏపనీచెయ్యలేరనే పాలవెక్కిరింపూ అన్నీవున్నాయి" (కథాయజ్ఞం, పే 170).

భయం :

"మనిషిలోమార్పుకు అనుభవంకారణం అనేధోరణిలో సాగిన కథ 'భయం'. యెవరింట్లోపాముబట్టా మగాడల్లేదాని అంతుచూస్తూ ఊరందరికీ తనధైర్యంతో ఉపకారం చేసిన నోరులేనిశ్రమజీవి పాములసత్తెయ్య ఆ పాముకాటుకే గురైనప్పుడు సాయంపొందిన మనుష్యులు పట్టించుకోలేదు. మంత్రగాడు పోటీ విగడయిందనుకున్నాడు. సొమ్ముల గురవడు పిల్చినా సాయానికిరాలేదు. ఈ దారుణఅనుభవం సొమ్ములగురవడిలో మార్పుకుకారణమైంది" అంటారు కేతు విశ్వనాథరెడ్డి (కథాయజ్ఞం పే. 37)

"భయం"లాంటి శ్లేషరచనలు పొర(క్రిందపొరలా పెయింటింగ్‌ని మూసిన పెయింటింగ్‌లా పడుస్తాయి. ఇవి రచయిత యిచ్చిన క్లూ ప్రకారం చదివితే, స్విచ్

సమీక్షా వ్యాసం ;

# ఎర్రటి బాటల్లో వెన్నెల నవ్వులు
## కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ పోరాట పాటలు

జె. సి.

కరీంనగర్ జిల్లాలోని రైతులప్రపంచం, అంతకంటె ఎక్కువగా ఆదిలాబాదు గోండ్లప్రపంచం, నిన్న మొన్నటిదాకా వాడుకవిలువల ప్రపంచం. ప్రకృతి, భూమి, వాటిఒడిలో పసిపిల్లల్లాగ ఆటపాటల్తో పూవుపూసినంత సహజంగా, మేఘం గర్జించినంత గంభీరంగా, పులి పంజావిప్పినంత మెలకువగా, బండరాళ్ళను పిండిగొట్టినంత బలంతో, నాటినవిత్తనం మొక్కైపూలుపూసి కాసి శ్రమఫలాన్ని అందించినంత ఓపికతో, వెన్నెల్లాంటి ఆశలతో నిన్నటి బాధల్నిమరచి, సంతోషాన్నేరుకుని, నేటి శ్రమఫలంతో సేళవించి రేపుగురించిన చింతలేకుండా బతికినవాళ్ళు వారు. వెట్టి, మిత్తీలు, కౌళ్ళు, పెచ్చులరూపంలో తమశ్రమశక్తి సృష్టించిన అదనపువిలువ అనంతంగా దోచుకోబడ్డా తనకుమిగిలిన సమయంలో తనకిష్టంవచ్చినరీతిలో పొలంపై

---

వెయ్యడంతోనే మొత్తం పరిసరాలన్నీ కొత్తకాంతితో మునిగిపోయే మరోప్రపంచమేమో ననిపించేటట్లు రచన దానిపరిమితి పరిధినిదాటి విశాలమైనఅర్థాన్ని అందించుతుంది. ఈ కోణంనుంచి 'భయం' కథని పరిశీలించినప్పుడు రామారావుగారు ఈ రచనలో పూర్తిగావిజయం సాధించలేదేమోనన్పిస్తుంది "ఇందులో స్మగుల్ చెయ్యటానికి వుపయోగించిన బయటికథ వెలుగులోకివచ్చినట్టు దానికి అంతర్లీనంగానడిచే అసలుకథ రాలేదు" అంటారు పి. నాగభూషణం (కథాయజ్ఞం పే. 88, 89).

జీవధార :

"తిరగబడకపోతే గంజినీళ్ళేకాక మంచినీళ్ళుకూడా దొరకవని నిరూపించినకథ జీవధార. జీవితంలో అన్నీఅమరినవాడికి లేదా అన్నీ అమర్చుకునే అవకాశాలున్నవాడికీ శాంతికావాలి. వాడివునికికీ, యథాతథస్థితికి శాంతిఅవసరం. రెక్కాడితేగాని డొక్కాడని మిల్లుకూలీకి జీవితంలో నిత్యంఅశాంతే. దోపిడీ కొనసాగాలంటే శాంతి జపంచెయ్యాలి." అంటారు చలసాని ప్రసాదరావు (కథాయజ్ఞం పేజీలు 62, 63).

ఈ మంచిపుస్తకాన్ని వెలుగులోకితెచ్చిన ఎ. జి. ఆఫీసు తెలుగుసాహితీసంస్థ "రంజని" ముఖ్యంగా కె. కె. మీనన్‌గారూ, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ నిర్వాహకులూ, ముఖ్యంగా చేకూరి రామారావుగారూ అభినందనీయులు.

(వచ్చే సంచికలో 'యజ్ఞం' మీద నిరంజనరావుగారి చర్చావ్యాసం ప్రచురించబడుతుంది)

అడవిలో తనవాళ్ళకోసం కష్టించేఅవకాశం ఆ రైతుకు ఆనందాన్ని, ఆరోగ్యాన్ని, స్వేచ్ఛనుయిచ్చేది. తనవల్లనే భూస్వామి ధనికుడౌతున్నాడు అన్న స్పృహ ఉండేది కాదు. ఆ జ్ఞానం కల్గకుండా అతడు సృష్టించిన అదనపువిలువనుంచి పెద్దపెద్ద బంగళాలు, గడీలు, గుళ్ళ గోపురాలు, దేవుళ్ళ- దెయ్యాలు, నీతిసూత్రాలు, స్వర్గనరకాలు, వేదాంతాన్నిసృష్టించి పాలకవర్గం తనపబ్బంగడుపుకొనేది. వీటన్నిటినీ చూపించి వీటిని మేముసృష్టించాం చూడండంటూ శ్రమశక్తులకుచూపి, వారికళ్ళు జిగేల్మనేట్లుచేసి వారిని నిరంతరంగా భ్రమలో, మౌఢ్యంలోఉంచే ప్రయత్నం చేసేవారు. దాంట్లో చాలావరకు కృతార్థులయ్యారు. కాని మనిషి ఆలోచిస్తాడు. ఉత్పత్తిదాయకమైన శ్రమశక్తి అతణ్ణి భౌతికప్రపంచంగురించి, సమాజంగురించి ఆలోచించేటట్లు చేస్తుంది. అది గతితార్కికసూత్రం.

1947-51 మధ్యకాలంలో తెలంగాణాలో భూస్వామ్యదోపిడీకి వ్యతిరేకంగా జరిగిన రైతాంగ పోరాటం మధ్యాంతరంగా ఆపివేయబడ్డా గతితార్కిక చారిత్రిక భౌతికవాదపరంగా అత్యున్నత సామాజిక సంబంధంగా పోరాటం నక్సల్బరీ, శ్రీకాకుళాల్లో తిరిగిమొలకెత్తింది. ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లా పెరిగిపెద్దదవుతున్నది. తెలంగాణా పోరాటంలో కరీంనగర్ జిల్లా రైతులు కూడా పాల్గొన్నా ఆ పోరాటం చివరికంటా సాగకపోవడంవల్ల ఇప్పుడు అక్కడున్న పరిస్థితులు తెలంగాణా రైతాంగపోరాటానికి పూర్వం నెలకొనివున్న పరిస్థితులే. 36 ఏళ్ళ కాంగ్రెసుపాలన తర్వాత గూడా రైతాంగంపై దొరలదోపిడి మధ్యయుగపు దోపిడీకంటే కనహీనంగా ఉంది. అయితే తెలంగాణా పోరాటకాలానికి రైతుల్లోఉన్న స్పృహ, చైతన్యాలకంటె ఇప్పుడు వారిలో ఎక్కువ స్పృహ, చైతన్యం కల్గాయి. తమ సామాజిక సంబంధాల అనుభవంలోంచి కల్గిన ఈ స్పృహాచైతన్యాలు వారిపాటల్లో స్పష్టంగా, నిశితంగా కన్పిస్తాయి. వారి సామాజిక అనుభవానికి, చైతన్యానికి చేయూతనిచ్చి విముక్తి పోరాటంవైపు నడిపించడానిక్కి గతంలోని పోరాటానుభవం నుంచి నేర్చుకుని నిగ్గుదేరిన పార్టీకూడాఉంది.

పోరాట ప్రాంతాల్లో శ్రమజీవులు వారి సామాజికానుభవం నుంచి నేర్చుకున్న వ్యవస్థాపరమైన సత్యాలు దాదాపు అన్నిపాటల్లో కన్పిస్తాయి. మచ్చుకు: "కరినాగులం

జిల్లాలో" అన్న పాటలో రైతుగురించి కవి అంటాడు: "కోడికూత ఇనిలేసి/గుడిసె సుంచిపోతావు / పొద్దంతా పనిజేసి / నడిజాముకొత్తావు / పొడుగుసుంచి పొడుగు దాక / సుప్వీరాము ఎరుగవయ్య / ఎంతజేసి ఏమిఫలం / చాలినంతకూ డేది." విరామ మెరుగక భూస్వామికోసం కూలిచేసే రైతుకు తినడానికి తిండిలేదు. అతని పెద్ద కొడుకు ఆకలి అంటే తల్లి బువ్వగివ్వలేదని కసిరికొడ్తుంది. కాని ఆమెకు "కడుపు సుండి తన్నుకొవి / కండ్లపొంటి నీరచ్చె." ఆమె "ఒకపూట బువ్వకొరకు పాకులాట దప్పదాయె" అని వాపోతుంది. ఇది యిలా వుంటే "సావుకారి అప్పేమో / తడిసి మోపెడైతంది / ఎన్నేండ్లు పనిజేపిన / గింతనన్న సెల్లగాదు.... / ఎంతగసం ఈ బాధలు" అని వ్యథపడి చివరకు తమబతుకు మారటంకోసం రైతుకూలీ సంఘంల జేరి పోరాడితీరుతామని నిర్ణయించుకుంటుంది ఆరైతు భార్య. "తిరుగుబాటు" పాట ప్రశ్న జవాబు రీతిలో సాగుతుంది. "పుట్టపాక ఊరిలోని / అల్లరేమిటి రాజన్న." ప్రశ్న. "ఓడుపడ్డ పరంబోగు / నాది అంటడు దొరోడు," సమాధానం. "పుల్ల కుంటకట్టమీద / ....లొల్లి ఏమిటి రాజన్న," ప్రశ్న. "కూలిజాలని లోకులంతా / ఎక్కువడిగిరి రాధమ్మ / పనికి రామనిరి రాధమ్మ" జవాబు. "రామయ పల్లెలోన / సమ్మెలేమిటి రాజన్న" అని అడిగితే, "రామయపల్లె దొరగాడు / జీతమియడె రాధమ్మ / ఎట్టి అంటాడే రాధమ్మ" అని సమాధానం. "మాదిగోన్ని పీరిగాన్ని / ఎందుగ్గొట్టిండు దొరోడు" అన్న ప్రశ్నకు "మాదిగోల్లు ఎట్టి రామని / మర్లబడ్డరు వాళ్ళు" అందుకు కొట్టిండని జవాబు. ఇంకో పాటలో "బుద్ధిలేని ముసల్ది / ఒళ్ళె కంకేసుకుంటే" హద్దుపద్దులేకుండా తిడతాడు దొర. భూస్వామ్యవ్యవస్థలో యేజీవ నాధారం లేకుండా ఊళ్ళో కథలుచెప్పి కడుపునింపుకునే గోత్రాలోళ్ళు కథ జెప్పడం ప్రారంభిస్తే తనకు లంచమివ్వలేదని, తన పేరు తలపలేదని కరీము దొరోడు వాళ్ళను దొంగలనీ, ఊళ్ళో దొంగల భయముందనీ బెదిరిస్తాడు. "ఓదొరా!" పాటలోని దొర సామూహిక ఆస్తులయిన "గుట్టా గడ్డీ / గుత్తాబట్టీ / గుమ్మూలీల్లా" కట్టాడు. "అడ్డాపెచ్చూ / సెకాప్రివడ్డీ / రెండూకలిపి" అందర్నీ పీక్కుతిన్నాడు. ఎట్టివాడు రాలేదని "సింగిబింగి" ఆడ్తాడు. పోలీసుల్ని తీసుకొచ్చి సంఘం పెట్టిన వాళ్ళందరి కోసం ఇల్లుఇల్లు సోదాజేయిస్తాడు.

ముసుకులోల్ల ముకుందారెడ్డి భూస్వామిపై "జనంపాట" వింటే శ్రామజీవులు అదనపు విలువ పరాయీకరణ విషయంలో వచ్చిన వ్యవస్థాపరమైన మార్పుల్ని ఎంత బాగా అర్థంజేసుకున్నారో తెలుస్తుంది :

నీ ఆటలింకసాగయిరో ముసుకులోళ్ల
ముకుందారెడ్డీ
ఇనపు కన్నెర్రజేత్తివిరో ,,
నిజాం నాజిలకలిత్తివిరో ,,
వాళ్ళ కాళ్ళబట్టి పైకత్తివిరో ,,
గింజలబేంకు పెద్దయితివిరో ,,
నువు అప్లుఅసూలుజేత్తివిరో ,,
ఆ అప్లనేనువు పెప్పుకిత్తివిరో ,,
అప్తాపెప్పులు గడ్తివిరో ,,
పెప్పులుదిని పెద్దగయితివిరో ,,
కూడుజాలని కయికిలిగాల్లకు ,,
కుంచెడుజొన్నె ఇత్తివిరో ,,
అరె! బిందెడుఅద్లె ఇత్తివిరో ,,
పెప్పుకుపెప్పుగడ్తివిరో ,,
అప్పికి పావుశేరుదింటివిరో ,,
అడ్డీలు పెప్పులుగలిపితివిరో ,,
మాభూములన్నిగుంజు కుంటివిరో ,,
పనిసేసుకబతికే పేదోల్లను ,,
కయికిలికి నువుబిలిత్తివిరో ,,
పొద్దంతా పనిజెప్తివిరో ,,
బొక్కలు కలికలి జేత్తివిరో ,,
కయికిల్లెగబెడ్తివిరో ,,
అన్నాయెమని అరిసినోల్లను ,,
నెత్తురుకారంగ గొడ్తివిరో ,,
నువు పాపపుపనులెన్నోజేత్తివిరో ,,
ఏడుకొండలోని ఏడితివిరో ,,
ఎగనామమే బెడితివిరో ,,

గుళ్ళ గోపురాలంటివిరో ,,
గుడికి కప్పెలు అంటివిరో ,,
కొట్టాలు కట్టుకుంటివిరో ,,
కోతిమొక్కులు మొక్కితివిరో ,,
కొబ్బరికాయలు దింటివిరో ,,
కోటికిపడగాలెత్తితివిరో ,,
బీదలకడుపు గొడ్తివిరో ,,
నువ్వు బియ్యపుమిల్లెపెడ్తివిరో ,,
కడుపుకుజాలని పేదోళ్ళమురో ,,
అందరొక్కటయితిమిరో ,,
భూములు దున్నుకుంటిమిరో ,,
భూములు దున్నుకుంటాఅడ్లాని ,,
పోలీసుక్యాంపు దెత్తివిరో ,,
కిరాయిమనుసుల దెత్తివిరో ,,
కోల్లు గొర్లు నువుకోస్తివిరో ,,
కల్లు సారలే పోస్తివిరా ,,
అరె ఇనపు కన్నెర్రజేత్తివిరా ,,
కూడులేని కూలోల్లంతా ,,
కూలిపెంచుమని అడిగిండ్లురో ,,
కూలిబందు వారుసేసిండ్లురో ,,
కూలోల్లమజ్జెన పుల్లలేత్తివిరో ,,
కూలోల్లను విడదీయజూత్తివిరో ,,
అరె! ఇంకెంతకాలమొ సాగదిరా ,,
పేదలమంతా కలిత్తిమిరో ,,
ఎర్రజెండనే పడ్తిమిరో ,,
నీ ఎత్తులుజిత్తులు సాగయిరో ,,
నీ పనిబట్టే పోతంరో ,,

వ్యవస్థలో వస్తున్నమార్పులు, పాలకవర్గాల దోపిడీచే పీల్చిపిప్పి చేయబడ్డ శ్రమపరాయీకరణ పరితాపంతో అమానుషమైన ఒంటరితనం, నిరాశ, నిస్పృహలకు లోనుగాకుండా వాడుకవిలువల స్వర్గం లాంటి పరికృతితో, ఆ స్వర్గంలోని పువ్వుల్లో,

వెలుగుతో, వెన్నెలతో, పంటల్తో ఏకమయి వాటినుంచీ ఉత్తేజాన్ని, ఆశనూ, ప్రేమనూ పెంచుకుంటూ అనాదిగా జీవిస్తున్న పేదరైతాంగం తమ జీవితాన్ని తిరిగి చిగురింపజేసుకోవడాన్కి పోరాటమొక్కటే మార్గమని గ్రహించి. ఆ సత్యాన్ని "బతుకుపాట"లో కవితాపరంగా చెప్పిన తీరుకు బూర్జువా కవిత్వం తలవొంచుకోవాల్సిందే. తెల్లని చేతుల్లో నెత్తురు పేరగా, గవ్వలవలె పొక్కులు లేవగా కోతపనిచేసిచేసి "పేదలసమంత పెయిమీద" వేసుకునిబతికే చెల్లి తన అక్కల్తో అంటున్నది ఈ ఉయ్యాల పాటలో: "సినుకు సినుకుల వాన / సిత్తారివాన / గంగాదారిలోన / బంగారివాన - ఉన్నోడి లోగింట్ల / పన్నీటివాన / లేనోల్లగుడిసెల్ల / కన్నీటివాన" అని ప్రకృతి ఒడిలో దాపుడిద్దుకున్న బతుకుబాటలో ఆ చెల్లి వ్యక్తీకరించేది బాధా? సంతోషమా? బూర్జువా కవిత్వంలో కృత్రిమంగా ఉపయోగించే "తియ్యటిబాధ" వంటి ఆక్జీమొరాన్(Oxymoron)నా? ఆమె వర్ణనలోని సహజత్వం, నిండుదనం వర్గచైతన్యమనే సామాజిక సత్యంనుంచి వచ్చిందనుకుంటాను నేను. "తినతిండిలేదు / తలకు సమురులేదు / సిల్లుల బట్టల్ల / సితికిపోతున్నాము / మీకన్న గాగడ్డి / పోసలే నయమాయె / పచ్చటి ముసుగేసి / పువ్వులే పూసినయ్."

"గడ్డిపోస" ఈ పాటకు ప్రాణప్రదమైన సామాజికప్రతీక. సామాజిక చైతన్యంలేని గడ్డిపోచలు పచ్చటిముసుగేసుకుని, పూలుపూసి అందంగా, ఆరోగ్యంగా, స్వేచ్ఛగా ఉన్నాయి. కాని తామూ, తనఅక్కలు చిల్లులుపడిన బట్టల్లో చితికిపోతున్నారు. మరి దుక్కులుదున్నే అన్నలు? పెద్దపెద్దకు నెత్తురోడగా, సాలుసాలుకు చెమట కారిపోగా వారిశరీరాలు "సీకుపట్టిననెత్త / సినిగినడుకయిపాయె". శరీరంచెత్త, ఆత్మమాత్రమే నిజమైనదన్నభావం భూస్వామ్య భావజాలంలో శ్రమజీవులకు పాలకవర్గాలకు కొమ్ముకాచే వేదాంతులు నిత్యంనూరిపోసేభావం. దుక్కిదున్నే అన్నల శరీరాలు వారిశ్రమశక్తిని భూస్వాములు పీల్చివేయగా "చినిగినతడిక" లయ్యాయని చెల్లి అర్థం. వాళ్ళకన్న పంటచేలేనయం. ఎందుకంటే అవి "కడుపునిండపంట / కప్పుకొని ఉన్నాయి" అంటుంది ఆమె.

కూలీనాలీజనం గడ్డిపోసల్తో సమానం. ఈ ప్రతీకలో ఎంతధ్వని: "గడ్డిపోసలతీరు / కలిసిబతుకుదాము" గడ్డిపోసలుకలిస్తే. వాటితో పేలినతాడేకదా గజరాజును బంధించేది. "లేగదూడలతీరు / కూడిబతుకుదాము." సహజత్వానికి, స్వేచ్ఛకు, వాత్సల్యానికి, ఆటపాటలకు ప్రతీక. గడ్డిపోసల ప్రతీకలో శ్రమజీవుల ఐక్యత, పోరాటమేకాదు. శ్రామికవర్గ నియంతృత్వంద్వారా ఏర్పడబోయే సోషలిస్టు

సమాజంలో మనుషులు, శ్రమశక్తులు, వారివిలువలు ప్రపంచాన్ని ఉన్నతదశకు చెందిన వాడుకవిలువలస్వర్గంగా మార్చగలరన్న ధ్వనికూడావుంది. అయితే ఈ పాట పాడిన శ్రమజీవి ఈ ధ్వనిని చారిత్రిక గతితర్కపరంగా ఉద్దేశించినాడని నాఉద్దేశ్యం కాదు.

శ్రమజీవులపోరాటంలో వారికున్న ఆయుధాలు "కొడవండ్లు గొడ్డండ్లు / మన సేతులు" వాళ్ళు శ్రమించడానికి మిగిలినఉపకరణాలు. వాటిని ఆయుధాలుగా చేసుకొని కూలిరాజ్యంకోసం పోరాడితే "పంటసేన్లతీరు / పకపకానవ్వేము" అంటుంది చెల్లి. కూలిరాజ్యంలో శ్రమశక్తి అదనపువిలువ రూపంలో దోపిడీచేయబడదు. పంట చేన్లలోపంట, రైతుకూలీల శ్రమఫలం రైతుకూలీలకే దక్కుతుంది. నిరాశ, దుఃఖం, బాధ వగైరాలుండవు. సమాజంలో సహజమయిన సంతోషం ఒక వాడుకవిలువగా అందరికీ అందుబాట్లో ఉంటుంది.

పోరాటం ఈనాడు ఆశయం, కలమాత్రమేకాదు. అది ఒక వాస్తవం. "తెలంగాణ గడ్డమీద" పక్క "ఎఱ్ఱిటిబాట"ల్లో వెన్నెలపగలబడి నవ్వుతున్నది. కొత్త ప్రపంచాన్నూహించుకుని, వెన్నెలకోనల్లో, వెలుగుబాటల్లోనడచి, తమత్యాగాలతో సత్తెమన్న, భాస్కరన్న, అంకమ్మ, నిర్మలక్క, పెద్దిశంకర్‌లవంటి విప్లవయోధులు ప్రజల్లో వేలసూర్యుల్ని వెలిగించారు. అదిలాబాదు మండుతోంది. జగిత్యాల, సిరిసిల్లాల్లో రణం రాజుకుంది. "మర్రిచెన్న నగ్నంగా భూస్వాములకాపాదే కంకణం కట్టిం"డు. పుట్లకొద్దీపోలీసోల్లు కాంపులుపెట్టి

రైతుకూలి నవ్వైనా
రివ్వుమంటె గువ్వైనా
మొగ్గఇచ్చి పువ్వైనా
అంబాఅంటె ఆవైనా
అలజడి.... ("జగిత్యాలదిక్కుసూడు")

అంటున్నరు. హత్కడీలేస్తున్నరు. కాని సూర్యుడు, చెంద్రులే చుట్టాలైవచ్చి సుత్తి కొడవలిగా మారినప్పుడు వాళ్ళెవర్నని బంధింపగలరు!

రైతాంగ పోరాటాల సరసనే తునికాకు పోరాటం, సింగరేణి కార్మికుల పోరాటాల్లోంచి వచ్చిన పాటల్లో శ్రామికవర్గ చైతన్యం స్పష్టంగాకన్పిస్తుంది. ప్రత్యేకించి ఆదిలాబాదు గోండుల పాటల్ని పరిశీలిస్తే నిన్నమొన్నటిదాక అడవిగర్భంలో పోడు

వ్యవసాయం చేస్తూ నాగరికతకు దూరంగా ప్రకృతితో అత్యంత సన్నిహిత జీవితం గడిపిన గోండ్లు దోపిడీదారుల ఉక్కుకోరల్లో చిక్కుకొన్న కొద్ది కాలంలోనే వారి దోపిడీ స్వభావాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకున్నట్లు కన్పిస్తుంది. బూర్జువా పండితులే సరిగ్గా అర్థంచేసుకోలేకపోయిన శ్రమశక్తి పరాయీకరణ, అదనపువిలువ దోపిడి లక్షణాల్ని వారు పూర్తిగా ఆకళింపు చేసుకొన్నట్లు తెలుస్తున్నది: "తాకరోకొయిదాదా" అన్న పాటలో గోండుకవి అంటాడు.

అడివినంత నరికి నరికి
పండ్లతోట లేసినోడ
భూమిని తలకిందుజేసి
బువ్వపంచి పెట్టినోడ
గింతకు గంతజేసి
గింతకైన నోచనోడ

అని. అతడు శ్రామికవర్గ చైతన్యాన్ని పొందుతున్న వ్యవసాయకూలీ. "గింతను గంతజేసి / గింతకైన నోచనోడు" తన శ్రమశక్తితో హెచ్చైన మారకపువిలువను అదనపువిలువగా సృష్టించి వర్గసమాజంలోని నాగరికతకే మూలమయిన అతడు కనీసం కడుపునిండా తిండికి కూడా నోచుకోనివాడై పోయాడు.

కవితాపరంగా, ఆలోచనాపరంగా ఈ వ్యవస్థలో జరుగుతున్న అన్యాయాన్ని ఇంతకంటె బాగా వర్గసమాజంలోని ఏకవి చెప్పగలడని నేననుకోను.

---

మరలా యుద్ధంచేయ
తరలీ రారండయో
ప్రజలా యుద్ధంచేయ
కదలీ రారండయో

నదిని సాది అడవి పెంచి
నెత్తుకోడ్చి పత్తివేసి
పోడుచేసి గోడుగోడు
బతుకునీడ్చే గోండన్నలు ॥మరలా॥

అల్లూరిని అందుకొని
భీమన్నను పిలుచుకొని
కొమురన్నను తలచుకొని
కోరన్నను నిలుపుకొని ॥మరలా॥

బాబెఝరీ పిప్పల్‌ధరి
బతుకుపోరు నేర్పినాయి
జోడెన్‌ఘాట్ ఇంద్రవెల్లి
త్యాగచరిత తీర్చినాయి ॥మరలా॥

ఇంద్రవెల్లి కార్చిచ్చు
ఇందిర రాజ్యంకూల్చె
రగల్‌జెండ తుడుంమోత
నేలనింగి తలనుదాల్చె ॥మరలా॥

గోండన్నలు కోలాములు
పరధానులు పీడితులు
అడవి ఊరు నిప్పు నీరు
అడుగులోన అడుగేసి ॥మరలా॥

# 'ఇంద్రవెల్లి స్థూపం ఆదివాసి మనస్తత్వానికి, చైతన్యానికి, పోరాటానికి సంకేతంగా ఉండాలన్నది పార్టీ ఆశయం'

1981 ఏప్రిల్ 20న ఇంద్రవెల్లిలో పోలీసుకాల్పుల్లో మరణించిన జ్ఞాత అజ్ఞాత ఆదివాసి మృతవీరుల సంస్మరణచిహ్నంగా అదేస్థలంలో నిర్మించినస్థూపాన్ని 83 ఏప్రిల్ 20న కామ్రేడ్ గద్దర్ ఆవిష్కరించాడు. ఆ సాయంత్రం జరిగిన బహిరంగ సభలో గిరిజన రైతుకూలీసంఘం నాయకులు హనుమంతరావు, కటి, జంగు, పౌరహక్కులసంఘం నాయకులు కన్నాబిరాన్, ప్రదీప్ ప్రసంగించారు. అల్లం రాజయ్య, సాహులు రచించిన 'కొమురంభీం' చారిత్రికనవలను బాలగోపాల్ ఆవిష్కరించి గిరిజన రైతాంగపోరాటాల్లో సీతారామరాజు, కొమురంభీంల పాత్రగురించి వివరించాడు. ఆదిలాబాద్ గిరిజన సహాయనిధి కమిటీ కన్వీనర్‌గా వరవరరావు, ఇంద్రవెల్లిలో స్థూపనిర్మాణానికి బాధ్యతవహించిన గంజి రామారావుకూడ ప్రసంగించారు. గోండుపాటలు, ఇంద్రవెల్లి ఒగ్గుకథ మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలను జననాట్యమండలి నిర్వహించింది.

స్థూప ఆవిష్కరణను, గోండునృత్యాలను, తుడుంవాద్యాలను, పాటలను, ఊరేగింపును, విప్లవఉత్సాహ ఉత్సవదృశ్యాలను తపన్‌బోస్‌బృందం ఫిల్మ్‌కరించింది. ఈసందర్భంగా రెండుసంవత్సరాలుగా ఇంద్రవెల్లినే ఇల్లుగామార్చుకుని అరవైఏళ్ళ వయస్సులో ఆదిలాబాదు ఎండలనూ, చలినీ పోలీసుల నిఘా నిర్బంధాన్నీ సహిస్తూ ఇప్పటివరకు దేశంలోనే ఎక్కడాలేనంత అపూర్వంగా గిరిజన మృతవీరుల సంస్మరణ కోసం స్థూపనిర్మాణాన్ని నిర్వహించిన ఆంధ్రప్రదేశ్ రైతుకూలీసంఘం అధ్యక్షులు గంజి రామారావుగారిని ఆదిలాబాదులో ఏప్రిల్ 21న రత్నాపూర్‌కు వెళ్ళడానికన్నా ముందు కొంచెం తీరికగాకనిపిస్తే ఇంటర్వ్యూ చేసాను. ఆయనకూడా అలసట తీర్చుకోవడంకన్నా ఒక మహత్తరకార్యాన్ని తనకు ఓపికంత మేరకు నిర్వహించిన నిజమైన తృప్తితోకనిపించాడు.

ముందు ఆయన స్థూపంవివరాలు ఇచ్చాడు.

ఎత్తు 53 అడుగులు. దానిపైన ఏడుఅడుగుల జెండాకర్ర (పోల్) దానిమీద సైకిల్‌చక్రమంతవలయం. అందులో సుత్తీ-కొడవలి. 12 అడుగులు అడుగు (బేస్) 20 అడుగులు వేదిక. 18 అడుగుల పొడవు 12 అడుగుల వెడల్పుమెట్లు. స్థూపమంతా ఎరుపురంగు. దానిపై రెండు పాలరాతిఫలకాలు

ఒకదానిపై మావోకవితనుంచి చరణాలు :

'ప్రజావీరులు మృత్యుంజయులు'

PEOPLE'S HEROES ARE IMMORTAL
THOSE MOUNTAINS RED
AND THE FLOWERS RED
OH! THEIR DEATH IS RED
AND OUR HOMAGE RED

మరొకఫలకంపై - 'గిరిజన రైతుకూలీ మృతవీరుల స్మారకస్థూపం' అని తెలుగు హిందీ ఇంగ్లీషులోచెక్కి- 'భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) పీపుల్స్ వార్' – 'ఇంద్రవెల్లిలో కిరాతక పోలీసుకాల్పులలో నేలకొరిగిన గిరిజన రైతుకూలీ మృతవీరులకు విప్లవజోహార్లు' – సమర్పించింది.

'మా పార్టీ ఇంద్రవెల్లిస్థూపం గిరిజన రైతుకూలీ మనస్తత్వానికి, చైతన్యానికి పోరాటానికి సంకేతంగా వుండాలని ఉద్దేశించింది. ఆ ఆశయానికి ఆకృతిఇవ్వటానికి నావల్ల కాగలిగినంత చేసాను' అన్నారు రామారావుగారు.

'నిటారుగా ఆకాశంలోకి నిలిచినస్థూపం రైతుకూలీల తలదించని మనస్తత్వానికి నిదర్శనం. తల, మెడ, బలంగా, దృఢంగా - పోరాటానికి ఎదురుగా నిలబడ్డట్టు- మునుముందుకూడ నిలబడతారని....'

'స్థూపం శిఖరం గిరిజనుడి శిరస్సు అయితే దానికింద గిరిజనుడి మెడపెఠ మాంసల ఆకృతి- రెండుపట్టీలు- గిరిజనులు వేసుకునే నగలు.'

'నాకు తెలిసినంత వరకు దేశంలో ఎక్కడా లేనంత పెద్దది ఈస్థూపం. ఇటీవల చైనాలో టీన్‌మీన్ స్క్వేర్‌లో వాళ్ళు తమ మృతవీరులకోసం నిర్మించిన స్థూపాన్ని చూసిన తర్వాత ఇంద్రవెల్లికి కూడ అటువంటి స్మారకాన్ని నిర్మించాలని నాకనిపించింది.' అన్నారు రామారావుగారు.

'ఈస్థూప నిర్మాణ చరిత్ర వివరిస్తారా' అని అడిగితే,

"దాదాపు రెండు సంవత్సరాలక్రితమే ఈ స్థూప నిర్మాణంకోసం స్థలం కొన్నాం. సరిగ్గా ఈ నెలలోనే పోలీసుకాల్పుల్లో మరణించిన గిరిజనులు ఒరిగారు. రోడ్డుకు ఆవైపునవున్న చెట్లమీదినుంచి పోలీసులు కాల్చారు. ఇటువైపు గిరిజను

లను తరుముతూ వెంటబడికాల్చారు. స్థలంకొని నిర్మాణం తలపెట్టిన దగ్గరినుంచీ నేనిక్కడే రూంతీసుకొని వున్నాను. ఏప్రిల్ 20, 82న స్థూప నిర్మాణం కోసం పునాది తవ్వాం. అప్పుడు జరిగిన సభకు పోలీసులు ఒక్క గిరిజనుణ్ణికూడ రానివ్వ లేదు. స్థూపనిర్మాణం ఒకస్థాయికి వచ్చిన దగ్గరినుంచీ గోండులు ఆసక్తి చూసారు. నిర్మాణానికి ఏభై వేలరూపాయలు ఖర్చయినవి. ప్రతి సోమవారం సంతకువచ్చే గోండులు ఆసక్తితో ఇక్కడికి రావడం ప్రారంభించారు. గోండులే లారీనిండా కర్రలు తెచ్చిపడేసారు. అడవి అధికారులు అడ్డగించినా 'ఎవరికి చెప్పుకుంటారో చెప్పుకోపోండి' అని ధిక్కరించి తెచ్చిపడేసారు, సంతకు వచ్చేపుడు తెచ్చుకునే వాళ్ళరొట్టెలుతెచ్చి నాకు పెట్టేవాళ్ళు. ఈ స్థూపం దగ్గరకూర్చొని వాళ్ళ సద్దులువిప్పు కుని తినేవారు. వాళ్ళ రక్తబంధువుల జ్ఞాపకాలు పంచుకునే వారేమో' అని ఉద్వేగ భావంతో చెప్పారు.

ఈసారి ఇంద్రవెల్లి స్థూపావిష్కరణ ఉత్సవానికి ఆవూరివాళ్ళు ఏడువేలరూపా యలు విరాళాలు ఇచ్చారు. ఇంద్రవెల్లిలోవున్న మరాఠీస్త్రీలుకూడ సాయంత్రాలువచ్చి ఇక్కడ నిలబడి ఆసక్తిగా స్థూపాన్ని చూసేవాళ్ళు. లంబాడీలు చూసేవాళ్ళు. పార్టీ ఒంటరిగా తలపెట్టి ప్రారంభించినట్లు కనిపించిన కార్యక్రమం క్రమంగా ఈప్రాంత ప్రజలు తమ స్వంతంగా భావించుకునే ఒక పవిత్రకార్యంగా, మహత్తర బాధ్యతగా మారింది.

'ఏప్రిల్ 19 రాత్రి జాతర చేసారు. అక్కడికి ఏడువందలమంది గోండులు వచ్చారు. 20 న స్థూపందగ్గర జాతర వెయ్యిమంది వచ్చారు. పోలీసుల బెదిరింపు నిర్బంధం లేకపోతే ఇంకా ఎక్కువే వచ్చేవారు. గోండుల సంప్రదాయంలో మృత వీరుల చిహ్నమైన కర్రస్తంభం పాతారు. రగల్‌జెండా ఒక పక్కన, సుత్తికొడవలి జెండా ఒక పక్కనకట్టారు. మేకలను బయటకోసి లోపలిభాగాన్ని ముక్కలుముక్కలు చేసి నృత్యం మొదలుపెట్టారు.' గోండుల సంప్రదాయం, కమ్యూనిస్టుల సంప్ర దాయం కలగలసిన ఉదంతాన్ని ఆసక్తిగా వివరించారు రామారావుగారు.

"ఫిబ్రవరి 15న కేస్లాపూర్ జాతర జరిగింది. అక్కడ గోండుల దేవత 'నాగోబా' దేవాలయంవుంది. కరీంనగర్ నుంచి లక్సెట్టిపేట, ఉట్నూరు, ఇంద్రవెల్లిల మీదుగా ఆదిలాబాదుకుపోయే రోడ్డుమీద ముత్తనూరు నుంచి లోపలికి పిట్టబొంగరంకు వెళ్ళే తోవలో రోడ్డుకు 6 కిలోమీటర్ల దూరంలో కేస్లాపూర్ వుంటుంది. ఈ జాతరకే

82 జనవరిలో గోండుల సమస్యలు తెలుసుకోవడానికి సురేంద్రమోహన్, ఎంపి, కన్నాభిరాన్ మొదలైన వాళ్ళువస్తే పోలీసులు అరెస్టుచేసారు. ఈసారి ముఖ్యమంత్రి ఎన్టీరామారావును తీసుకరావాలని స్థానికనాయకులు, అధికార్లు ఆలోచించారు. గత సంవత్సరం కేస్లాపూర్ కువస్తే ఇంద్రవెల్లి లాగవుతుంది అని బెదిరించిన పోలీసులే ఈసారి మారుమూల గూడాలకువెళ్ళి కేస్లాపూర్ రమ్మని గిరిజనులకు చెప్పారు. ఎందుకుతోచిందో, ఎట్లాతోచిందోకాని 'మేం కేస్లాపూర్‌రాం. మాకింక ఇంద్రవెల్లే జాతర' అనేమాట అన్ని గోండుగూడాల్లో పుట్టింది.

'పోలీసు అధికారులు నన్నువచ్చి అడిగారు. మీరు గోండులను కేస్లాపూర్‌కు వెళ్ళవద్దన్నారా' అని. నేనాశ్చర్యపోయాను. ఇంద్రవెల్లి కేస్లాపూర్‌కు పోటీకాదని చెప్పాను. గోండులు అలా స్వచ్ఛందంగా నిర్ణయించుకుంటే అందుకు ప్రభుత్వ వైఖరియే బాధ్యత వహించాల్సి వుంటుందని చెప్పాను. ఏమనుకున్నారో ఏమో కేస్లాపూర్ జాతరకు ఎన్టీఆర్‌ను పిలవడంగానీ, ఆర్భాటంగానీ అధికారులు వదులుకున్నారు'

తాను రెండేళ్ళుగా ఇంద్రవెల్లిలో చూస్తున్న దోపిడీ గురించికూడ గంజి రామారావుగారు క్లుప్తంగా వివరించారు. "జొన్నలు, ఆముదాలు, పత్తి, విప్పపూలు–పెద్దపెద్ద మూటలు కట్టుకొని గూడాలనుంచి గోండులు రోడ్డెక్కుతారు. రోడ్డుపొడుగునా చెట్లకింద మార్వాడీలు త్రాసులుపెట్టుకొని కూచొని కొంటుంటారు. సంతరోజు పెద్దపెద్ద మోపులుగా కర్రలు, కందులమూటలు తెస్తుంటారు. చెట్లకింద మార్వాడీలకే అడ్డికిపావుశేరు అన్నట్లు అవిఅమ్మి ఊళ్ళోకివచ్చి తమ నిత్యావసరాలు కొనుక్కుంటారు. నిజానికి మార్వాడీలకు కట్టెలు, జొన్నలు ఏవీ అవసరంలేదు. ఎగుమతిచేయడానికి కొంటారు. తాము తెచ్చిన వస్తువులు అమ్మేచోట తూకంలో, ధరలో మోసం, దగా. తిరిగికొనేచోటా అంతే. రెండుచోట్లా మార్వాడీలే. అడవిలో అసలు గిరిజనులకు డబ్బు వినిమయం (exchange) లేదు. అడవిలో వాళ్ళను అటవీశాఖ అధికార్లు, జవాన్లు దోచుకుంటారు. నేనింకా మారుమూల గూడాల్లోకి వెళ్ళి చూడలేకపోయాను." అన్నారు కరీంనగర్‌లో రైతుకూలీ సంఘం రాష్ట్ర మహాసభల ఏర్పాట్లకు తరలిపోతున్న రామారావుగారు.

— వి. వి.

## పోరుపతాకనెత్తరా

సాహం

బోడగుట్టమీద పొద్దున్నది
లంబాడి పెద్దవ్వ ఒమ్మన్నది
ఓ హరిభూషణ మారణభీషణ
నీ పేరు చెప్పితే నీ ఊరు చెప్పితే
కళ్ళనీళ్ళుదీసి కథలు చెప్పిందిరా!
కన్నెర్రజేస్తూ జోహార్లు పలికింది....

* * *

ఓరుగల్లు పోరుగల్లు
వీరగడ్డ పోరుబిడ్డడు
జనంకోసం - రణంకోసం
జబ్బచరిచి - సాగినోడు
నెత్రుదారిన - ఒరిగినాడు
తూర్పుతండలో - సూరీడు
అరుణకాంతిగ - నిలిచినాడు
నిన్నుచంపి నిలుపలేని
విప్లవాల నాపలేని
కళ్ళనీళ్ళుదీసి కథలు చెప్పిందిరా
కన్నెర్రజేస్తూ జోహార్లు పలికింది

* * *

## ఆదిలాబాదు గిరిజన సహాయ నిధి

| | | రూ. పై. |
|---|---|---|
| 1. | వసూలైన డబ్బు | 18797-78 |
| 2. | ఒక బంగారుఉంగరం, 4 వెండిపట్టెలు అమ్మగా ( చూ॥ మార్చి 1982 సృజన ) | 443-00 |
| 3. | ఇంద్రవెల్లి - కవితాసంకలనం - సృజన ప్రచురణ అమ్మగా వచ్చినడబ్బు | 470-00 |
| 4. | బ్యాంకునుంచి వడ్డీరూపంలో వచ్చినది (ఇందులోనుంచి ఖర్చులు మినహాయించబడినవి) | 740-00 |
| | మొత్తం రూ. | 20450-78 |

1982 డిసెంబర్ 11, 12 తేదీలలో పిట్టబొంగరం, పాండుగూడెం గ్రామాలకు వెళ్ళి డబ్బుపంచిన వివరాలు :

| | | |
|---|---|---|
| 1. | మృతవీరుల కుటుంబాలకు | 12 × 1000 = 12000-00 |
| 2. | వికలాంగులకు | 7 × 450 = 3150-00 |
| | | 1 × 400 = 400-00 |
| 3. | తీవ్రగాయాలుఅయినవారికి | 6 × 350 = 2100-00 |
| 4. | స్వల్పగాయాలయినవారికి | 18 × 150 = 2700-00 |
| | | 1 × 100 = 100-00 |
| | మొత్తం రూ. | 20450-00 |

ఈ కృషిలో సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు.

సం॥ కన్వీనర్

ఎమర్జన్సీ రోజులల్లో
లోకమంతా చీకటయితే
రక్కసులే రాజ్యమేలితే
చిన్నన్నతో చెయ్యికలిపి
వెలుగురేఖగ సాగినోడు
నల్లబెల్లి పోరు పొలమున
ఎర్రిమొలకగ పెరిగినోడు
కసుగాయగ వుండినోడు
విప్లవంలో పండినోడు
తండ తండల లంబడన్నల
గుండెలల్లో ఎర్రిజండయి
గూడుకట్టి నిలిచినోడని
కళ్ళనీళ్ళుదీసి కథలు చెప్పిందిరా
కన్నెర్రిజేస్తూ జోహార్లు పలికింది

* * *

చింతలపల్లిలో చింతలున్న
రైతు-కూలీ అన్నల కల్సి
ఎర్రిజండా పోరుజండని
పోరేవానిదే ఎర్రిజండని
సుత్తికొడవలి కత్తిగాళ్ళ
'మార్క్సిస్టు' మూర్ఖిస్టుల
రంగుబయిట పెట్టినోడు
చింతనిప్పులు చెరిగినోడు....
కళ్ళనీళ్ళుదీసి కథలు చెప్పిందిరా
కన్నెర్రిజేస్తూ జోహార్లు పలికింది

* * *

కొడుకు మాటలు ఉరుములో
కొడుకు చూపులు మెరుపులో
కొడుకు అడుగులు భూస్వాముల
గుండెలల్లో పిడుగులాయె
కొడుకు రక్తం ధారపోసి
విప్లవాల కోండ్రిలేసే
ఏనుగల్లు భూములల్లో
జొన్నసేను ఎన్నులేసే
రంగంపేట ఎర్రికొండయి
రత్నాలపంటదీసేరా !
కళ్ళనీళ్ళ పెట్టబోకు
కథలు ఎన్నిచెప్పరా !
విషాదానికి వీడ్కోలని
విప్లవాల శంఖంఊదరా !
ఏతల్లి కడుపంటో
ఏపల్లె ఎర్రిమల్లో
సత్యమన్న తమ్ముడు
దోపిడికి బాకువాడు
నక్సలైటయి నాఇంటవొరిగే
పలుదిక్కుల వెలుగుచెరిగే
ప్రజాయుద్ధం దారిలోన
నవ్వుకుంటు నడిచెటోడ-
రొట్టైకారం తినిపోర
పోరుజండా నెత్తుకోర
బోడగుట్టమీద పొద్దున్నది
లంబాడిపెద్దవ్వ రమ్మన్నది-

(వరంగల్ జిల్లా ఏనుగల్లు తూర్పుతండ గ్రామంలో పోలీసుకాల్పుల్లో మరణించిన కా॥ మామిడాల హరిభూషణ్ స్మృతిలో)

ఏప్రిల్ 22 లెనిన్ జయంతి :

# లెనిన్

సుకాంత భట్టాచార్య

అసమానతమీద సవాలుజేసి
దానితో మొదట తలపడ్డవాడు లెనిన్
అసమానత ఆనకట్టని తుడిచిపెట్టేసిన
రష్యన్ ప్రజావెల్లువను నడిపించినవాడు లెనిన్
సుదూర దూర స్వేచ్ఛా సరిహద్దుల్ని కాపాడుతూ
రష్యా పల్లెల్లో పట్నాల్లో
ఈనాటికీ వేలాదిలెనిన్లు పోరాడుతున్నారు
దేనికోసమైతే
ఏ సుదినం కోసమైతే
సకల ప్రపంచం ఎదురుచూస్తున్నదో
ఆ వైపు
మెరిసే చూపులతో
స్థిరంగా
లెనిన్ల సమూహం పురోగమిస్తున్నది
లెనిన్ సైనికుల విజయవార్తలు వింటున్నకొద్దీ
పెట్టుబడీదారీ సమాజం
మింగలేనీ కక్కలేనీ అశక్తతలో ఆక్రోందించింది
కోటీశ్వరుల ముసుగు బదాబదలైంది
వారి కుహకాలు చెల్లేరోజు పోయింది
హృదయాల్లోవెరపు
ముఖాల్లో నేత్రాల్లో భయంమాటున పరచుకున్న మృత్యుపీడ
విప్లవం విస్ఫోటనం చెందింది
యజమానుల గిట్టలకిందినుండి
జనం తమనుతాము విదుల్చుకుని విముక్తులైతే
హఠాత్తుగావచ్చిన వెల్లువ విప్లవాన్ని తెచ్చింది
హఠాత్తుగా వేగంగా చిమ్మినలావా

ఒకదేశంతరువాత మరోదేశాన్ని కుదిపివేసింది
ఇవాళ ఏవైపు తిరిగినా
ప్రతిదిక్కూ మనకువిన్పించే లెనిన్ మార్చింగ్ పాదాలు
నిప్పటిదాకా
నియంతృత్వంకింద ఘూర్ణిల్లిన కోట్లాదిగొంతుకలు
ఇవాళ ప్రతిచోటా
అతన్ని
సజీవ విప్లవసంకేతంగా పల్కరిస్తాయి
ప్రపంచమంతటా ప్రతియింట్లో
ప్రతి తల్లిగర్భంలోనూ మసలుతున్నబిడ్డ ఓ రేపటిలెనిన్
హృదాద్వేగ రక్తారుణ ప్రవాహం ప్రభాతకిరణ లెనిన్ని
పరాగమై ప్రపంచమంతా పంచుతున్నది
ఇటలీ జర్మనీ జపాన్ బ్రిటన్ అమెరికా చైనా
ఎక్కడ మహత్తర విముక్తిపోరాటాలు నడిచినా
అక్కడ అగ్రభాగాన నిలబడి కామ్రేడ్ లెనిన్

ఇండియాలోమాత్రం యింకా చీకటి పరిపాలన
ఇక్కడ ఆకలి శవాలను మోస్తున్న వీధులు
ఇక్కడ లక్షలాదిమందిని పరస్పర అవిశ్వాసం మింగేసిన
వ్యర్థ కలహాల ఊబి
ఇక్కడ ప్రతియింటి తలుపుమీదా
శత్రువు అహంకార పాదముద్రలు
ఇక్కడ ఆత్మన్యూనతలో భారంగాగడిచే దినాలు
దిగులు కప్పేసిన రాత్రులు
అయినా యిక్కడకూడా
బరువైన శత్రుసంకెళ్ళ వెనుక
ప్రజల బాధాభరిత నిశ్వాసాలవెనుక
నిశ్శబ్దంగా భూమికనేస్తున్నవాడు లెనిన్
అసమానతల ఆనకట్టని ధ్వంసంచేసేందుకు
ఉప్పొంగిన ప్రపంచ ప్రజ

లెనిన్ బాటను అనుసరిస్తారు
ప్రతిచోటా లెనిన్ అసమానతతో తలపడతాడు
పోరాడుతాడు
మేం మృత్యుసముద్రాన్ని అధిగమించాం
స్వేచ్ఛాపవనాల్లో విచ్చుకుంటున్న మా తెరచాపలు
గాలిలో తలలూపుతూ
దృగ్గోచరమవుతున్నాయి పచ్చని స్వేచ్ఛాతీరాలు
ఎర్రటి నెత్తుటిలోంచి లెనిన్లు పుడతారు
రుధిరారుణ విప్లవ భావాలతో
నా హృదయం ఉప్పొంగుతున్నప్పుడు
నేను లెనిన్నవుతాను

1944

బెంగాలీ సాహిత్యంలో సామ్యవాద దృక్పథంతో నక్సల్బరీ రైతాంగ పోరా టానికి పూర్వం సాహిత్య సృజన చేసిన ఉత్తమకళాకారులు మానిక్ బంధోపాధ్యాయ సుకాంత భట్టాచార్య. వీరిలో సుకాంత భట్టాచార్య బెంగాలీలకు ప్రియమయిన కవి

1926 ఆగస్టు 15న జన్మించి 21 సంవత్సరాలు మాత్రమే జీవించి '47 మే 12న మరణించిన సుకాంత ఉమ్మడి కమ్యూనిస్టుపార్టీ సాంస్కృతిక రంగాని సమర్పించిన అరుదైనకానుక.

13వ ఏటనే తల్లినికోల్పోయి ఇంటి ఒంటరితనం నుంచి బయటిప్రపంచాని చూసేనాటికి ప్రపంచమంతా అటు స్పెయిన్‌లో ఫ్రాంకోతెచ్చిన ఫాసిస్టు యుద్ధం ఇటు హిట్లర్, ముసోలినీ టోజోలు ప్రపంచానికంతా ఫాసిస్టు యుద్ధాన్ని విస్తరిం చేసిన ప్రమాదం ఆవరించివున్నాయి. అయితే అటు స్పెయిన్‌లో ప్రజాస్వామ వాదులు, ప్రపంచవ్యాప్తంగా సోవియట్ రష్యా నాయకత్వంతో ప్రజాస్వామ్యవాదు ఫాసిజానికి ఇచ్చిన ప్రతిఘటన యువ సుకాంతను కవిగా తీర్చిదిద్దింది. అందు ఆయన కవిత్వంలో ఫాసిస్టు వ్యతిరేకత అంతర్జాతీయ స్వభావంగా, వలసవిధా వ్యతిరేకత, స్వేచ్ఛా ప్రియత్వం జాతీయోద్యమ స్వభావంగా సంలీనమయ్యాయి చిట్టగాంగ్ (1943) కాశ్మీర్ (44) పోరాటాల గురించి లెనిన్, మేడేల గురిం ఆయన కవితలు రాసాడు. భారతనావిక తిరుగుబాటును బలపరుస్తూ పిలుపు (4 అనే పేరుతో ఆయన కుహానా జాతీయవాదులను అపహాస్యంచేస్తూ కవిత రాసా

(4వ కవరు తరువాయి)

బిర్లా అయినదానికీ కానిదానికీ సమ్మెలు చేయబట్టి దేశం నాశనమయిపోతోంది' అనే సిద్ధాంతాన్ని పెట్టుబడిదారీవర్గపు పత్రికలు మధ్యతరగతిలో విస్తృతంగా ప్రచారం చేసాయి. విజయవంతంగా చేసాయి. ఈమధ్య ఒకకొత్త వాదనగూడ మొదలయింది. అదీ మధ్యతరగతిలోకాదు, కోట్లమీదకోట్లు కూడబెట్టిన ఘరానా బూర్జువాలలో. అదేమిటంటే, 'ఈ కార్మికసంఘాలు ఇప్పటికే కొంతమెరుగయిన జీవితమున్న పారిశ్రామిక కార్మికుల గురించి పట్టించుకుంటాయేగాని, గ్రామాలలో అతినికృష్టంగా జీవించే వ్యవసాయకూలీలగురించి పట్టించుకోవు' అనేది. రెండువేలకోట్ల రూపాయలు కూడబెట్టుకున్న జి.డి. బిర్లాగాని ఆయనగారి దినపత్రిక 'హిందుస్తాన్ టైమ్స్'గాని ఈ మాట అంటే నవ్వురాదూ! కాని ఇది నవ్వుకోవలసిన విషయంకాదు, రాజకీయమయిన కుట్ర. ఒకతరంకిత్రమో రెండుతరాలకిత్రమో రైతుకాని కార్మికుడు మనదేశంలోలేడు. ఇప్పటికీ మనదేశంలోని కార్మికులు చాలమందికి గ్రామీణ పేద రైతాంగంతో సన్నిహితమయిన సంబంధం ఉంటుంది. రెండెకరాల చెక్కవున్న పండోత్రతాతో ఎక్కడోవుంటాడు. భారతదేశంలోని కార్మికకర్షక వర్గాలకు కేవలం వర్గబాంధవ్యం మాత్రమేకాదు, రక్తబాంధవ్యం సహితం వుంది. గోదావరిఖని సింగరేణి కార్మికులలో సగంమంది పెద్దపల్లి తాలూకా రైతుబిడ్డలు. బొంబాయివంటి మహానగరంలోని బట్టలమిల్లు కార్మికులలోగూడ ఎంతమంది చితికిపోయిన కరీంనగర్ నిజామాబాద్, నాందేడ్, పర్భనీ రైతు కుటుంబాల నుండి వచ్చారో లెక్కలేదు. భారతదేశంలో కార్మికకర్షక ఐక్యత కేవలం రెండు శ్రామికవర్గాల ఐక్యతకాదు, తండ్రి కొడుకుల ఐక్యత. ఒకే ఇంటికి చెందిన రెండుతరాల ఐక్యత. వీళ్ళమధ్య చీలికతెచ్చి ఒకరికి లేకుండా ఒకరు బాగుపడిపోతున్నారని నావల్‌టాటా అన్నా, శరద్ జోషి అన్నా అది కుట్రపూరితమయిన అబద్ధం మాత్రమే అవుతుంది.

చరిత్రనుండీ సంక్రమించిన ఈ ఐక్యతను విప్లవోన్ముఖంగా ముందుకు తీసుకపోయే కర్తవ్యం మనముందుంది. ఆర్థికపోరాటాలకు రివిజనిజం పరిమితంచేసి దత్తాసామంత్‌వంటి స్వార్థపరులచేతిలోకి నెట్టిన కార్మికవర్గానికి విప్లవమార్గంచూపి కార్మికకర్షక నియంతృత్వంక్రింద నడిచే నూతన ప్రజాస్వామ్యం దిక్కుగానడిపించే కర్తవ్యం మనముందుంది. బొంబాయి బట్టలమిల్లు కార్మికుడి కడుపుమాడినా, ఉట్నూరు గిరిజనుడి కడుపుఎండినా, ఉన్నావ్‌లో కార్మికులను కాల్చిచంపినా, అన్నారెడ్డిపల్లె గిరిజనులకు కాల్చిచంపినా, ఇది అన్నదమ్ములమీద జరిగేహింస అని గుర్తించి గుర్తింపజేసి ఈ హింసఆగాలంటే శ్రామికజనం తమ నియంతృత్వంక్రింద నూతన ప్రజాస్వామ్యాన్ని ఆవిష్కరింపజేయడమే మార్గమని చెప్పి ప్రజాయుద్ధపంథాలో నడిపించాలి.

కార్మిక - కర్షక ఐక్యత వర్ధిల్లాలి!

విప్లవం వర్ధిల్లాలి!

**SRJANA Telugu Monthly** May '83 H/HNK-3
Regd. No. with Registrar of Newspapers 10953/67

# మేడే

బొంబాయిలో రెండున్నర లక్షల కార్మికులసమ్మె 15 నెలలుగా రాక్షసుడిచితి మండినట్టు మండుతోంది.

చీరాలలో ఆధునికీకరణ పేరిట బ్రిటిష్ పెట్టుబడితోనడిచే ఐఎల్‌టిడి (పొగాకు కంపెనీ) 6 వేలమంది కార్మికులను నిరుద్యోగులనుచేసే పథకంమీద వుంది.

కలకత్తాలో జ్యోతిబసు ప్రభుత్వం 'శాంతిభద్రతలు' పకడ్బందీగా సంరక్షిస్తోందనీ 'పారిశ్రామికశాంతి'లో తలమానికంగా వుందనీ, కేంద్రంనుండి మెప్పు పొందడంకోసం సిఐటియు ను యాజమాన్యపు తొత్తుగామార్చి జనపనారమిల్లుల కార్మికులను సమ్మె చేయనీయకుండాచేసి, ఎప్పటినుంచో రగులుతున్న వాళ్ళ సమస్యలను అపరిష్కృతంగా వుంచుతోంది.

1946 బొంబాయి పారిశ్రామిక సంబంధాల చట్టం లాంటి చట్టాన్ని తయారుచేసి దేశమంతటా అమలుచేయాలనే గాఢమయినకోరిక భారత పాలకవర్గాలకు ఆదినుండి వుంది. ఇందులో జనతా - కాంగ్రెస్ వ్యత్యాసంలేదు. జనతాహయాంలో అటువంటి బిల్లొకటి తయారుచేసారుగాని పార్టీలోనే అభ్యంతరం వచ్చేసరికి ఉపసంహరించుకున్నారు. బడుగుజనాలపాలిటి అపరదుర్గఅయిన ఇందిరమ్మ 1980 లో తిరిగి అధికారానికి వచ్చిననాటినుండి అటువంటి ప్రయత్నాలు సాగుతున్నట్టు వదంతులు వినబడుతూనేవున్నాయి. ఆ పిడుగు కార్మికవర్గంమీద ఎన్నడు పడనున్నదో తెలీదు. పడిననాడు అది మరొక ఎమర్జెన్సీలాంటి నియంతృత్వ యుగానికి ఖచ్చితంగా నాందిఅవుతుంది. ఫాసిజం ఎన్నడూ కార్మికవర్గంమీద ముందుదాడిచేసి ఆ తరువాత మిగిలిన ప్రజాస్వామికవర్గాలను లోబరచుకుంటుంది. ఈ సత్యాన్ని హిట్లర్ నిరూపించాడు. ఎమర్జెన్సీకి నాందిగా రైల్వేకార్మికులను పాశవికంగా అణచిన ఇందిరా గాంధిగూడ నిరూపించింది.

ఈ వాతావరణంలో మార్క్స్ శతవర్ధంతి సంవత్సరపు మేడే జరుపుకుంటున్నాం. వ్యవసాయకూలీలకు, గిరిజనులకు, కనీసం మొసలికన్నీరో మాటసానుభూతో దొరుకుతాయి. కాని పట్టణాలలోని కార్మికులకు మధ్యతరగతి నుండి అవిగూడ దొరకవు.

(మిగతా మూడవ కవరులో)